

ప్రప్రథమ రష్యన్ రోదసీ యాత్రికుడు మేజర్ యూరీగగారిన్ డిశంబరు 6వ తేదీన హైద్రాబాదుకు వచ్చారు. ఆయన రాష్ట్ర ముఖ్యమంత్రిని కలుసుకున్న దృశ్యాన్ని పై చిత్రంలో చూడవచ్చు.



మేజర్ గగారిన్ గోలకొండ కోటను సందర్శించారు.

# ఆంధ్రప్రదేశ్

సంక్రాంతి ప్రత్యేక సంచిక

సంపుటి 6 | జనవరి 1962 | సంచిక 9

పుష్య-మాఘ 1883 శకం

# విషయసూచిక


| | | | | |
|---|---|---|---|---|
| 1. కవీనాంకవిః | ... | శ్రీదాశరథి | ... | 1 |
| 2. 'గురజాడ' కథలు వాటి ప్రత్యేకత | ... | శ్రీ కొడవటిగంటి కుటుంబరావు. | ... | 3 |
| 3. మహాకవీయం | ... | శ్రీ రాయప్రోలు సుబ్బరామయ్య | ... | 8 |
| 4. వెలుగుబాటలు | ... | 'ఉదయభాను' | ... | 9 |
| 5. కుటుంబనియంత్రణం | ... | శ్రీ దివాకరుని వెంకటసుబ్బారావు | ... | 11 |
| 6. కవితానీరాజనము | ... | "శశాంక" | ... | 16 |
| 7. మరీచిక (కథానిక) | ... | శ్రీ మధురాంతకం రాజారాం | ... | 17 |
| 8. ఆదనునమదుపు-అదే పొదుపు | ... | 'రోహిణి' | ... | 21 |
| 9. హిమంకరునిగాథ | ... | శ్రీ కల్యాణ్ సింగ్ | ... | 23 |
| 10. కన్యాశుల్కంలోని నాటకీయశిల్పం | ... | శ్రీ రామకృష్ణభరద్వాజ | ... | 28 |
| 11. ప్రభుత్వనిర్ణయాలు | ... | | ... | 34 |
| 12. ప్రగతిపథంలో | ... | | ... | 36 |
| 13. గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా | ... | | ... | 40 |
| 14. బాంధవ్యం (నాటిక) | ... | శ్రీ ఇసుకపల్లి లక్ష్మీనరసింహ శాస్త్రి | ... | 41 |
| 15. నవరలు-మతజాత్యాది విశేషాలు | ... | శ్రీ జి. వి. రామమూర్తి | ... | 45 |
| 16. నివాళి | ... | శ్రీ బులుసు-జీ-ప్రకాశ్ | ... | 50 |
| 17. రాష్ట్రవ్యాప్తంగా ప్రణాళికా వారోత్సవాలు | ... | | ... | 51 |
| 18. సంక్రాంతిలక్ష్మి | ... | శ్రీ శనగన నరసింహస్వామి | ... | 53 |

| | | | |
|---|---|---|---|
| 19 | పంచాయతీరాజ్య పురోగమనం | | ... 57 |
| 20. | అవతరించనినవల ... | శ్రీ డి. రామలింగం | ... 58 |
| 21. | ప్రశ్నోత్తరావళి ... | | ... 60 |
| 22. | సంగ్రహప్రకటనలు ... | | ... 63 |
| 23. | సాహిత్యము–ధర్మపథనిర్దేశము ... | శ్రీ టి. మధుసూదనరావు | ... 67 |
| 24. | సంక్షేమరాజ్యము ... | శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి | ... 73 |
| 25. | అభ్యుదయపథంలో 'పైన' గ్రామం ... | శ్రీ 'చక్రవర్తి' | ... 75 |
| 26. | పారిశ్రామిక విశేషాలు ... | | ... 77 |
| 27. | మందలింపు ... | శ్రీ కొల్లా శ్రీకృష్ణారావు | ... 79 |
| 28. | ఆంధ్రప్రదేశ్‌లో గుల్హాతీ కమిషను పర్యటన | శ్రీ టి. వి. కృష్ణ | ... 81 |
| 29. | "దేశంకోసం" ... | శ్రీ కుంటిమద్ది శేషశర్మ | ... 84 |
| 30. | ముఖ్యవార్తలు ... | | ... 87 |
| 31. | పౌషలక్ష్మి ... | శ్రీ కొత్త సత్యనారాయణచౌదరి | ... 90 |
| 32. | గ్రంథసమీక్ష ... | | ... 91 |

ముఖచిత్రం: కొత్తఢిల్లీలో జరుగుతున్న భారతపారిశ్రామిక ప్రదర్శనంలోని ఆంధ్రప్రదేశ్ మంటపం దృశ్యం. ప్రజలను ఈ మంటపం విశేషంగా ఆకర్షిస్తున్నది.

వెనుకఅట్ట: నెల్లూరుజిల్లా కావలికాలువ ప్రాజెక్టుస్థలం. రాష్ట్రముఖ్యమంత్రి ఇటీవల ఈ ప్రాజెక్టుకు శంకుస్థాపన చేశారు.

చందా వివరాలు

| | | |
|---|---|---|
| సంవత్సరానికి | — | 3 రూపాయలు |
| విడి ప్రతి వెల | — | 25 నయాపైసలు |

Edited & Published by the Director of Information & Public Relations, Andhra Pradesh, Hyderabad-1
Printed at Vir Milap Press, Mukarramjahi Road, Hyderabad.

# కవీనాం కవిః

శ్రీ దాశరథి

ఊళ్లు, రాష్ట్రాలు, దేశాల పరిధులు దాటి
మనిషి మనస్సులోని మంచి అనే వీణనుమీటి
మనీషి అనిపించుకున్న మహానుభావుణ్ణి
భావిస్తున్నాను, ఆ మధుర స్వభావుణ్ణి

ఆయన చందమామలా చల్లగా వుండడు
ఆయన సూర్యునిలా భగ్గున మండుతాడు
ఆయన మనకు చక్కిలి గింతలు పెట్టడు
మన్ని వేడి కిరణాల కొరడాతో కొట్టిలేపుతాడు

ఉప్పునీళ్ల ఉదధిని తాగేసి
గొప్ప గొప్ప మేఘాల్ని సృష్టించి
అమృత జలధారల్ని వర్షించే
అర్కుడు నిజానికి అసలైన కవి.

ద్వేషాల, రోషాల, దోషాలతో నిషా ఎక్కివున్న మనకు
మత్తుపోగొట్టి మేల్కొలిపే వేడి మనిషి కావాలి,
ఊ కొడుతుంటే జోకొట్టే వాడక్కరలేదు,
అందుకే ఆయన్ని నేనూ నాబంధువులూ అరాధించాం

నిత్యనూతనత్వాన్ని కాంక్షించే తేజస్వి అతను
కనుకనే ఆయన్ని సూర్యుడంటాన్నేను,
క్షణక్షణం క్షీణించడం రాదతనికి,
అతడు లోకంలోకి రోజూకొంత లేటుగా రాడు చంద్రుడిలా.

మంత్రంలా నాలుగు ముక్కలే ఉచ్చరించాడతను
బండ్ల కొద్దిగా చెత్తాచెదారం రాయలేదతను,

అతనుడిలా కనిపించకుండా అందర్లో వున్నాడతను.
అతను లేని తెలుగు హృదయగృహం లేదు

రాజుల ఉంపుడు కత్తెలమీద రాయలేదతను,
గాజుల గలగలలే కవిత్వ తత్వం అనలేదతను,
బాధితుల బంధనాలు తెంచాలని ప్రయత్నించాడు
పడుకున్న సోమరుల్ని మెడపట్టి లేపాడతను

ఇంతకూ అతనెవ్వరు? చెప్పవేం?
చెప్పకేం, చెప్పకేం, చెప్పకేం!
అయినా, మీకు తెలీకనా నన్నడుగుతారు?
ఆంధ్రుల సైన్యానికి అతడు సర్దారు.

అతడు అకవా! కుకవా! సుకవా!
అతడు కవీనాం కవి!



విను ధర్మంబున ధనమగు,

ధనమున సిద్ధించుఁ గామ తంత్రంబటుగా

వున మధ్యమంబు నధమము

ధనకామములుత్తమంబు ధర్మం బధిపా.

భారతము (శాం.ప.)



# "గురజాడ" కథలు - వాటి ప్రత్యేకత

శ్రీ కొడవటిగంటి కుటుంబరావు

తెలుగు సారస్వతంలో నాటకానికీ, కవిత్వానికీ, కథానికకూ శంకుస్థాపన చేసిన మహా పురుషుడు గురజాడ అప్పారావు. నాటకాల మాటా, కవిత్వం మాటా అటుంచి కథా రచనలో గురజాడ సాధించిన కొత్తదనం ఏమిటో, ఆయన కథలలో ఆధునిక లక్షణాలేమేమి ఉన్నాయో చూద్దాం

ఆధునిక యుగానికి పూర్వం మనకుండిన కథలు పాత కాలపు జీవితానికీ, చరిత్రకూ సంబంధించి ఉండేవి. ''అనగనగా ఒకరాజు" సర్వసాధారణమైన కథారంభం. ఆరాజు ఏకాలపువాడు? ఏ దేశాన్ని ఏలాడు? ఇత్యాది ప్రశ్నలు పుట్టేవికావు. ఆధునిక యుగంలోనే కథ అన్నది వర్తమాన జీవితాన్ని వివరించటం నేర్చుకున్నది. ఆధునిక కథలలో పాతకాలపు సంఘటనలకు తావే లేదని కాదు; రాయసం వెంకట శివుడుగారు భద్రాచల గోపన్న గాథ అధునిక కథగా రాశారు, సురవరం ప్రతాపరెడ్డిగారు దక్షిణ తీరానికి చెందిన ఒకస్థల పురాణగాథను అత్యంతరమ్యమైన కథగా రచించారు. అయినప్పటికీ సమకాలిక జీవితాన్ని కథలలో చిత్రించటం స్పష్టంగా ఆధునిక యుగ లక్షణం. ఈ లక్షణం అప్పారావు గారి కథలలో కనిపిస్తుంది. ఆయన కథల తొలి వాక్యాలు చూడండి: "పురాణములను గురించి మేము శంకలు వేస్తే, మా గురువుగారు ''వెధవ చదువు! మీ మతులు పోతున్నాయి. మీరు వొట్టి బౌద్ధులు" అనేవారు" ("మీ పేరేమిటి") 'తలుపు! తలుపు!' (''దిద్దుబాటు") "నేను వృక్షశాస్త్రము యమ్.యే. పరీక్షకు చదువుతూ వుండేరోజులలో మైలాపురి పెద్ద రోడ్డున ఒక మిద్దెయింట్లో బసచేసి వుంటిని." ("మెటిల్డా")

ఆధునికత యొక్క మరొక ప్రత్యేక లక్షణం వాస్తవికత. పూర్వకాలపు కథలలో కథానాయకుడికి గండభేరుండ పక్షుల భాష తెలిసి ఉండవచ్చు, కాని ఈ కాలపు కథలలో అసాధరణ శక్తులూ, మహిమలూ, ప్రజ్ఞలూ గలవాళ్ళకు స్థానం లేదు. ఈ పాత్రలు పాఠకుడికి వాస్తవ వ్యక్తులుగా ఉండాలి, వారి అనుభవాలు లోక విరుద్ధంగా ఉండరాదు. నిజానికి వాస్తవికత అనే లక్షణం సమకాలీనతను ఆశ్రయించుకున్నదే అపూర్వమైన, అద్భుతమైన వ్యక్తుల అసాధారణమైన అనుభవాలను కథగా రాయదలిస్తే వారిని గతంలోనే ఉండనివ్వటం మంచిది.... అప్పారావుగారి కథలలో వాస్తవికత నూటికి నూరుపాళ్లు మనకు కనిపిస్తుంది.

ఈ వాస్తవికత గురించి అప్పారావుగారికి గల పట్టుదలకు ఒక చక్కని ఉదాహరణ మనకు ఆయన కథలోనే కనబడుతుంది.

"మీపేరేమిటి?" అన్న కథలో శాయన్నభక్తకృష్ణమాచార్యుల భార్య అయిన నాంచారమ్మకు ఆంధ్ర గీర్వాణాలందు మంచి జ్ఞానం ఉన్నదనీ, పురాణం ఆ యిల్లాలు చదివినంత శ్రావ్యంగానూ, రసవంతంగానూ యెవరూ చదవజాలరు" అనీ "రూపమూ, రూపానికి సదృశ్యమైన గుణ సంపత్తీ" కలదనీ చెప్పగానే శ్రోతలలో ఒకడైన వెంకయ్య చప్పున అడ్డొచ్చి, "ఇది కవిత్వమా, నిజమా" అని అడిగేస్తాడు. నిజానికి నాంచారమ్మ ప్రబంధ నాయికలతో పోలిస్తే అసాధారణ వ్యక్తి కానేకాదు, కాని ఆధునిక శ్రోతకు ప్రతినిధి అయిన వెంకయ్య అప్పుడే శంక చేస్తాడు. అప్పారావుగారి వాస్తవిక దృష్టికి ఇది మంచి ఉదాహరణ.

పాత్రలూ, సన్నివేశాలూ వాస్తవికంగా ఉండాలంటే పాత్రల మనస్తత్వ చిత్రణ స్వాభావికంగా ఉండాలని వేరే చెప్ప నవసరం లేదు. దురదృష్టవశాత్తూ అధునికులు రాసే సామాజిక కథలలోకూడా పాత్రలకు — ముఖ్యంగా నాయికా నాయకులకు— కొన్ని ఆదర్శ లక్షణాలు అంటగట్టి, ఆ పాత్రలు నలుగురికీ గుణపాఠంగానూ, ఆదర్శంగానూ ఉండేలాగ చెయ్యాలన్న వైఖరి అప్పుడప్పుడూ కనిపిస్తుంది. ముఖ్యంగా సంఘ దురన్యాయాలకు గురి అయే పాత్రలను చిత్రించేటప్పుడు కథకులు పాఠకుల సానుభూతిని ఆ పాత్రలపైకి మళ్ళించటానికి ఆ పాత్రలను తోమిన చెంబుల్లాగ తయారు చేస్తారు. ఇటువంటి ధోరణి అప్పారావుగారి కథల్లో మచ్చుక్కూడా కనపడదు. ఆయన కథలలో నాయిక అనే పదానికి అర్హురాలై, ఒక ఘనమైన పనిచేసిన నాంచారమ్మనుకూడా మామూలు మనిషిని చెయ్యకుండా అప్పారావుగారు విడిచిపెట్టలేదు. చూడండి: "కష్టసాధ్యమును సాధించిన నాంచారమ్మ కరదీపం తిరిగి చేతబూని, యింటికి సవిలాసముగా నడిచి పోవుచుండగా, పెనిమిటి యెదురైనప్పుడు ఆమె ప్రేమ పరిహాసములు పెనగొను దృష్టితో చూసెను. ఆ దృష్టి తనకు దేవత్వమిచ్చి తన్ను అవతార పురుషుణ్ణి చేసిందని కృష్ణమాచారి మర్నాడు నాతో చెప్పి ఆ అర్థంతో శ్లోకం రచించాడు." ఈ కృష్ణమాచారి ధీరుడైనా కాడు; పెచ్చు మీరిపోతున్న సాతాని వైష్ణవులను తన భార్య ఒంటరిగా ఎదుర్కొని వారి వెర్రికి విరుగుడు చేస్తుంటే అటక ఎక్కి దాక్కున్న దద్దమ్మ!

"దిద్దుబాటు"లో నాయకుడు గోపాలరావు సంస్కారి, ఆత్మ విమర్శన చేసుకోగలవాడు. "భగవంతుడి సృష్టిలోకెల్లా ఉత్కృష్టమైన వస్తువ విద్యనేర్చినస్త్రీరత్నమే" నని మనస్ఫూర్తిగా నమ్మినవాడు. యాంటినాచ్, భార్యపట్ల అపార గౌరవాభిమానాలు కలవాడు. అయినా అతని బుద్ధి సానివాళ్ళ పాటలమీదా, మళ్ళీ మాట్లాడితే సానివాళ్ళమీదా లగ్నం అవుతూండటంవల్ల అర్ధరాత్రి ఒంటిగంటకు ఇల్లు చేరుకుంటూ పశ్చాత్తాప పడతాడు. "రేపటి నుంచి మరి పాటకు వెళ్ళను, నిశ్చయం, నిశ్చయం" అనుకుంటాడు. కాని ఇవాళ మాటేమిటి? భార్య ఎదుటపడి తన తప్పు ఒప్పుకుని ఆమెకు క్షమాపణ చెప్పుకుంటాడా? ఉహుఁ! "గట్టిగా పిలిచితే కమలిని లేవగలదు మెల్లిగా తలుపుతట్టి రాముడిని లేపగలిగితినా చడిలేకుండా పక్కజేరి పెద్దమనిషి వేషము వెయ్యవచ్చును," అనుకుంటాడు. తన భార్య కమలిని కనబడక పోయేసరికి రాముణ్ణి రెండు గుద్దులు అకారణంగా గుద్దుతాడు. ఈ సంగతి తన భార్యకు తెలిస్తే తనను గురించి తక్కువగా అనుకుంటుందని రాముడితో, "దెబ్బలమాటమరిచిపో. కొట్టినందుకు రెండు రూపాయలిస్తాను తీసుకో. మరియెన్నడూ ఆ వూసెత్తకు కమలినితో గాని తప్పిజారి అనబోయేవు సుమా!" అంటాడు. ఇది పాత్రయొక్క వాస్తవచిత్రణ.

అప్పారావుగారు ఇంగ్లీషులో రాసి శ్రీ అవసరాల సూర్యారావుగారు తెలుగులోకి అనువదించిన "సంస్కర్త హృదయం" అనే కథలో ప్రొఫెసరు రంగనాధయ్యరు పాత్ర చిత్రణలోనూ, అందాలకుప్ప సరో అనే సానిపిల్ల పాత్ర చిత్రణలోనూ కూడా ఇటువంటి వాస్తవికత కనిపిస్తుంది. పడుపు వృత్తి నిర్మూలించాలన్న ప్రొఫెసరుగారి ఆశయం నిష్కలంకమైనదే. ఆ సదాశయం కోసం కృషిచేస్తున్న రంగనాధయ్యరు సరళ సౌందర్యంచేత సమ్మోహించబడి, ఆమెను ఉద్ధరించటానికి బదులు తానే పతనమవుతాడు. అతని పతనం మేనకను చూసిన విశ్వామిత్రుడి పతనంలాటిది కాదు. ఆఖరుకు దేవదేవి ఆకర్షణకు బలి అయిన విప్రనారాయణుడి పతనంలాటిదీ కాదు. రంగనాధయ్యరుకు సరళ నుంచి సుఖం దక్కలేదు, తట్టెడు అవమానం మీద పడింది. చీకటిలో పడి పారిపోతుంటే దొంగ అనుకుని పోలీసులు లైట్లు వేశారు. ఆయన ఆ రాత్రే చేస్తున్న ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి ఎటో వెళ్ళిపోయాడు. భయంకరమైన శిక్ష! మనం రంగనాధయ్యరును సానుభూతితో చూస్తాం. అతని దౌర్బల్యం స్వాభావికమైనది. భార్య గయ్యాళిది: మనిషి అస్తమానం విజ్ఞాన ప్రపంచంలో విహరిస్తూ, ఉత్సాహం ఉడిగిన జీవితం జీవిస్తూ, గురువుల బోధనలను యథాతథంగా నిజాలుగా స్వీకరించినవాడు. అతనికున్న సిద్ధాంతాలూ, నమ్మకాలూ, జీవిత సంఘర్షణ నుంచి జనించనవి కావు. ఈ కారణంచేత జీవితం సరళరూపంలో ఎదుట నిలిచేసరికి బోల్తా

పడ్డాడు. అత్యంత స్వాభావిక చిత్రణ. సరళను ఉంచుకున్న అతని విద్యార్థి నిక్షేపంగా ఉన్నాడు; "మాకు వచ్చే క్లయింట్లలో అత్యధిక భాగం ఈ భోగం పడుచులే కదోయ్", అన్న ప్లీడర్లు నిక్షేపంగా ఉన్నారు వారిలో అంతస్సంఘర్షణ లేదు, దౌర్బల్యమూ లేదు.

సరళ పాత్రకూడా వాస్తవమైనది. సరళ ఋషిలాటి ప్రొఫెసరును తన సౌందర్యంతో ముగ్ధుణ్ణి చేసిన మనిషి. "ఆమెను నిర్లక్ష్యం చేయకూడదు. ప్రేమను, కరుణను, తెలివిని, చివరకు ధనాన్నయినా సరే ధారపోసి ఆమెను ఉద్ధరించాలి", అన్న భావన ఆయనలో రేపింది. చక్కగా వీణ వాయిస్తుంది. హాయిగా పాడుతుంది. ఈ పాత్రను ఉదాత్తంగా చేయ్యాలనీ, నలుగురూ మెచ్చుకునేలాగా పాత్ర పోషణ చెయ్యాలనీ మామూలు కథకుడికి అనిపిస్తుంది. ఈ దౌర్బల్యం అప్పారావులో లేదు. అమాయకులైన సంఘ సంస్కర్తలు సరళ గుడికి రావటం చూసి, "తను చేసిన పాపాలకా అమ్మాయి పశ్చాత్తాపపడుతోంది. వచ్చే జన్మలోనైనా సరళ గౌరవప్రదమైన గృహిణిగా పుడుతుంది", అనుకున్నారు గాని కథకుడు, "హరిహరీ! సరళకెన్నటికీ ఆ తలంపేలేదనీ, ఆమె దేవాలయానికి రావడం ప్రొఫెసరునూ, అతని స్నేహితులనూ ఆకర్షించడానికేననీ నేను చూచాయగా చెప్పవలసి వస్తున్నందుకు పాపం శమించుగాక!" అని స్పష్టంగా చెప్పేస్తాడు. సరళ పాత్రను తక్కువరకం కథకుడు ఏ విధంగా సృష్టించి ఉండేవాడో అలా ఊహించుకోవటమే రంగనాధయ్యారు పాత్రలోని దౌర్బల్యం. పాత్ర సృష్టి వాస్తవికంగా ఉండేటట్టు చూడటంలో అప్పారావుకు గల నిర్దాక్షిణ్యం ఈ కథలో స్ఫుటంగా మనకు కానవస్తుంది.

ఆధునిక కథలు శుష్కమైన ధార్మిక దృష్టీ, నైతికదృష్టీ మాత్రమేగాక సామాజికదృష్టి కలిగి ఉంటాయి. అప్పారావుగారు తన కథలలో మతమూ, ఆంటీనాచ్ అనే సమస్యలను ప్రధానంగా తీసుకున్నాడు. మతం గురించి "మీపేరేమిటి?" అనే కథలోనూ, "పెద్దమసీదు" అనే గల్పికలాటి (అసమగ్ర?) రచనలోనూ మనం కొంత తెలుసుకుంటాం.

"మీపేరేమిటి?" అన్న కథలో మతం తాలూకు సాంఘిక స్వరూపం సమగ్రంగా చిత్రించబడింది. ఆ సమస్యమీద మరొకరు కొత్తవిషయాలు చెప్పటానికి లేకుండా అప్పారావుగారాకథ రాసేశారు. ఆనాటికీ ఈనాటికీ మతం పేరిట ఉపద్రవాలు కలిగిస్తున్నది క్షుద్రులేగాని నిజమైన మతాభిమానం గలవాళ్లుకారు, వాళ్ళలో ఆవేశానికి సమపాళ్లలో మాధ్యంకూడా ఉండి తీరుతుంది. ఊళ్ళో శైవులున్నారు, వైష్ణవులున్నారు, ఊరి జంగాలు పాలరాతి బుద్ధ విగ్రహాన్ని బౌద్ధ శిధిలాలనుంచి సంపాదించి, ఆదేశివుడని కొలుస్తారు. ఒక దొరవచ్చి ఆ విగ్రహం విలువ గ్రహించి తనకు ఇవ్వమని అడిగితే, ప్రాణాలనన్నా ఇస్తాంగాని, ఆ విగ్రహాన్ని ఇవ్వజాలమన్నారు జంగాలు. కానివారి కందరికీ నాయకుడైన శరభయ్య ఒక రాత్రి ఆ విగ్రహాన్ని పీక్కుపోయి దొరకు అమ్మజూపితే దొంగసొమ్మని దొర కొన నిరాకరించాడు. "ఏమిటి యీ దొర బుద్ధి తక్కువా?" అనుకుని శరభయ్య అయిపులేకుండా పోయాడు. దానితోనన్నా జంగాల కళ్ళు తెరుపుడు పడ్డాయా? అలాటిదేమీ లేదు. భక్త వాత్సల్యంచేత శివుడు శరభయ్యను విగ్రహం పీక్కుపోవటానికి అనుమతించాడనీ, దొరగారి డేరా నుంచి వెళ్ళిపోయేటప్పుడు శరభయ్య వృషభ రూపము ధరించి రంకెవేసి దాటేశాడనీ, మళ్ళీ నేడో రేపో అతగాడు వీరాసనం వేసుకుని కొండమీదనో, గోపురంమీదనో, ఆవిర్భవిస్తాడనీ నమ్ముతారు.

శైవులిలా ఉంటే వైష్ణవులు మరొక రకంగా ఇదే ధోరణిలో ఉన్నారు. విష్ణ్వాలయానికి ధర్మకర్తృత్వం రంగాచార్యులు కుటుంబానిది. కాని వైష్ణవులకు నాయకుడు సాతాని మనవాళ్ళయ్య. శరభయ్య తాను సాక్షాత్తూ వృషభావతారమేనని చెప్పుకుంటే మనవాళ్ళయ్య తాను గరుడాళ్వారి అత్యలాంశవల్ల జన్మించినట్టు నలుగురూ ఒప్పితే చాలునంటాడు.

ఈ పరిస్థితిలో శైవ వైష్ణవ రగడ తీవ్ర స్థితికి రావటానికి కారణం, లక్షాధికారి సారధినాయుడూ, అతడి బావమరిదీ గ్రామ మునసబూ అయిన రామినాయుడూ దక్షిణదేశపు అయ్యావార్లంగారి చేత చక్రాంకితాలు వేయించుకుని శివకోవెలకేసి చూడటం మానేశారు. ఇంతలో హైదరాబాదునుంచి శివాచార్లు కొందరు గ్రామం వచ్చారు శరభయ్యకు మంచి అవకాశం చిక్కింది. వాళ్లు రోజూ అర్ధరాత్రి శివార్చనలు చెయ్యటమూ, శంఖాలు ఊదటమూ, అడావుడి చెయ్యటమూ పామరులను శైవంకేసి లాగాయి. శివాచార్లు గుండం తొక్కుతాడన్నారు. ఊరి నాయలు ఒక్కొక్కరే వైష్ణవం వదిలేస్తున్నారు. సారధినాయడుకూడా జారిపోతాడని మన వాళ్ళయ్యకు దిగులు పుట్టింది. రంగాచార్లవారితో ఈ విషయం ప్రస్తావిస్తే ఆయన, "వైష్ణవుడు శివుడు కావాలని కోరితే అడ్డి ఏమి కార్యం? రాముడి ఆజ్ఞ ఎలాఉంటే అలా జరుగుగాక!" అని ఊరుకున్నాడు. "ఈ బ్రాహ్మడికి వైష్ణవాభిమానం తక్కువ," అనుకుని మనవాళ్ళయ్య రచ్చబండ దగ్గిర సాతానులను చేర్చి మీటింగు పెట్టి; కర్తవ్యం ఆలోచించమన్నాడు. "సారధినాయుడు

ఈ రాత్రి వెళ్ళి శైవుల ఘోరకృత్యములు చూసెనా, మరి మన వాడు కాదు", అన్నాడు.

"వాళ్ళు చేసేపని మనవేంల చేయరాదు? శ్రీమద్గరుడాళ్వారి అవతారమైన మనవాళ్ళయ్య రాగిధ్వజం చేతపట్టుకొని నాలాయిరం పఠిస్తూ గుండం తొక్కితే సరి", అన్నాడు రామానుజయ్య ఈ విపత్తునుంచి బయట పడటానికి మనవాళ్ళయ్య ఎన్ని ఎత్తులైనా వేస్తాడు. చివరకు నాంచారమ్మ అతగాణ్ణి కాపాడుతుంది. వైష్ణవం గొప్పదని ఋజువు చెయ్యటానికి పీరుసాయిబుచేత గుండం తొక్కిస్తారు. సాయిబు చేతబట్టుకున్న పీరు వైష్ణవనామం అని వైష్ణవులంటే త్రిశూలమని శైవులన్నారు. ఏమైనా శివ వైష్ణవుల స్పర్థలు వెనకబడి ఊరిజనం పీరుకు మొక్కుకోనారంభించారు! ఏమి మత సంఘర్షణ! ఎలాటి పరిణామం!

ఈ "మత" కథను అప్పారావుగారు నాస్తికుణ్ణి తీసుకు రాకుండా పూర్తి చెయ్యక పోవటం గమనించదగినది. కథ అంతా విని పాతకాలపు వాడైన గురువుగారు, "ఔరా! కలికాలంలో మనుష్యులేకాదు, దేవుళ్ళుకూడా సంకరం అవుతున్నారు. అయినా తప్పేమి? శివుడన్నా, విష్ణున్నా, పీరన్నా, బుద్ధుడన్నా ఆ పరమాత్మ మట్టుకు ఒక్కడే గదా!" అంటే వెంకయ్య వూరుకుంటాడా. "అందరు దేవుళ్ళూ ఒక్కరే అయితే, ఆ పీనుగుల్ని అందరినీ ఒక్కచోటే నిలిపి అందరూ కలిసి పూజతగ లెట్టరాదా?"అంటాడు.

"పెద్దమసీదు" కథలో మత స్పర్థలూ, మతావేశాలు లేవు గాని మతానికి మనిషి పెట్టుకునే కొండగుర్తులను జీవితం ఎలా చెరిపేస్తుందో సూచించ బడింది. కాశీనుంచి తన స్వగ్రామమైన శ్రీకాకుళానికి తిరిగి వస్తాడు నారాయణభట్టు. అతనివెంట పుల్లం భట్టు అనే కుర్రాడు ఉన్నాడు. నారాయణభట్టుకు ఊరి పొలిమేర నుంచి కాకుళేశ్వరస్వామి ఆలయ గోపురం కనిపించదు. తురకలు ఆలయం పగలగొట్టి మసీదు కట్టారు. అందుకు నారాయణభట్టు చింతిస్తాడు. కాని మరుక్షణంలోనే ఇంతకన్న విడ్డూరం నారాయణ భట్టుకు తెలిసివస్తుంది—అతని మేనమామ తురకల్లో చేరిపోయాడు!

మతసమస్య "మీపేరేమిటి?"లో ఎంతబాగా చిత్రితమయిందో, ఆంటీనాచ్ ఉద్యమం ఒడుదుడుకులు "సంస్కర్త హృదయం" అనే కథలో అంత సమగ్రంగా చిత్రితమయాయి. వేశ్యావృత్తి నిర్మూలనకు మార్గం ఏమిటో ఈ కథ చెప్పదు; ఆ వృత్తితాలూకు వేళ్లు సంఘంలో ఎంత బలంగా పాతుకొని ఉన్నాయో, మనుషుల సహజ దౌర్బల్యాలు దానికి ఎంత అండగా ఉన్నాయో, ఇటువంటి సమస్యల పరిష్కారానికి ఎంత సంఘర్షణను ఎదుర్కోవాలో ఈ కథ చాలాబాగా చిత్రిస్తుంది.

"మెటిల్డా", "దిద్దుబాటు" కథలుకూడా సంస్కరణకు సంబంధించినవే.

జీవితంలోని కుసంస్కారం మంచివాళ్ళనుకూడా ఎలా సుడి గుండంలోకి ఈడుస్తుందో "మెటిల్డా" కథలో చక్కగా నిరూపిత మయింది. ఇందులో కథకుడూ, మెటిల్డా, ఆమె భర్తకూడా మంచి వాళ్ళే. జరిగిన పొరపాటల్లా వయసు మళ్ళిన అనాకారి భర్త అంద గత్తె అయిన పడుచును పెళ్లాడటమే. భర్త భార్యను అనుక్షణమూ శంకిస్తాడు, కాయిదాలో ఉంచుతాడు, పులి అని పేరు తెచ్చు కుంటాడు, తన భార్యను పరాయివాడి ఎదట "లంజ" అంటాడు. కాని అతడు దుర్మార్గుడా? కాడు! అకస్మాత్తుగా జ్ఞానోదయమై, తన సమస్యను తాను అర్థం చేసుకుని, కథకుడితో, "ఈ ముండని తీసుకుపో; నీకు దానం చేశాను. తీసుకుపో. నాకు శని విరగడై పోతుంది," అంటాడు.

కథకుడూ సజ్జనుడే. అతన్ని బలంగా ఆకర్షించింది మెటిల్డా అందమే. "చెడ్డతలపు యీషత్తుంటే దేవుడు సాక్షి!" అని అతను మెటిల్డా భర్త దగ్గిర ప్రమాణం చేస్తాడు.

మెటిల్డాకూడా యోగ్యురాలే. ఆమె ఆ ముసలి భర్తతో సుఖపడటంలేదు, సుఖపడటం సాధ్యం కాదు. కాని ఆమెలో తిరగు బాటులేదు. పరిస్థితులకు తలవంచింది. మనసు ఆపుకోలేక ఎప్పు డన్నా భర్తగీసిన గిరిదాటి గుమ్మంలోకి వస్తుంది. కథకుడి మూలాన తనకు ఇబ్బంది జాస్తిఅయి అతనికి ఉత్తరము రాస్తుంది "మీరు మీ నేస్తులూ నా కాపురం మన్ననివ్వరా? మీకు నేనేం అపకారం చేశాను?"

చివరకు, తనభార్య యోగ్యురాలని గుర్తించి భర్తఆమెకు స్వేచ్ఛ ఇస్తాడు. ఆ స్వేచ్ఛ ఆమె సమస్యను పరిష్కరించదు—నిరుపయోగం. కథకుడు మెటిల్డా భర్తతో మంచిగా మాట్లాడే అవకాశం వస్తుంది. "చాలా విద్వాంసుడని తెలుసుకున్నాను," అంటాడు కథకుడు. అన్ని పక్షాలకూ రాజీ జరిగిపోయింది.

"దిద్దుబాటు"లో అప్పారావు గారు సంస్కార రహితమైన భావాలను నౌకరు రాముడి నోట పలికించటం గమనించదగినది. "ఆడారు చదువునేరిస్తే యేటౌతాది?... ఆడదాయి చెప్పకుండా పుట్టినారింటికి యెల్తానంటే లెంపలాయించి కూకోబెట్టాలి......

ఆడోరు యెజమాని చెప్పినట్టల్లా యినిపల్లకుండాలి."... ఇటు వంటి ఉద్దేశాలు ఈనాడు చదువుకున్నవాళ్ళలోఎంత మందికిలేపు కాని మహాకవి ఏనాడో ఈమాటలను నీచ పాత్రనోట పెట్టేశాడు!

అప్పారావుగారు మానవ స్వభావాన్నీ, సమాజాన్నీ కాచి వడబోసిన మనిషి. సంస్కరణ ఎంత దుష్కరమైనవో ఆయనకు తెలుసు. ఆయన రాసిన కథలు కొంచమే అయినా వాటినిండా బంగారు కణికల్లాటి సత్యాలు కొల్లలుగా ఉన్నాయి.

"మెటిల్డాని (భర్త) యెన్నడైన ఒక్కదెబ్బ కొట్టాడని విన్నామా? లేదు. తిండికి లోపంలేదు. గుడ్డకి లోపంలేదు అతను చెప్పినట్లు మెసులుకుంటే నెమ్మదిగా కాలం వెళ్లడానికి అభ్యంతరంలేదు." ఈ మాటలలో ఎంత జీవిత సత్యం ఉంది! ఇవేమాటలు బానిసలకు వర్తిస్తాయి, వలస ప్రజలకు వర్తిస్తాయి. చిక్కంతా హక్కులకోసం పోరాడితేనే వస్తుంది!

మ్లేచ్ఛుడు ఆలయం పగలగొట్టి మసీదు కట్టితే దేవుడెందు కూరుకున్నాడు, స్వామీ? అని పుల్లంభట్టు అడిగినప్పుడు, "అమాటే యే శాస్త్రంబులోనూ కనబడదురా!" అంటాడు నారాయణభట్టు.

సిద్ధాంతాలలో తేడాలు ఎక్కడిదాకా పోతాయో మనం చూస్తూనే ఉన్నాం. దీన్ని అప్పారావుగారు అద్భుతంగా చిత్రించారు. ప్రోనాచ్ వకీళ్లనందర్నీ దేశద్రోహులుగా యాంటీ నాచ్ పత్రిక చిత్రిస్తుంది! "చర్చతో సందడిగా ఉంది ఊరు మున్సిపల్ కౌన్సిల్‌లోనూ, దేవస్థానం బోర్డులోనూ సభ్యుల మధ్య వాదోపవాదాలు పెరిగి రెండు ముఠాలుగా చీలిపోయారు. కొందరు ప్రోనాచీయులు, మరికొందరు యాంటీనాచీయులు... కేకలు వేసుకోవడంతో ఆరంభమైన యీ వ్యవహారం పీకలు పిసుక్కోవడం దాకా పెరిగింది." చివరకు క్లాసులో కూడా నీతి వాదులూ, అవినీతివాదులూ వేరైపోయి తమమధ్య ఒక బెంచి ఖాళీగా వదిలేస్తారు

అన్నిటినీ మించినది అప్పారావు గారి హాస్యం. ఇది Anatole France ను జ్ఞప్తికి తెస్తూ ఉంటుంది. ఈ వాక్యాలు చూడండి: "యువకులకు ఎక్కడలేని ఉత్సాహం పొంగుకువచ్చి, నాచ్ సమస్య అంటేనే చెవికోసుకునేవారు..." సీతాపూర్ బార్‌లీడరు పగలల్లా తాను యాంటీనాచ్‌ననీ రాత్రిళ్లు మటుకే ప్రోనాచ్‌ననీ, అరమరికలు లేక ఖండితంగా చెప్పేశాడు...... "హా దైవమా! నేను ఒక్క అరగడియ గరుడాళ్వారినే అయితే యెక్కడికైనా యెగిరి ప్రాణం దక్కించుకుందును గదా!... అనుకుంటాడు మనవాళ్లయ్యగారు గరుడాళ్వారే అయితే గుండం తొక్కవచ్చునని అతడికితట్టదు!... తాను గుండం తొక్కకుండా తప్పించుకోవటానికి మనవాళ్లయ్య వేసే పేచీలలో ఒకటి: "పృథివ్యాపస్తేజోవాయురాకాశాత్ అన్నాడు. విష్ణుభక్తుడైన వాడికర్తవ్యం ఉత్తమోత్తమం. పృథివీ, అనగా భూమిమీద నడవడమే."

అప్పారావు గారి వంటి సమగ్ర రచయితలు ఏ భాషలోనైనా అరుదే. అందుకే ఆయన మనకు విడిచిన నాలుగైదు కథలూ మహత్తర కళాఖండాలు తలచిన కొద్దీవాటిలో మరింత లోతూ, మహిమా కనిపిస్తాయి.



# మహాకవీయం

శ్రీ రాయప్రోలు సుబ్బారామయ్య

ఏ జాడ నీనీడ లేనాడు గనిపించు-
మావాడ! గురజాడ! మావాడ పులకించు-
ఏ పోట నీపాటలే తేటలై తేనె
యూటలై, మానోటి తీటలందోలించు-
ఏ కడల నీనుడువులే కడలి బుడగలై
ఎగసి మాకడుపులన్ నగవు సడులనునించు-

కరమెత్తి 'నీలగిరి' శిరము దాకెదము- కం
ధరమెత్తి 'ముత్యాల సరము' దాల్చెదము- ఓ
ప్రాచీన దురాశయ గ్రావపవీ!- అ
ర్వాచీన నయోదయద్భావరవీ!-మహాకవీ!

కన్యాశుల్క గ్రసన వ్యసనా
రణ్య శరణ్యోల్కా సంపాతం-
వితంతు చింతా వివశ గళాంచల
నితాంత మాంగల్య తంత్ర మంత్రం-

వేశ్యాలోలన నశ్య కాలుష్య
పోష్య మస్తిష్క శుద్ధి భేషజం-
నిశీధినీపాపశీధువాంఛా
వశీకృతులపై కశాభిఘాతం-

స్తబ్ధులకానకం-
లుబ్ధుల కాద్ధికం-

అట త్రాచు పడగల జడుపులు-
ఇటు వేయి చెడుగుల విడుపులు-
అది మహాకవీయ నాటకీయ శిల్పం!
అది 'కన్యాశుల్క' మనంత మనల్పం!

సరసవాణి, 'మధురవాణి' చతుర రసిక
సమభావం-

'గిరీశ' దంభ దేవదత్త దరభీషణ
సంరావం-

తెరచాటు దగా తెగుళ్ళు
తెఱచి, జగతి కిచ్చుకళ్ళు-

మఱువము నీతేజస్సు! సమంచితమిక
మా తపస్సు!

గురజాడ మహాకవీ: చిర జీవము
నీ యశస్సు!





# వె లు గు బా టు లు

"ఉదయభాను"

మనరాష్ట్ర ప్రభుత్వ శాఖలన్నిటిలో సంఘసంక్షేమ శాఖ విశిష్టమైనది. ఆదాయం ఏమీలేకుండా కేవలం ఖర్చుపెట్టే శాఖలలో యిది ఒకటి. సమాజంలో తరతరాలుగా నిరక్షరాస్యత, అజ్ఞానాలతో అణగారి ఉన్న గిరిజన, హరిజన వర్గాల సక్షేమం యీశాఖ ప్రధానాశయం. అలాగే వెనుకబడిన తరగతులు, కొన్ని ప్రత్యేక చిక్కులకులోనయిన స్త్రీలకు కూడ యీ శాఖ సహాయం చేస్తున్నది.

పూర్వ హైద్రాబాద్ రాష్ట్రంలో సాంఘిక సేవా (సోషల్ సర్వీసు) శాఖ ఉండేది. కాని ఆంధ్రప్రాంతంలో సంఘసంక్షేమ శాఖకు ప్రత్యేకంగా ఒక మంత్రి ఉండటమనేది ఎన్నడూ జరగలేదు. ఈ శాఖ ప్రాధాన్యం యిటీవల మరింత గుర్తించబడింది. తత్ఫలితంగా ప్రస్తుత మంత్రివర్గంలో సంఘ సంక్షేమ శాఖకు ఒక మంత్రి (శ్రీమతి మాసూమాబేగం) ఉండటం లోగడకంటె అనేక రెట్లు ఎక్కువ మొత్తాలు యీ శాఖ క్రింద ఖర్చు చేయడానికి కేటాయించబడటం జరిగింది. విద్యాశాఖలో సంఘసంక్షేమ వ్యవహారాల్ని చూడడానికి ఒక ప్రత్యేక కార్యదర్శి నియమించబడినారు. గిరిజన సంక్షేమ శాఖఅనేది కొత్తగా ఏర్పాటు చేయబడింది. సంఘసంక్షేమశాఖ, మహిళా సంక్షేమ శాఖలు ప్రత్యేక డైరక్టర్లతో లోగడనుండే పనిచేస్తున్నవి. ఈ రెండు పదవులకు యిప్పుడు హరిజనులే లభించారుకూడా.

కొండతెగలవారు నిరక్షరాస్యత, అజ్ఞానంతో ఉన్నా వారికి కొన్ని సంప్రదాయాలు, జీవనపద్ధతులు ఉన్నాయి. సంఘ సంక్షేమ శాఖ కార్యకలాపాలవలన వాటికి అవాంతరం కలుగుతుందనే భావం ఆ తెగల (గిరిజనుల)లో కలగకుండా శ్రద్ధవహించడం జరిగింది. గిరిజనులు మానసిక సమస్యలు లేకుండా సుఖంగా ఆటలతో, పాటలతో జీవిస్తారు. అయితే ఎవరైనా తమసుఖ జీవన విధానానికి భంగం కలిగిస్తున్నారనే భావం వారిలో కలిగితే మొత్తం సంక్షేమ కార్యకలాపాలనే ప్రతిఘటిస్తారు. అప్పుడిక వారిని ఉద్ధరించడం ఎవరికీ శక్యంకాదు. అందుకే సంఘసేవకులకు యీ అంశాలన్నిటిపైనా శిక్షణ గరపడం జరుగుతున్నది.

సంఘసక్షేమ కార్యకలాపాల్ని ప్రభుత్వోద్యోగులు నిర్వహించాలా స్వచ్ఛంద సంస్థలు నిర్వహించాలా అనే ప్రశ్నఉంది. ప్రస్తుతం సంఘసంక్షేమ శాఖద్వారా, ఇటీవల ప్రవేశ పెట్టబడిన పంచాయతీ రాజ్యంద్వారా, సంఘసంక్షేమ సలహాలతో సమితిద్వారా జరిగే కార్యకలాపాలలో జీతాలతో పనిచేసే సంఘసేవకులున్నారు.

సంఘసేవ సామాన్య మానవత్వ దృష్టితో జరగవలసిన కృషి గనుక ప్రభుత్వోద్యోగులైన సేవకులు ఎంతవరకు యీ కృషిలో లీనమై పనిచేయగలరన్న ప్రశ్నను కొందరుదయింపజేస్తున్నారు. ఉన్నతోద్యోగులు సైతం ప్రజలతో సన్నిహిత సంబంధాలు పెట్టుకొని పనిచేస్తున్న విషయం అనుభవంలో ప్రతిదినం చూస్తూనే ఉన్నాము. కాగా యీ ప్రశ్న ఉదయించడంలో అర్థంలేదు.

అయితే యీ కార్యకలాపాలలో నిమగ్నమయిన స్వచ్ఛంద సంస్థలు కూడా ప్రభుత్వ సహాయంపైనే ఆధారపడుతూ ఆ డబ్బుతోనే పనిచేయడం సాధారణంగా జరుగుతున్నది. ప్రజావిరాళాలతో పనిచేసే సంస్థలు చాలా తక్కువగా ఉన్నాయి.

సంఘసంక్షేమ శాఖ కార్యకలాపాలు ప్రతిఏటా విస్తృతమౌతున్నవి. ఈ శాఖకు కేటాయించబడిన మొత్తాలు కూడా పెరుగుతున్నవి. తృతీయ పంచవర్ష ప్రణాళికా కాలంలో గిరిజనులకు 304.61 లక్షలు, హరిజనులకు 194.30 లక్షలు వెనుకబడిన తరగతులకు 38 లక్షల రూపాయలు ఆంధ్రప్రదేశ్‌లో కేటాయించబడ్డాయి. వ్యవసాయం, సహకారం, నీటిపారుదల, లఘుపరిశ్రమలు, రహదార్లు, విద్యా, ఆరోగ్య, గృహవసతి వంటి ప్రభుత్వ శాఖలలో 3 శాతం ఖర్చును యీ సంక్షేమ ప్రయోజనాలకు ఖర్చు చేయాలని నిర్ణయించబడింది.

పంచాయతీ రాజ్యావతరణం తరువాత జిల్లా పరిషత్తులు పంచాయతీ సమితులలో హరిజన, గిరిజన సంక్షేమంపట్ల శ్రద్ధ తీసుకొనే స్థాయీ సంఘాలు ప్రత్యేకంగా ఏర్పాటు చేయబడ్డాయి. అందువలన పరిపాలనా వికేంద్రీకరణ ద్వారా యీ కార్యకలాపాలు మరింత విస్తృతంగా జరుగుతున్నాయి. సామాన్యమైన సంక్షేమ కార్యకలాపాలన్నీ పరిషత్తులు, సమితుల ద్వారానే జరుగుతున్నవి.

ఏజన్సీ ప్రాంతాల అభివృద్ధిపట్ల యీ శాఖ ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటున్నది. అరకులోయ కాలనీ పథకం ద్వారా అనేకమంది గిరిజనులకు సహాయం కల్పించబడింది. గ్రామీణ నీటిసరఫరా ఏర్పాట్లుకూడా చేస్తున్నారు. విశాఖపట్నంలో నెలకొల్పబడిన ఆంధ్రగిరిజన సహకార ఆర్థికాభివృద్ధి కార్పొరేషన్ మొత్తం భారతదేశంలోనే అద్వితీయమైనసంస్థ. తృతీయప్రణాళికా కాలంలో వరంగల్ కేంద్రంగా తెలంగాణలో కూడా మరో కార్పొరేషన్ నెలకొల్పబడుతుంది.

సంఘసంక్షేమ విస్తరణ ప్రాజెక్టులు, సంక్షేమ కేంద్రాలు, పునరావాస కేంద్రాలు, ఉత్పత్తి కేంద్రాలు, రిమాండ్ గృహాలు, భిక్షుకగృహాలు జిల్లా రక్షణగృహాలు రాష్ట్రంలోని వివిధ ప్రదేశాలలో సంఘ సంక్షేమ శాఖచే నిర్వహించబడుతున్నవి. ఉన్న వాటిని విస్తృత పరచడానికీ, కొత్తవాటిని ఏర్పాటు చేయడానికి ప్రత్యేక మొత్తాలు కేటాయించబడ్డాయి.

వీటికి తోడు హరిజన, గిరిజన విద్యార్థులకు స్కాలర్‌షిప్పులివ్వడం, ఆ విద్యార్థులకు హాస్టళ్లు నెలకొల్పడం పాఠశాలలు నెలకొల్పడం ఆవిధంగా నెలకొల్పిన హాస్టళ్లలోని హరిజన, గిరిజన, వెనుకబడిన తరగతుల విద్యార్థులకు బోర్డింగ్ గ్రాంటులు యిచ్చి యీ తరగతుల విద్యార్థుల విద్యాభివృద్ధికి యీ శాఖ తోడ్పడుతున్నది. మధ్యాహ్న భోజన సౌకర్యాలకు కూడ యీ శాఖ పాఠశాలలకు కొంత ఆర్థిక సహాయం చేస్తున్నది.

మాజీనేరస్థ జాతుల పిల్లలకు విద్యాసౌకర్యాలు, వ్యవసాయ, కుటీర పరిశ్రమలు, గృహవసతి కల్పనలో విరివిగా సహాయం చేస్తున్నది. అలాగే నేరాలకు అలవాటుపడిన తెగలకు స్థిరనివాస సౌకర్యాల్ని కల్గించింది.

ఇండ్ల స్థలాల్ని సేకరించి యీప్రజలు ఆరోగ్య కరమైన పరిసరాలను మంచి యిండ్లలో నివసించడానికి దోహదం చేస్తున్నది.

స్వయంగా యిన్ని సంస్థల్ని నిర్వహిస్తూ గిరిజన, హరిజన, వెనుక బడిన తరగతులకు సహాయం చేయడమే గాక స్వచ్ఛంద సంస్థలకు గ్రాంటులిచ్చి వాటి సంక్షేమకృషిని ప్రోత్సహిస్తున్నది. హరిజనసేవక సంఘం, భారతసేవక సమాజం, రెడ్‌క్రాస్, రోటరీ క్లబ్‌లాటి సంస్థల సంక్షేమ కార్యకలాపాలకు యీ విధంగానే సంఘ సంక్షేమ శాఖ దోహదం చేస్తున్నది.

ఉత్పత్తి కేంద్రాల ద్వారా గిరిజనులకు అనేక లఘుపరిశ్రమలలో పని కల్పించడం, శిక్షణకేంద్రాల ద్వారా అనేక మందికి చేతిపనులు, కుట్టులాటి పనులలో శిక్షణ గరపడం, వయోజన పాఠశాలల ద్వారా వయోజనులైన యీతరగతుల ప్రజలకు విద్య గరపడం జరుగుతున్నది.

అయితే యీ పనులు ప్రభుత్వం స్వయంగా చేస్తున్నా వాలంటరీ సంస్థలకు గ్రాంటులివ్వడం ద్వారా చేయిస్తున్నా అవినీతిని అరికట్టడం చాల అవసరం. అనేక రూపాలలో ఉన్న యీ అవినీతిని అరికట్టడానికి ప్రభుత్వం తీవ్రంగా కృషి చేస్తున్నది. ఈ కృషిలోనేకాదు అభ్యుదయ సాధనలో కూడా పూర్తిగా ప్రజలు సహకరిస్తేనే సత్ఫలితాలు సాధ్యమవుతాయి. అప్పుడే ఈకృషి దిగ్విజయమై గాంధీజీ ఆశయం నెరవేరుతుంది. సమాజంలోని అన్ని వర్గాలూ అభివృద్ధి చెందుతాయి.

* * *



# కుటుంబ నియంత్రణం

శ్రీ దివాకరుని వెంకట సుబ్బారావు

( గత సంచిక తరువాయి )

మన దేశమందు ప్రజాబాహుళ్యము గ్రామవాసులు, విద్య లేని వారు. పూర్వకాలపు అభిప్రాయముల గలిగి యున్నారు. సంతాన నిరోధము వలన ఆరోగ్య భంగమని, మత కుల సిద్ధాంతములకు ప్రతికూలమని ప్రకృతి మార్గములకు వ్యతిరేకమని మూఢ నమ్మకముల గలిగి యున్నారు. మానవ జీవితము సౌఖ్యవంతముగా నొనర్చుకొనుట మానవుని ఆధీనమని గ్రహింపరు. మానవుడు సాధించిన గొప్పతనములు, మరణములతగ్గించుటయందు, ఆయు ప్రమాణము అభివృద్ధిగాంచుటయందు పొందిన ఫలితములు అనుభవించు చున్ననూ ఇవిదైవికములుగాని మానవుని శ్రమ ఫలితములని గుర్తింపరు. గతకాలమందు భూ భారము ఎక్కువైనపుడు, క్షామములు, వ్యాధులు, అనావృష్టి, యుద్ధములు ఎక్కువై బహుజనులు మరణించుట వారికి తెలియనివి గావు. ఈ అనుభవములు వారి మూఢ నమ్మకముల తగ్గింపలేదు. కుటుంబ నియంత్రణమవలంబించుట గ్రామములనుండి ప్రారంభింప వలెనుగదా. అచట ఈ మూఢ జనుల నమ్మకములు కష్టముల గల్గించు చున్నవి. నాగరికత, అందలి ఫలితములు వారు ఇంకను గుర్తింపలేదు. నాగరికత యననేమి? పశు పక్ష్యాదుల మాదిరిగా సంభవించు కష్టములకు లోనై మరణించుటయా? మానవునికి విచక్షణా జ్ఞానమున్నది ఇట్టి జ్ఞానమును ఉపయోగించి తన అభివృద్ధి నరయుట మానవ ధర్మము. మానవులు తమ ధర్మముల గుర్తింప వలెను. అట్టి కార్యముల సాధించుటకు మార్గములరయ వలెను. ఆ పరిణామములు సంపూర్ణత నొందిన గాని ఇహ లోక సుఖములు ప్రాప్తింపవు. ఆనాడు గాని పరలోక సుఖముల నొందజాలము. భగవంతునిమనయందు గుర్తించుటకు మనజ్ఞానము తప్ప వేరుమార్గములేదు. విధిబలీయమని, భగవంతుని లీల వలన మనము కష్టముల నొందు చున్నామనుట మూఢత్వం. మానవుడు తన కర్తవ్యము గుర్తెరిగి ప్రవర్తించిన గాని క్రమమార్గము లభింపదు. భగవంతుని అనుగ్రహము వలన గల్గిన జ్ఞానము సవ్యముగా వినియోగ పరచిన మన కష్టములు మటుమాయమై సుఖములు కరతలామలకములగును. మానవులు తమ శక్తుల వినియోగించి కష్టముల నుండి తొలగుట, సుఖించుట, ఇహ పరలోక సౌఖ్యములు సాధింప వలసిన బాధ్యతల గుర్తెరుగుట గదా నాగరికతకు మూలములు. గాన నాగరిక ప్రపంచమందు కుటుంబనియంత్రణ తప్ప సుఖజీవనము నకు వేరు మార్గములేదు.

ప్రసవము కష్టము గాదని ప్రజానమ్మకము. దానికి పరిమితి యున్న హంశము గుర్తింప బడలేదు. పరిమితి తప్పిన ప్రమాదమని

తెలిసి కొనుట ముఖ్యము. ఒక స్త్రీ నాల్గు మారులు ప్రసవించిన తదుపరి ప్రసవమందలి కష్టములు ప్రారంభించును. ఆరుమారులు ప్రసవించిన తర్వాత ఈ కష్టములు రెట్టియగును. పదిప్రసవముల అనంతరము ఈకష్టములు 5 రెట్లు యగును, స్త్రీ గర్భవతి యగుట ప్రసవించుట సాధారణ న్యాయము. గర్భధారణకు పరిమితియున్నది. క్రమ వయస్సు నందుగాని గర్భధారణ కారాదు. తర్వాత ప్రతి గర్భ ధారణకు మధ్య కాలపరిమితి తక్కువ కారాదు. గర్భధారణ నియమముల నతిక్రమింపరాదు. గర్భధారణ యందలిప్రమాదములు అనేక కారణములచే గల్గుచున్నవి. ఆహార కొరత, ఆరోగ్యకొరత, వ్యాధులు ప్రధానములు, ప్రతి స్త్రీ గర్భము ధరింపగనే ప్రసవించు వరకు అవలంబింప వలసిన నియమములున్నవి. వైద్యసహాయము అవుసరము. ప్రసవకాలము సమీపించుచున్న సమయములలో వైద్య సహాయము ఎక్కువగా నుండవలెను. ప్రసవించిన తర్వాత గూడ ఈ సహాయము ముఖ్యము. స్త్రీ తిరిగి ఆరోగ్యము నొందు వరకు జీవితము నియమములకు లోనై గడుపవలెను. సక్రమ ఆహారము, వైద్య సహాయము. ఆరోగ్య పరిసరములు ముఖ్యములు. గర్భధారణనుండి ప్రవేశించు పరిణామములు. ప్రసవకాలమందు తీసికొన వలసిన జాగ్రత్త, శిశుజననము తర్వాత పునః ఆరోగ్య ప్రాప్తి కొరకు జరుపవలసిన నియమములు లోపించిన, వీని ఫలితములు తత్కాలమునకు కన్పింపక పోయిననూ, కాల యాపనము జరుగగా ఇవి ఎక్కువ ప్రమాదములకు దారి తీయును. కాలనియమము పాటింపక త్వరత్వరగా గర్భములు ధరించిన స్త్రీలు ఈ ప్రమాదములకు లోనై ఆరోగ్య హీనత వలన అకాల మరణములకు గురియగుదురు. ఈ హంశములను తలిదండ్రులకు తెలుపు బాధ్యత వైద్యులు, ఆరోగ్య కేంద్రములు వహింపవలెను. Hypertoxaemia ప్రథమ ప్రసవమందు సంభవించిన ఈ వ్యాధిపూర్తిగా నివారణ 'యగువరకు తిరిగి గర్భధారణ చేయరాదు. ఈ వ్యాధి మూడుమారులు ప్రసవకాలమందు వచ్చిన సంతానము కలుగరాదు. క్షయవ్యాధి గల స్త్రీలు గర్భము ధరింపరాదు. Pyelitis అనుమూత్రనాళవ్యాధి జనించిన స్త్రీలు ఆవ్యాధి నివారణ యగు నంతవరకు అనగా రెండు సంవత్సరముల కాలము గడుచు నంత వరకు తిరిగి గర్భము ధరింపరాదు. కీళ్లవ్యాధులు, గుండె జబ్బులు గల స్త్రీలు సంతానము నొందుటకు అర్హులుగారు అతిసార వ్యాధిగల తలిదండ్రులు సంతాన ప్రాప్తికి ప్రయత్నింపరాదు, సుఖవ్యాధులు గలవారు సంతానము బడయుటకన్న క్రూరము వే రొండులేదు.

## కుటుంబ నియమము

గౌరవముగా సంఘమునందు జీవించుట, తమకున్న బాధ్యతల నిర్వర్తించుచూ పిల్లలను అభివృద్ధి నొందించుట కుటుంబ పరిమితి నియమునకు ప్రధాన కారణములు. ప్రతికుటుంబమందునూ ఎందరు పిల్లలుండవలెనను పరిమితి తల్లి దండ్రులు వారి ఆర్థిక స్థితి సంఘమందు వారి కున్న స్థానమును గుర్తెరిగి నిర్ణయించు కొనవలెను. ప్రతి కుటుంబము లోనూ ఎందరు సంతాన ముండ వలెనను పరిమితి నిర్ణయించుట సమాజమునకు వశముగాదు. సాధారణముగా ముగ్గురు పిల్లలు గల్గిన కుటుంబములు సుఖింతురని ప్రజాభిప్రాయము. ఒక సంతానము గల్గిన కుటుంబము సుఖవంతము గానేరదు. వయః పరిమాణములందు ఎక్కువ భేదములు గల్గిన పిల్లలు జన్మించిన సుఖింప జాలరు, ఇద్దరు పిల్లలు గల్గిన కుటుంబములందు పిల్లలకు సౌఖ్యము తక్కువ, సాధారణముగా వారికి అసూయాభావములు గల్గు అవకాశములున్నవి. గనుక ముగ్గురు పిల్లలుండుట మంచిది. సంతానము చిన్న వయస్సు నందుగాని ఎక్కువ వయస్సు వచ్చిన తర్వాత గాని కలుగరాదు. యుక్తవయస్కులైన తల్లిదండ్రులకు సంతానము గల్గిన వారు మధ్య వయస్కులగు కాలమునకు పిల్లలు పెరిగి వారికి చేదోడు వాదోడుగా నుందురు. ప్రతి సంతానమునకు మధ్య రెండు లేక మూడు సంవత్సరముల వ్యవధి ఉండ వలెను.

సంతాన విషయమైన హంశముల వేరు వేరు సంఘములందు పరీక్షింపగా ఈ క్రింది విషయముల గ్రహింపగల్గిరి.

భాగ్యవంతులై సంఘము నందు గొప్ప స్థానముల నాక్రమించిన వారిలో పరిమితి గల్గిన కుటుంబ మందలి పిల్లలు తెలివి గల వారగుట గన్పించినది. ఉద్యోగుల కుటుంబములలో కుటుంబ నియంత్రణా ప్రయత్నముల వలన యుక్తవయస్కులగు తల్లి తండ్రులకు సంతానము తక్కువ యైనది, తల్లి తండ్రులు తరతరాలుగా వచ్చు వ్యాధులకు లోనైయున్న వారలైన వారి సంతానము క్షీణించుట, ఎక్కువ అనారోగ్యత నొందుట కూడ గలదు,

మనోదారుఢ్యము లేని వారికి, చిత్త చాంచల్యము గలవారికి గల్గిన సంతానము అభివృద్ధి నొందలేదు. అట్టివారికి సంతానము గల్గుట శ్రేయోదాయకము గాదని శాస్త్రజ్ఞుల అభిప్రాయము.

సంతానము నిరోధించుటకు వివాహము ఆలస్యముగా చేసికొనవలెను. 20 నుండి 24 సంవత్సరముల వయస్సు గల తల్లులు ఎక్కువ సంతానవంతులైరి, నూటికి 30 మంది శిశువులు వీరికి గల్గిరి. 25 నుండి 30 వరకు వయస్సు గల తల్లులకు నూటికి 25 మంది పిల్లలు గల్గిరి, 20 కి క్రిందగాని 30 కి పైన

గాని వయస్సు గల తల్లులకు సంతానము తక్కువని నిరూపింపబడినది. తల్లి చిన్న వయస్సు నొందియుండగా జన్మించిన శిశువులు యుక్తవయస్కురాలైన తల్లికి జన్మించిన శిశువుల కన్న 3 రెట్లు ఎక్కువ మరణించిరి. చిన్న వయస్కులైన స్త్రీలకు గర్భములు పోవుట, అకాల శిశుజననములు ఎక్కువ కన్పించినవి. గాన స్త్రీలు 20 సంవత్సరముల ప్రాయము నొందువరకు వివాహము జేసికొనుట యుక్తముగా గన్పింపదు.

## గర్భధారణ నిరోధించు మార్గములు

సామాన్యముగా స్త్రీల శరీరంలోని అండములు రెండు బహిష్టుల మధ్యకాలమందు పరిపక్వము చెందును. అట్లు పరిపక్వము చెందిన అండము 2 రోజులు మాత్రము సజీవమై యుండును. స్త్రీ అంగమందు ప్రవేశించిన వీర్యము 3లేక 4 రోజులు గర్భధారణకు అనుకూలముగ నుండును. ప్రతి మాసమందును గర్భధారణకు అనుకూలమగు రోజులు 8 ఉన్నవి. అండము పరిపక్వము చెందుటకు పూర్వము 3 రోజులు, పరిపక్వము చెంది వెలువడిన రోజు, అటు తర్వాత సజీవముగా నుండు 2 రోజులు, ఇందులకు పూర్వ పరదినములు 2 స్త్రీ సంభోగము వర్జింపవలసిన కాలము. బహిష్టు ప్రథమ దినము నుండి వారము రోజులు, మరుబహిష్టుకు పూర్వము 12 రోజులు సురక్షితకాలము. అనగా ప్రథమబహిష్టు నుండి 9 వ దినమున ప్రారంభమై 19 వ దినమువరకు గర్భధారణకు అనుకూల సమయము, ఈ కాలములు అనేక కారణముల వలన మార్పునొందును. ప్రసవానంతర కాలములందు, తల్లివద్ద పాలుత్రాగు బిడ్డలున్న కాలములందు, బహిష్టు ఉడిగే వయస్సునందు ఈ క్రమము పాటించుట కష్టమని నిరూపింపబడినది. అనారోగ్య ప్రాప్తివలన గూడ ఈ కాలము మారుట గలదు. గాన ఈ పద్ధతి అంత ఫలదాయకము గాలేదు.

ఎక్కువ ప్రచారము నొందుతున్న అసంపూర్ణ సంభోగ పద్ధతి క్షేమకరముగాదని నిరూపింపబడుచున్నది. స్ఖలనమునకు పూర్వము ప్రవహించు ద్రవమందుగూడ జీవబీజములుండుట గలదు. వాని మూలకముగా గర్భధారణ జరుగుట సామాన్యము. అనారోగ్యులగు పురుషులు ఈ క్రియ పాటింపరాదు. ఇందుమూలకముగా నష్టము వాటిల్లును.

సంభోగానంతర శుచీకరణ మరియొక పద్ధతి. అన్ని సమయములందు గాని అందరకూగాని ఈ అవకాశము సకాలమున లభింపదు. గర్భాశయ ముఖద్వారము నొందిన వీర్యమందలి జీవకణములు త్వరలో గర్భాశయమును ప్రవేశింపగలవు. అనాగరిక కుటుంబములకు చెందినవారు, విద్యావంతులు గానివారు, కొందరు స్త్రీలు ఈ పద్ధతి నవలంబింప నిరాకరించుచున్నారు. గాన ఈ క్రమము నిష్ఫలము.

బ్రహ్మచర్య మాచరించుట భార్యాభర్తలకు సహజముగా నలవిగాని పని. కొందరు ఇట్టి బ్రహ్మచర్యా చరణవలన ఆరోగ్యమునకు భంగము గల్గునని అభిప్రాయ పడుచున్నారు. అట్టి నిదర్శనములు గాన్పింపవు. మనోబలమున్న వారుగాని ఈ క్రమము నాచరింపలేరు. గాన ఇది ప్రజాబహుళ్యమునకను వర్తించు పద్ధతి గాలేదు.

శస్త్ర చికిత్స మార్గము మంచిది. అందు స్త్రీలకు కష్టము. ప్రసవించిన మొదటి 4 రోజులలోగాని ఇట్టి చికిత్స చేయనలవిగాదు. పురుషులకు శస్త్రచికిత్స సులభము. శస్త్రచికిత్స నొందిన పురుషులు వ్యాధిగ్రస్తులైరని, ఇతర పరిణామములకు లోనైరని అనేక అభిప్రాయముల వెల్లడించుచున్నారు. అనుభవములో ఎట్టి విపరీత పరిణామములు సంభవించుట లేదు. గాన ఈ సులభ మార్గమునవలబించుటకు పూర్వము కుటుంబపరిమితి నిర్ణయించుకొనవలెను అపుడుగాని ఈ చికిత్సనొందరాదు.

రసాయనిక పరికరములు. స్త్రీలు, పురుషులు ఉపయోగింపవీలైన పరికరములున్నవి. ఇవి క్రమపద్ధతిలో నుపయోగించుటకు వైద్యుల సలహాల నొందవలెను.

## 3 వ పంచవర్ష ప్రణాళికయందు కుటుంబనియంత్రణము

మూడవ పంచవర్షప్రణాళికా కేంద్రసంఘంవారి సిఫార్సులు. కుటుంబనియంత్రణా సంఘములు ప్రతిగ్రామమందు. పంచాయతీలయందు. బ్లాకులయందు, జిల్లాలయందు,పట్టణములందు ప్రవేశపెట్టవలెను. ఆర్గురు సభ్యులుగల ప్రతి పంచాయతీ యందు ఈ కార్యక్రమము ఒక సభ్యుని అజమాయషీయందుంచవలెను. జిల్లా సంఘములు తమ అజమాయిషీనందున్న అన్ని సంఘముల కార్యక్రమముల క్రమశిక్షణ జరుగునట్లు చూడవలెను. ఉద్యోగులు, ప్రజలు ఇందుకు మనః పూర్వకముగా తోడ్పడునట్లు ప్రచారము గావింపవలెను. సంఘములందు సభ్యత్వం ఉద్యోగులకు, గ్రామ, పంచాయతీ, బ్లాకుల నాయకులకు, ఇతర వాలంటరీలకు ఇచ్చి ఈ కార్యక్రమము కొనసాగింపవలెను. తద్వారా ఈ కార్యక్రమము ప్రతి పౌరునకు అందుబాటునందుండునట్లు వసతుల గల్పించి ఇందలి ప్రాముఖ్యత వారికి తెలియజేయునట్లు ప్రచారము గావింప

వలెను. కుటుంబ నియంత్రణా ఫలితముల ప్రచారము, ఆరోగ్య కేంద్రములు, Social welfare boards, విద్యాశాఖ వారు, వ్యవసాయశాఖ వారు, ఆరోగ్యశాఖ వారు, పంచాయితీ సభ్యులు కొనసాగింపవలెను.

శాస్త్రసమ్మతమైన పద్ధతులతో ఈ కార్యక్రమము కొనసాగించుట, కాలగడువు సిద్ధాంతము, శస్త్రచికిత్స మొదలగు మార్గముల అందరకూ తెలియజేయవలెను. నురుగు మాత్రలు, రబ్బరు తొడుగులు, రసాయనిక టోపీలు ఎక్కువగా అందచేయవలెను. ఒక్కొక్క కేంద్రమునకు రూ 1500 లకు మించని పరికరములుండవలెను. నర్సులు, మంత్రసానులు, హెల్తు విజిటర్లు ఈ పరికరముల స్త్రీలకందజేసి అవి ఉపయోగించు పద్ధతుల వారికి నేర్పవలెను. వాలంటీర్లలకు తగు ద్రవ్య సహాయము గూడ నొసగవలెను. పాఠశాలలయందు విశ్వ విద్యాలయములందు కుటుంబనియంత్రణా పద్ధతుల వారికి తెలియచేయవలెను. ఈకార్యక్రమము వ్యాప్తినొందుటకు అన్ని ప్రయత్నములు జరిపింపవలెను.

### ఆంధ్ర దేశమందలి జనాభా వివరములు

| 1901 | 1961 | జనాభా పెరుగుదల | 1961 లో నూటికి పెరిగిన జనాభా | 1961లో చదరపు మైలుయందున్న జనులు |
|---|---|---|---|---|
| మిలియనులు | మిలియనులు | మిలియనులు | | |
| 19.7 | 36.0 | 16.3 | 88.7 | 339 |

మన దేశమందలి ఇతర ప్రాంతములతో పోల్చిన ఆంధ్ర ప్రాంతమందు గూడ ఎక్కువ జనులున్నట్లు ఋజువైనది. 1901 సంవత్సరమున ప్రథమ స్థానము బీహారునకుండెను. ఆంధ్ర ప్రదేశము రెండవది. 1961 సంవత్సరమున బీహారునందు 46.5 మిలియనుల ప్రజలు, మహారాష్ట్రమందు 39.5 మిలియనులు. ఆంధ్ర ప్రదేశమందు 36.0 మిలియనుల ప్రజలు నివసించు చున్నారు. పెరుగుదల స్థితి పరిశీలించిన మనము నాల్గవస్థాన మాక్రమించితిమి. చదరపు మైలున కూడా జనాభా వివరములందు మనము ఆరవ స్థానమందున్నాము. జననములందు మార్పురాకపోగా, మరణములు తగ్గినవి. 1901లో 1000కి 31.2 మరణములుండగా 1960లో 21 6 మరణములున్నవి. శిశు మరణములు 1951–56 లందున్న 154.6 మంది 1956–61లకు 135.0కు తగ్గినవి. వీని ననుసరించి అధిక ప్రజలున్నారని, ఇకముందు ప్రజ ఎక్కువగు అవకాశములున్నవని గాన్పించుచున్నది. అందువలన కుటుంబనియంత్రణ మార్గముల శీఘ్రముగా అమలు చేయ వలసిన అవసర మేర్పడినది.

కుటుంబనియంత్రణములో ప్రజలు కొన్ని అనుమానములు వెలిబుచ్చుచున్నారు.

ఈ కార్యక్రమము స్త్రీ పురుష సంభోగశక్తిని విరోధించునా? విరోధింపదు.

భార్య భర్తలు సమ్మతించి సహకరించిన వారిపిల్లల బాధ్యతలను సక్రమముగా నిర్వహించిన వారగుదురు.

ప్రకృతి సిద్ధాంతములకు ఇది విరుద్ధమా? మానవుల జ్ఞానశక్తివల్ల అనేక అరిష్టములు కట్టుబడినవి. నాగరికత పెరిగినది. నాగరిక దేశములందు ఈ కార్యక్రమము వైద్యము, వ్యవసాయము మొదలుగాగల శాస్త్ర కార్యక్రమము వంటిదిగా ఆచరింపవలెను.

ఆయుః ప్రమాణము క్షీణించునా? ఇది కేవలము అజ్ఞాన విలసితమైన నమ్మకము. ఆయుఃప్రమాణమునకు సంతానోత్పత్తికిని ఏమి సంబంధము లేదు.

పిల్లలు క్రమకాలములందు ఏల జన్మించవలెను? ప్రతి 2 మంది3 సంవత్సరములకు శిశుజననము గల్గిన తల్లి తండ్రుల ఆరోగ్యము. పిల్లల ఆరోగ్యము అభివృద్ధి నొందుటయే గాక, పిల్లల మనోశక్తులు వికసించును.

వైద్య శాస్త్రము ననుసరించి ఎట్టి స్త్రీలు గర్భముల ధరింపనర్హులు?

స్త్రీలకు గర్భ ధారణ ప్రమాదమని తెల్పుట అందరకును వర్తింపదు. ఎట్టి స్త్రీలు ఎట్టి కాలములందు గర్భముల ధరింప శక్తివంతులో నిర్ణయించుటకు వైద్యుల సలహాల నొందవలెను. గుండెజబ్బు, క్షయ, మూత్రపిండ వ్యాధులు అతిసారము సుఖవ్యాధులు మొదలుగాగల వ్యాధులకు గురియైనవారు, కొన్నిరకముల ఉన్మాదములు గలవారు గర్భధారణకు అనర్హులు.

తల్లులవద్ద పిల్లలు పాలుత్రాగు కాలమందు స్త్రీ గర్భము ధరింపదా? ఇది నిజము గాదు. ఆ కాలములందు గూడ అనేక స్త్రీలు గర్భముల ధరించున్నారు.

నిరోధకములు వాడకుండిన స్త్రీ ప్రసవించిన ఎంత కాలములో తిరిగి గర్భము ధరింప గలదు? దీనికి నియమిత కాలము

లేదు. బహిష్టుకు పూర్వము గర్భవతులైన స్త్రీలున్నారు. 11లేక 12 నెలలలో తిరిగి ప్రసవించిన వారు గలరు. కనుక నిరోధకములు వాడుట మంచిది.

సంతానవాంఛ లేనివారు సంపర్కము మానుట మంచిదా?

సంతాన విషయమున మంచిదిగాని అన్యదాగాదు. భార్యాభర్తలు ఒక గృహమందు నివసించుచూ ఇట్లు చేయుట అసంభవము. ఇట్టి కార్యములు వారి గృహ సౌఖ్యమునకు ఆటంకము కలగించుట గూడ గలదు. కనుక సంభోగ విసర్జన క్షేమకరముగాదు. నిరోధించు ఆత్మనిగ్రహము గలవారు మాత్రము చేయవచ్చును.

రసాయనిక పరికరముల వాడుట సంభోగశక్తి తగ్గించునను మాటలో సత్యము లేదు. శాస్త్రయుక్తముగా తయారు గావింపబడిన పరికరములు ఏమియు హాని చేయవు.

రసాయనిక పరికరముల ఉపయోగించుటచే రణములు గల్గునని కొందరనుకొందురు. ఇట్టివి ఇంతవరకు కాన్పించలేదు.

శస్త్ర చికిత్స నొందినవారు తిరిగి గర్భముల ధరించు మార్గములున్నవా?

లేవు. శస్త్రచికిత్స నొందుట ఆఖరు మార్గము. తగు సంతానము బడసినవారే ఈ చికిత్స నొందవలెను. బొంబాయి రాష్ట్రమున 1956నుండి ఇంతవరకు 69,950 పురుషులు, 71,789 స్త్రీలు శస్త్రచికిత్సనొందిరి. వారు సుఖముగా జీవించుచున్నారు. తిరిగి స్త్రీలు గర్భముల ధరింపలేదు.



సత్యమ బ్రహ్మము దపమును
సత్యమ ప్రజలను సృజించు సత్య మలోక
స్థిత్యాధానము జేయును
సత్యం బనృతంబు చేత సంపహితమగున్

భారతము (శాం.ప.)

# కవితా నీరాజనము

"శ శా ం క"

కారు మొయిళులు క్రమ్మియెల్లెడ
కటిక చీకటి గడలు కొనగా
కాళరాత్రిలో మెరపు మాదిరి
కవియె గురజాడ!

దిక్కు తెలియక పిక్కటిల్లిన
తెలుగు జాతికి వెలుగు జ్యోతిగ
దెసల దెసలను తేజరిల్లిన
దీప్తి గురజాడ!

మందరాచల మంథనమ్మున
మధ్యగా శశిరేఖ వొడమిన
విధముగా కల్లోల యుగమున
వెలసె గురజాడ!

భువన భవనపు వైభవమ్మె
ప్రవిమ లాంతః కరణ నిండ,
ప్రగతి సంగీతమున పల్లవి
పాడె గురజాడ!

కావ్య కన్య ప్రబంధ బంధన
కంఠహారము చిక్కువిదలిచి
క్రొత్తగా కైసేసె ముత్తెపు
కోవ గురజాడ!

తెలుగు పలుకుల తీయదనములు
తెలిసికైతల కధనములలో
తీరు తెన్నులు సక్రమమ్ముగ
తీర్చె గురజాడ!

మంచు పెందెర మాటుమణగిన
మనుజలోక మహేతిహాసము
రవిసమాన ప్రభల వెలయగ
వ్రాసె గురజాడ!

ఆంధ్రులందరి కీడు గడగా
ఆధునిక సంస్కార పధమున
అడుగు జాడల విడిచిపోయిన
వాడె గురజాడ!



కథానిక:

# మరీచిక

శ్రీ మధురాంతకం రాజారాం

(గత సంచిక తరువాయి)

నిర్ణయాలు చేసుకోడం తేలికే! కానీ మనోఫలకం మీద నుంచీ జ్ఞాపకాలను పూర్తిగా చెరిపి వేయడంగానీ, ఆలోచనలు రాకుండా అరికట్టడం గానీ, మాటలాడినంత సులభం కాదు. కానీ వీలయినంత వరకూ ప్రకాశం శోభాదేవిని గురించి మరచిపోవడానికే ప్రయత్నించాడు.

కాలం పరుగిడుతోంది.

ఆరుమాసాలు గడచిపోయాయి.

ఒక పర్యాయం ఏదో స్వంతపనిమీద పట్టణానికి వెళ్ళవలసి వచ్చింది ప్రకాశం. మామగారింటికి వెళ్ళగూడదన్న పట్టింపేమీ లేదుగానీ, యిటీవలి పరిణామాల దృష్ట్యా తానక్కడికి వెళ్ళడం యిటు తనకూ అటు ఆవతలివాళ్ళకూగూడా యిబ్బందిగానే వుంటుందని అతడా ప్రయత్నం విరమించుకున్నాడు. వెళ్ళిన పని అనుకున్నంతకంటే త్వరగానే ముగిసిపోయి, బస్సు బయల్దేరడానికింకా ఒకటి రెండు గంటల వ్యవధి వుండిపోయి, ఆ వ్యవధిలో ఏం చేయాలో తోచక మెల్లగా బజారువెంట నడుస్తున్నాడు ప్రకాశం. అతడారోజు నిశ్చితంగా యింటికి తిరిగిరావడం భగవంతుడికిష్టం లేకపోయిందేమోమరి! బజారులో ప్రకాశానికి తుపానులా ఎదురయ్యాడు శేఖరం.

"ఎంతకాలానికి కనిపించావు ప్రకాశం! నువ్వు సేవిస్తున్న సిద్ధౌషధమేదో చెప్పరాదట్రా బాబూ! రోజు కొకరకంగా ప్రపంచ చరిత్రగూడా మారిపోతోంది. నువ్వుమాత్రం చెక్కుచెదరడం లేదు. రెండేళ్ళకు మునుపు శోభాదేవి పుట్టినరోజు విందులో ఎలాగైతే కనిపించావో, యిప్పుడూ అలాగే వున్నావు. నన్నుచూడు. నా అంతట నేనుగా నిన్ను పలకరించబట్టి సరిపోయింది గానీ, లేకుంటే నువ్వు నన్ను గుర్తుపట్టి వుండవు..."

ఆమాట నిజమే! ఒకటి రెండు వారాలపాటు రోగశయ్యను ఆశ్రయించుకుని వుండి అప్పుడే ఆసుపత్రినుంచి డిస్చార్జి అయిన రోగిలా వున్నాడు శేఖరం!

"ఐనా మరేం పరవాలేదులేవోయ్ ప్రకాశం! అరగంటకో కప్పుచొప్పున వేడివేడిగా యిన్ని కాఫీనీళ్ళు ఈ తోలుతిత్తిలో పోస్తున్నంత కాలం, గాలితో నిండిన బెలూనులా మనపని ఉత్సాహంగానే వుంటుంది. ఇప్పుడే హోటల్లో నుంచీ బయట పడ్డాను గనుక, కాసేపు నేను నీకు కాలక్షేపసాధనంగా ఉపకరించ గలను. ఆ పార్కులోకి వెళ్ళి కూర్చుందాం పద!"

పార్కులోకి వెళ్ళి కూర్చోగానే అసలు విషయంలోకి వచ్చేశాడు శేఖరం. "ఈ మధ్య నేను నీకొక జాబుగూడా వ్రాయాలనుకున్నాను ప్రకాశం! కానీ నీకు తెలిసిందే గదూ! మనిషి కనిపిస్తే మాటల్ని జడివానలా వర్షించ గలను గానీ కలం చేతికి తీసుకుని నాలుగు వాక్యాలు వ్రాయాలంటే నాకు బద్ధకం! అదిగో, అప్పుడే ఆశ్చర్యపడిపోతున్నావు నువ్వు! ఆశ్చర్యపడవలసిన విషయమే మరి! మూడు నిద్రలు చేసిన తరువాత ఎంతటి ముద్దరాలైనా సరే భర్తను వదిలిపెట్టి వుండాలనుకోదు. ఒకవేళ తప్పనిసరిగా పుట్టింటికి వెళ్ళవలసి వచ్చినా, ఆవిడ మళ్ళీ భర్తృసమాగమాన్ని గాఢంగా వాంఛించడం సహజం ఈ లోక సామాన్యమైన విషయానికి నాకు తెలిసినంతలో శోభాదేవి ఒక మినహాయింపు. మళ్ళీయిదేమో ప్రియపడి చేసుకున్న పెళ్ళి, ఆడ మగలిద్దరూ బాగా చదువుకున్న వాళ్ళు. భోగ భాగ్యాలకా తక్కువ లేదు..."

"నీకు పుణ్యముంటుంది గానీ కాస్తా వివరంగా చెప్పు శేఖరం! ఇప్పుడు శోభ పుట్టింటి దగ్గరే వుందా ఏమిటి?"

"ఉండకపోతే ఈ ప్రసక్తి ఎందుకొస్తుంది ప్రకాశం! కారణమేమిటో అనూహ్యం. వెళ్ళిన తరువాత నెలరోజులకే తిరిగి వచ్చింది శోభ. మళ్ళీ వెళ్ళలేదు. అసలు వెళ్ళాలన్న ధ్యాసే ఆమెలో కనిపించదు. భార్యా భర్తల మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు గూడా సాగుతున్నట్టు లేదు..."

మనసు నిండుకూ విషాదాన్ని నింపుకుని స్వగ్రామానికి తిరిగి వచ్చాడు ప్రకాశం. వచ్చిన పదిరోజులకే అతడికోవార్త తెలిసింది. ఎందరెందరో పనిగట్టుకుని హితబోధ చేయగా భర్త దగ్గరికి వెళ్ళడానికి సమ్మతించిందట శోభ. ఈసారి తల్లి దండ్రులే ఆమెను తీసుకెళ్ళి భర్తృ సాన్నిధ్యంలో దిగవిడిచి వచ్చారట!

పెళ్ళయినతర్వాత భర్తతో ఒద్దికగా కాపురం చేసుకోకుండా తమ పంచన పడివున్న కూతురు కన్న తల్లి దండ్రులకు సైతం బరువుగానే పరిణమిస్తుందేమో! వాళ్ళమాటకేమిగానీ తన తలపైన్నుంచి కొండంత బరువు క్రిందికి దిగి పోయినంతగా సంతోషించాడు ప్రకాశం.

* * *

చెడిపోయిన నీళ్ళతోడే యంత్రాన్ని రిపేరీ చేయించడం కోసం బస్‌టాపుమీద వేయించుకుని పట్టణానికి వెళ్ళాడు ప్రకాశం. యంత్రానికి సంబంధించిన మరమ్మతులు ఒక వట్టాన పూర్తిగాకపోవడం వల్ల నాలుగైదు రోజుల వరకూ అక్కడే వుండి పోవలసి వచ్చింది. ప్రకాశం ఆలోచించాడు. అత్తమామలను చూచి చాలాకాలమైంది. జరిగిందేదో జరిగిపోయింది గనుక లేనిపోని వైమనస్యాలను మదిలో ప్రోదిచేసుకుని బాధ పడటం వల్ల లాభమేముంది? కాదంటే అన్నంతో బాటుగా, నాలుగు సూదిపోటు మాటలు గూడా వడ్డిస్తుందేమో అత్తయ్య! పెద్ద వాళ్ళెప్పుడూ చెడ్డవాళ్ళుకారు గనుక ఆవిడ అనావచ్చు. తాను వినావచ్చు...

ప్రకాశం అంచనాకు విరుద్ధంగా కంటనీళ్ళు పెట్టుకుంది అత్తయ్య "ఇంతకాలానికి జ్ఞప్తికొచ్చామా నాయనా! మీరు త్రెంచుకో దలచు కుంటే మాత్రం రక్త సంబంధాలు తెగిపోతాయట్రా ప్రకాశం! రెండు మాసాల నుంచీ నువ్వునాకళ్ళల్లో మెదలు తున్నావనుకో? ఒక్కసారి ఇక్కడికి వచ్చిపొమ్మనిచెప్పి, నీకోజాబు వ్రాయమని మీ మామయ్యతో చెప్పాను. గూడా! కానీ ఆయనకు తీరికేది! ఆవ్యాపారాలేమిటో, ఆయనేమిటో అంతేగానీ ఆయనకు మరొక గొడవ కాబట్టదు. ఇంతచేశావా భగవంతుడా అని లోలోపలే కుమిలి పోవడానికి ఈ ఇంట్లో నేనొక్కదాన్ని మాత్రమే మిగిలాను..."

అత్తయ్యకు వచ్చిన కష్టమేమిటో ప్రకాశానికి స్పష్టంగా అవగతమైందిగాదు. ఆవిడ వాక్ప్రవాహం అలాగే మరికొంత దూరం ప్రవహిస్తే ఆ వివరం తనంతటదే తెలిసి వస్తుంది లెమ్మనుకుని అతడు మౌనంగా వుండి పోయాడు.

"బ్రతకాలని బావి త్రవ్వగా నీళ్ళకు బదులు బండరాయి పైకి తేలితే మరేమను కోవాలిరా ప్రకాశం! అతగాడు పెద్ద ఉద్యోగమే చేస్తున్నాడనుకో! ఐతే మాత్రం? ఇంటికీ ఆఫీసుకూ తేడా తెలియకపోతే అతణ్ణి గురించి ఏమనుకోవాలి? ఉదయం అయిదు గంటల కల్లా అలారం పెట్టిన గడియారంలా నిద్ర లేచేస్తాడు, ఇక చూచూకోరా బాబూ మిషను గూడా అలా పని చేయదు! కాలం ఖరీదు చాలాఎక్కువట! ఒక్క క్షణం గూడా వృధాచెయ్య గూడదట! ఉదయం ఆరోగంటకల్లా ప్లాస్కులో కాఫీ సిద్ధంగా వుండాలి. లేకుంటే ఆపూటకిక కాఫీ అనవసరమంటాడు. సాయంత్రం సినిమాకు సిద్ధం కమ్మంటాడు. ముస్తాబు చేసుకోడంలో అయిదు నిముషాలు ఆలస్యమైతే ఆరోజుకిక సినిమా ప్రోగ్రాము రద్దేనంటాడు. అలాంటి స్ట్రిక్టు ఆఫీసరుకింద పెళ్ళామైతే మాత్రం ఎలా తట్టుకోగలుగుతుందిరా ప్రకాశం?"

"ఇదేం చాదస్తమత్తయా! తట్టుకోక చేసేదేముంది?

బ్రతుకంటే అదేమిటో అల్లా టప్పా వ్యవహారమనుకుంటారు మీరు పరిస్థితులకూ, పరిసరాలకూ సర్దుకోడమే జీవితం", కాస్త కటువు గానే హితవు చెప్పాడు ప్రకాశం.

అత్తయ్య విస్తుపోయింది. "ఐతే ఆ మాత్రం నిరవాకానికి ఆమ్మాయిని అతని వెంట ఎందుకు పంపాలిరా ప్రకాశం? ఇక్కడే దైనా ఉద్యోగంలో చేర్పించితే సరిపోదూ?"

ఇదేంప్రశ్న! దీనికేమని సమాధానం చెప్పాలి! తల దిమ్మ దిరిగి పోయింది ప్రకాశానికి,

కాఫీ తీసుకరావడానికి అత్తయ్య లోపలికి వెళ్ళింది. బయట సూర్యాస్తమయానంతరం చీకటి నీడలు చిక్కగా అలము కుంటున్నాయి. మీటనొక్కి విద్యుద్దీపాలు వెలిగించే పాటి ఓపిక గూడా యిక్కడెవ్వరికీ లేదేమో, మేడలోపల సైతంఅంధకారమే నడయాడు తోంది. అందుకు తోడూ ధ్యాన సమాధిలో కూర్చున్న యోగి సత్తముడిలా గాలిదేవుడు గూడా కదిలీ మెదల కుండా స్తబ్ధుడై వున్నాడు. దగ్గర్లో ఎవరిదో పద ధ్వని వినిపించినట్టుగా తోచి తలపై కెత్తాడు ప్రకాశం.

తలపైకెత్తి ద్వారం వైపు చూచిన క్షణంలో ఆశ్చర్యాతి రేకం వల్ల కొయ్యబారి పోయాడు ప్రకాశం,

తెల్లటిచీర. చెల్లా చెదరైన ముంగురులు. బోసిగా వున్న నుదురు. వడగాలి దెబ్బకు వాడి పోయిన తోట కూరకాడలా నల్లటి తెరపైన తెల్లటి నీడలా మెల్లగా నడచి వస్తోంది శోభాదేవి!

ప్రకాశానివి అనిమిష నయనాలు.

"ఎప్పుడొచ్చావు బావా?" శోభాదేవి పలకరింపు.

జవాబులేదు

"అదేమిటి బావా అలా తెల్లబోయి చూస్తున్నావు?"

ప్రకాశంలో చలనం లేదు.

వ్రేళ్లు ముడుచుకుని పిడికిలి బిగించింది శోభాదేవి. "మాట్లాడు బావా, తలపైన ఓ మొటిక ప్రసాదించ మంటావా బావా?"

"ఏమని మాట్లాడను శోభా! నువ్విక్కడే ఉన్నావని అనుకో లేదు నేను..."

"ఈ మాత్రంగానైనా నేను సుఖపడిపోతున్నందుకు నీకు ఈర్ష్యగా వుందా బావా? నువ్వుమాత్రం మగవాడివి కావా ఏమిటి?" ఒక్క విసురులో మేడ మెట్లపైకి వెళ్ళిపోయింది శోభ.

అత్తయ్య కాఫీగ్లాసుతో ప్రత్యక్షమైంది. "చూచావా ప్రకాశం! ఇదీ వరస. తన స్నేహితురాలు జయప్రద సంగీతం నేర్చుకోలా, అదేవిధంగా తానేమో నాట్యం నేర్చుకుంటుందట! మధ్యాహ్నం మూడుగంటలకు వెళ్తే సాయంత్రం ఆరు ఆరున్నరకు గానీ తిరిగి రాదు. వచ్చిన తరువాత కాళ్ళూ చేతులూ సలుపుతున్నా యంటుంది."

గంట తొమ్మిది కొడుతుండగా అత్తయ్య భోజనానికి పిలిచింది.

పీటపైన కూర్చుంటూ "శోభ భోజనం చేయదా అత్తయ్యా" అన్నాడు ప్రకాశం.

"ఆ మాటెందుకులేరా ప్రకాశం! వారంరోజులైంది. లావు తగ్గడానికేం చేయాలని ఎవరినో డాక్టర్ని సలహా అడిగిందట, అప్పటికీవిడేమో పిప్పళ్ళబస్తాలా వున్నట్టు! ఆయనగారు రాత్రి పూట భోజనం మానేసి రెండు చపాతీలు, గ్లాసెడు పాలు పుచ్చుకో మన్నారట! అసలు సంగతి అదికాదులేరా ప్రకాశం! రోజు కిరవై సార్లు కాఫీ తీసుకుంటే తిండి ఎలా రుచిస్తుంది?"

అవును. ఏది తిండి కాదో దాన్ని తిండిక్రింద స్వీకరించడం వల్ల ఆరోగ్యం చెడిపోతుంది. ఏది వినోదం కాదో దాన్ని వినో దంగా పరిగణించడంవల్ల మానసికారోగ్యం దెబ్బతింటుంది. కానీ ఈమాట ఎవరితో చెబుతాడు ప్రకాశం? ఎవరు వినిపించుకుంటారు?

భోజనమైన తరువాత తాంబూలం నములుతూ బయటకు వచ్చి సోపానాలపైన కూర్చున్నాడు ప్రకాశం.

సాయంత్రం ఆరుగంటలప్పుడు వినిపించినట్టుగా మళ్ళీ అదే పద ధ్వని చేరువకు వస్తోంది. ఐతే ఈసారి వెను దిరిగి చూడ దలచుకోలేదు ప్రకాశం.

"నత్తగుల్లలా అలా ఒళ్లు ముడుచుకుని కూర్చోకపోతే హాయిగా కాసేపు రోడ్లపైన షికారు తిరిగి రాగూడదా బావా? నేనైతే ఆడదాన్ని! రాత్రుల్లో నేను కాలు దీసి బయట పెడితే రక రకాల అనుమానాలు లోకులకు! నీకేం బావా! నువ్వు మగ మహా రాజువి. నిన్ను అడిగేవాళ్ళెవ్వరు?

పెదవివిరవకుండా శోభాదేవి వైపు బిక్కరించి చూస్తున్నాడు ప్రకాశం.

"నాలుగు మిరపకాయల్ని దిగదుడిచి పొయిలో వేస్తువుగానీ

రావే అమ్మా! బావ అదేపనిగా నన్ను చూస్తున్నాడు..." ఎలుగెత్తి తల్లిని పిలుస్తూ పకపక నవ్వుతోంది శోభ.

శోభాదేవి చెప్పినట్టుగా రోడ్డుపైకి పారిపోవడమే ప్రకాశానికి శ్రేయస్కరమనిపించింది.

"ఐనా నాలో ఏమంత విచిత్రం కనిపిస్తోంది బావానీకు?" మళ్ళీ వివాదానికి నాంది.

ప్రకాశం తలదించుకున్నాడు.

"నేనూ మనిషినే బావా! నాకూ మనసుంది, నాకూ హృదయముంది. అందం కనిపిస్తే ఉద్రూతలూగుతుంది నా మనసు ఆనందం కోసం ఆరాటపడుతుంది నా హృదయం. ఈ ప్రపంచం నాది. ఇందలి అందాలు ఆనందాలు నావి! నావి నాకు దక్కకుండా చేయాలని! నాకు వ్యతిరేకంగా జరిగే కుటిల ప్రయత్నాలను నేను ఎదిరిస్తాను..."

పాహిపాహి శోభా! నేనెవరిననుకుంటున్నావు? ప్రకాశాన్ని నేను! నిర్దోషిని—— నోరు విడివడకపోవడంవల్ల ఈ క్షమాపణకు గూడా భావమున జీర్ణమైన సుభాషితానికి పట్టిన గతే పట్టింది.

మొదట బొంయి బొంయి మన్న హారను మ్రోత వినిపించింది. మరుక్షణంలో హారన్ మ్రోతతో బరాబరులు పలుక్కుంటూ పరతెంచి వస్తున్న కారు గేటు దగ్గర కనిపించింది. కిటికీలోనుంచి వెలుపలికి చూస్తూ జయప్రద చేతిని వూపుతోంది

కారులోనుంచి మామయ్య మాత్రమే క్రిందికి దిగారు.

"ఆశ్చర్యంగా వుంది ప్రకాశం! అత్తిపువ్వులూ, తెల్లటి కాకులూ కనిపించవట! నువ్వుమాత్రం కనిపిస్తున్నావే! అమ్మాయ్ శోభా, అదిగో జయప్రద! నీకోసం బయల్దేరి వస్తుంటే కారెక్కించి తీసుకొచ్చాను. దిగవమ్మా జయా..."

"ఎందుకునాన్నా! మేమిద్దరమూ కలసి ఆలా కొంతదూరం వెళ్ళొస్తాము గాని, నువ్వు బావగారిని ఉయ్యేల్లో వేసి జోలపాడి జీజీపోగొట్టు..."

ఏదో అక్కస్సుకు ప్రతీకంలాంటి శోభాదేవి నవ్వు, అయోమయంగా వున్న జయప్రద నవ్వు, అమాయికంగా వున్న మాధవరావుగారి నవ్వు- ఆ నవ్వుల సుడిగుండంలో గింగుర్లు తిరుగుతూనే వున్నాడు ప్రకాశం- కారు వెనుదిరిగి వచ్చిన దారిగుండా వెళ్ళిపోతుంది.

పడుకున్నాడేగానీ ప్రకాశానికి నిద్రపటింది గాదు. హోరెత్తిపోతున్న ఆలోచనల అలజడిలో కాలాన్ని వేగిస్తూ అతడు గోడ గడియారంలో గంట పన్నెండు గావడం గూడా విన్నాడు. శోభాదేవి యింకా యింటికి తిరిగివచ్చిన జాడలులేవు. ఓ కునుకుతీసి మేలుకున్నాడు ప్రకాశం. ఎప్పుడొచ్చిందో ఏమిటో, గదిలో దీపం వేసుకుని గొంతెత్తిపాడుకుంటూంది శోభ. ఉదయం ఉపాహారం తీసుకున్న తర్వాత, ప్రయాణోన్ముఖుడైన ప్రకాశం శోభాదేవితో ఒక మాట చెప్పివెళ్ళడం బాగుంటుందని మేడపైకి వెళ్ళాడు. గాఢ నిద్రలో వుంది శోభ. నిద్రలేపడమెందుకని ప్రకాశం మౌనంగా తిరిగి వచ్చేశాడు......

* * *

వివాహం లాటరీ లాంటిదంటారు. దొరికినదానితో సర్దుకపోగలిగిన వాళ్ళను ఈ లాటరీ బాధించదు. ఏది దొరికినా సరిపెట్టుకోలేని వాళ్ళకు మాత్రం యింతకంటే విషమ పరీక్ష వేరొకటి వుండదు.

సెకండ్ ఫారందాకా చదువుకున్న ఓ అయినింటి అమ్మాయిని పెళ్ళాడాడు ప్రకాశం. పేరు సుభద్ర గొప్ప అందగత్తెగూడా కాదు. కానీ యింగితం తెలుసుకుంటుంది. ఇంపుగా మాట్లాడుతుంది ప్రకాశం పొలంలో వుంటే కారియర్‌లో భోజనం తీసుకెళ్తుంది. ఇంట్లోవుంటే పెరటిలోని చిక్కుడు తీగకు పందిరి వేయమంటుంది. రాత్రి పడుకున్నతర్వాత "ఏమండీ! ఓ కథ చెప్పరూ" అని ప్రాధేయ పడుతుంది. ప్రకాశం కథ చెబుతుండగానే ఆదమరిచి నిద్ర పోతుంది.

సుభద్ర నిద్రపోయి, తానింకా మేలుకుని పడుకున్న రాత్రి వేళల్లో ప్రకాశం ఒక్కొక్కప్పుడు శోభాదేవిని గురించి ఆలోచించడం కద్దు—ఈ విశాల ప్రపంచంలో లోపమంటూలేని మానవుడుండడు. ఐతే మిగిలిన లోపాలన్నీ ఒక ఎత్తు. తాము ఈ ప్రపంచం కోసంకాదనీ, తమ కోసమే ఈ ప్రపంచమనీ భావించడం ఒక ఎత్తు. ఈ భావన మూలంగా అడుగు పెట్టిన ప్రతిచోటా మానవుడికి అసంతృప్తి ఎదురౌతుంది. మంచి నీళ్ళకోసం మరుభూమిలో పరిభ్రమించినట్టుగా, ఒక రంగములో ఎదురైన అసంతృప్తినుంచీ తప్పించుకోడానికి మరొకరంగంలోకి పారిపోవడం జరుగుతుంది. చివరికక్కడ ఎదురయ్యేదిగూడా ఆశాభంగమే! ఏది కావాలో తెలియక పోవడం వల్ల, ఎక్కడికి వెళ్ళాలో నిర్ణయించుకోలేక పోవడంవల్లఅయోమయంలో పడిపోయి బ్రతుకంతా ఒక ఆందోళనగా పర్యవసించే ప్రమాదం ఉంది. ఈ ప్రమాదంనుంచీ శోభాదేవి ఎప్పుడుబయట పడుతుందో, అసలు బయట పడుతుందో పడదో ఎవరు చెప్పగలరు?

* *

# అదనున మదుపు-అదే పొదుపు

'రోహిణి'

వెలలేని బ్రతుకుతో
సిరుల నందించేటి కార్మికా!
పవలు రేయికూడ
ఎండ వానలలోన
గడగడా చలిలోన
యంత్రశక్తిని మించి
శ్రమియించు కార్మికా
వెలుగు బాటలలోన బ్రతుకు
తీరులు దిద్దవోయి ॥వెల॥

నీ సిరులమాల
సంతాన మింటిలో
గంజంబలే త్రాగి
రూపు చెడడం లేద?
మధుసేవ విడనాడి
వెలుగు బాటలలోన బ్రతుకు
తీరులు దిద్దవోయి ॥వెల॥

కార్మిక క్షేమాన్ని
ప్రభుతయాశించి
సహకార సంఘాల
పలుతీరుల నిన్ను
సరిదిద్ద దరినిల్వ
సంఘాల నీడలో బ్రతుకు
తీరులు దిద్దవోయి ॥వెల॥

జీతాలు లేకుండ
పిల్లల చదువులు
సంఘ భారంబున
వెచ్చాల యంగళ్ళు
నిచ్చెనలు నీకవగ
మెట్లెక్కుతూ నీవు
ముందడుగు వేయాలి ॥వెల॥

కలిమిలేములు సదా
కావటి కుండలు
కష్టాల మలుపులో
సుఖం దాగినదయ్యా
భూమితల్లి ఋణము
నీశ్రమలోనెతీర- చేతులను
కలిపి సహకరించోయి ॥వెల॥

ప్రభుత దక్షతలో
శ్రామిక వాడలు
వినోద కేంద్రాలు
విజ్ఞాన నిలయాలు
నగరాల హద్దులలో
నెలకొలుప బడ్డాయి
నీకు చేయూతగా ॥వెల॥

చేత జీతం రాగ
అదుపున పొదుపోయి
ఉన్నంతలో యింత
జాతి క్షేమం కోరి
అదనెరిగి అప్పేయ
నిత్యకల్యాణ నిలయమ్మ
నీ దేశమిటుపైన ॥వెల॥

రేపవలు నీవెంతొ
శ్రమలనన్నిటి దాటి
అదనులో మదుపుగా
పొదుపు రూపంబులో
ప్రభుత కందించ
వెలుగు బాటల బ్రతుకు
వెలుగు నీలోనయ్య ॥వెల॥



సత్యాన్వేషణలో కోపం, స్వార్థం, విద్వేషం సహజంగా మాయమవుతాయి. ఎంత సదుద్దేశమున్నా ఆవేశాలకు లోనైతే సత్యం మరుగు పడుతుంది. ద్వంద్వాతీతునకే సత్యం సంపూర్ణంగా గోచరిస్తుంది.

—గాంధీజీ

* * *

ప్రపంచమెంత దుర్మార్గంలో ప్రవర్తిస్తున్నా తెలిసో తెలియకో సన్మార్గానికి దాసోహమంటుంది.

—బాపూజీ

ఆంధ్ర ప్రదేశ్

# హిమంకరుని గాథ

శ్రీ కల్యాణసింగ్

వేదాలలో విశిష్ట ప్రశంసల నందుకొన్న సోమలతకు అధిష్ఠాన దేవత, పురాణాలలోని అనేక కమనీయ గాథలకు కథానాయకుడు, కవులు తమ ఉగ్రాణంలో తప్పక నిలవ చేసుకొనే అమూల్యవస్తువు, సామాన్య జనుల పాలిటి చల్లని చందమామ— అమృతమూర్తి, అమృతనాముడు ఆ శశాంకుని, ఆ సుధాంశుని ఇతిహాసం రసాస్పద పద్యకావ్యంగా రచింపదగింది. మహా కావ్యం అనిపించుకోవాలంటే ఉండవలసిన ఇరవై రెండు వర్ణనలలోనూ "హిమకరాభ్యుదయం" ఒకటి అని అప్పకవి మతం. 'లూనిక్' ప్రయోగ ఫలితంగా, చంద్రుని ఇతివృత్తానికి ఇకకావ్యవస్తుగౌరవం పోతుంది చంద్రుని కథ ఇక నిస్సారవచన గ్రంథాలలోనే చదవ వలసి వస్తుంది. అది గణితభౌతికశాస్త్రవిశయక పాఠ్యపుస్తకంగా తయారయ్యే దుష్కాలం ప్రాప్తిస్తున్నందుకు దుఃఖపడని రసజ్ఞ పాఠకులు ఉండరు.

ఋగ్వేదంలో ఒకమండలం మండలం యావత్తూ సోమరస ప్రాశస్త్యాన్ని గురించిన వర్ణనలతో నిండిపోయింది సోమరసానికి దేవత్వాన్ని ఆరోపించాయి ఆగమాలు. సోమలతకు అధిదేవత సోముడు సోమలత పేరేతదధిపతికి సంక్రమించింది. సోమలత ఓషధీరాజ్ఞి అయింది. సోముడు ఓషధీపతి అయ్యాడు. సోమరసం ఆస్వాదిస్తే మానవాతీత శక్తులు కలుగుతాయట సోమరసం సేవించిన పూర్వులకు సోముని చేరే శక్తి కలగలేదు. సోమరసం తాగకుండానే నేటి మానవుడు సోముని దగ్గరకు పోయే ప్రయత్నం చేస్తున్నాడు ఆ ప్రయత్నం సఫలం అయ్యే సూచనలు కూడా కనిపిస్తున్నాయి.

సోముడు అనసూయా అత్రిమహర్షుల పుత్రుడని ఒక ఐతిహ్యం. ధర్మనందనుడని ఇంకొక కథనం అత్రివంశీయుడైన ప్రభాకరుని కుమారుడని కథాంతరం.

సముద్రమథన సమయంలో ఆవిర్భవించాడని ప్రతీతికూడా ఉంది.

క్షోణీచక్రభరంబు గ్రక్కదల దిక్కుల్ మ్రోయగా నార్చి య
క్షీణోత్సాహసమేతులై రయమునన్ గీర్వాణులున్ బూర్వగీ
ర్వాణవ్రాతము నబ్ధి ద్రచ్చునెడ తద్వ్యాకృష్టనాగానన
శ్రేణీప్రోద్ధవిషాగ్నిధూమవితతుల్ చేసెన్ బయోదావళిన్.

దేవతలూ, రాక్షసులూ పాలసముద్రం మథించేటప్పుడు వారిచేత ఆకర్షింపబడిన వాసుకియొక్క ముఖపంక్తినుంచి విషాగ్ని యొక్క పొగల సమూహం బయలుదేరింది. అందులోనుంచి

అవిర్భవించాడు చంద్రముడు. భూమి ద్రవ వాయు రూపంలో ఉండిన కాలంలో దానిలోనుంచి ఒక చిన్న భాగం విడిపోయి చంద్రగ్రహం ఏర్పడిందని విజ్ఞానులు చెప్పవచ్చు. యథార్థాన్ని ఇంత శుష్కంగా ప్రతిపాదించే విజ్ఞానుల పాఠంలో సముద్ర మథన గాథలోని అతిరరమ్యతా, రసస్ఫూర్తీ ఎలా వస్తాయి?

దక్షమహర్షికుమార్తెలు ఇరవైఏడుగురిని వివాహ మాడాడు చంద్రుడు. పాపం దక్షిణనాయక లక్షణం లోపించింది అతనిలో. నాల్గవలమె రోహిణిమీదనే అతనికి మక్కువ ఎక్కువ అయింది. సపత్నులకు ఈర్ష్యకలగడం సహజం కదా. తండ్రితో మొరపెట్టు కున్నారు. మామగారిమాటలు లెక్క చెయ్యలేదు చంద్రయ్య. క్షయరోగగ్రస్తుడు కావాలని శపించాడు అల్లుణ్ణి. ఏమైనా అతడు తమభర్త, ఆ రోహిణి తమతోబుట్టువు, భర్తకు శాపం తగిలే టప్ప టికి తమకే దెబ్బతగిలినట్టయింది. మళ్లీ మొర పెట్టుకున్నారు తండ్రితో. శాపం తిప్పడానికి సాధ్యం కాదు. క్షయ అక్షయం కాకుండ, పక్షానికే పరిమితం చేశాడు.

రాజు రాజసూయ యాగం చేశాడు. లోభమే రాజసూయం చేయిస్తుంది.

లోభః ప్రవృత్తి రారంభః కర్మణా మశమ స్పృహా రజస్యేతాని జాయంతే వివృద్ధే భరతర్షభ.

ధనాపేక్ష, ప్రవృత్తీ, కర్మాసక్తీ, ఇంద్రియ నిగ్రహం లేక పోవడమూ, విషయేచ్ఛా—ఇవి రజోగుణ లక్షణాలు. రాజుకు రజోగుణం హెచ్చింది, ఇందుడు ఇంద్రియారాముడయ్యాడు, దేవగురువు భార్య తారతోనే తగులాటం ఏర్పడింది. ఆమెను అపహరించాడు. బ్రహ్మదేవుడు చెప్పినా విడిపించుకోలేదు. బృహస్పతి శత్రువు ఉశనసుడు చంద్రుని పక్షం అవలంబించాడు. దైత్యులూ, దానవులూ సహకరించారు. ఇంద్రాది దేవతలు తమ గురువు బృహస్పతికి సహాయం వెళ్లారు. ఘోర (తారకామయ) యుద్ధం జరిగింది. భూమి కంపించి పోయింది. శివుడు, త్రిశూలం తో చంద్రుని శరీరాన్ని రెండు ముక్కలు చేశాడు. దానితో చంద్రుడు 'భగ్నాత్ము'డయ్యాడు, బ్రహ్మ వచ్చి బలవంతం మీద తారను బృహస్పతికి ఇప్పించాడు. తారకు కుమారుడు కలిగాడు. వాడు తనకొడుకని బృహస్పతీ, తన కొడుకని చంద్రుడూ పేచీ పడ్డారు. చివరికి బ్రహ్మదేవుని మధ్యవర్తిత్వం వల్ల ఆకుర్రవాడు చంద్రుని సంతానమే అని తేలింది. వానికి బుధుడని పేరు పెట్టారు అతనినుంచే చంద్ర వంశం వచ్చింది.

చంద్రుని నామావళి సుందరమైనది. ఆ నామాలతో ఏర్పడిన సమాసాలు సలలిత మైనవి. చంద్ర శబ్దానికి 'అందమైన' అని అర్థం ఉంది. విశేష్యానికి కర్పూరం, నెమిలిపురిలోని కన్ను, బంగారం, ఎరుపుడాలు ముత్యం— మొదలయిన అర్థాలు ఉన్నాయి, చంద్ర శబ్దం సమాసంలో ఉత్తర పదమై శ్రేష్ఠవాచకం అవుతుంది. చంద్రాతపం అంటే వెన్నెల. చంద్రాననలు సుందరులు. చంద్రో దయం ఒక దివ్యౌషధం. చంద్రకాంతం ఒకమణి. చంద్రకాంతి అంటే వెండి అనికూడా అర్థం, చంద్రగోళిక అంటే వెన్నెల, చంద్రద్యుతిఅంటే చందనం. చంద్రబాల అంటే ఏలకి. చంద్రభూతి అంటే వెండి. చాంద్రాయణం ఒకవ్రతం. చంద్రహాసం ఒక ఉజ్జ్వల ఖడ్గం.

సోముని పేర మనకు ఒకరోజే ఉంది—వారంలో రెండవది నర్మద సోమోద్భవ. సోమజంఅంటే పాలు. సోమయాజి పూజ్యుడు కదా. గోదావరికి సోమలత, సోమవల్లరి అనేపేర్లు కూడా ఉన్నాయి శివలింగానికి చేసే ప్రదక్షిణం సోమ ప్రదక్షిణం.

ఇందు డంటే చల్లనివాడు, తేమను కలిగించేవాడు. అతడు హిమకరుడు, తుహినాంశుడు, నక్షత్రహారం కలవాడు కనక తారా పీడుడు. చల్లని కిరణాలు కలవాడు కనక శీతమరీచి, శీతాంశుడు సుధాంశుడు, సుధాకరుడు. చీకటి పోగొట్టేవాడు కనక విధుడు. కలవలకు చుట్టంకనక కుముదబాంధవుడు. ఈశ్వరుని శిరోభూషణం కనక శివశేఖరుడు. అతని రథానికి మూడు చక్రాలూ, పదిగుర్రాలూ మల్లెపువ్వులలాంటి తెల్లని గుర్రాలు. అందువల్ల అతడు శ్వేతవాజి

పాశ్చాత్య భాషలు కొన్నిటిలో చంద్రశబ్దం స్త్రీలింగం; కొన్నిటిలో పుంలింగం, అండమాను దీవులలో చంద్రుడు శుక్ల పక్షంలో పురుషుడు; కృష్ణపక్షంలో స్త్రీ.

మన చంద్రుడు రోమనులకు డైఆన: గ్రీకులకు సలీనీ, డైఆన చంద్రాధిదేవత; మృగయాధిదేవత; మహిళాసంరక్షణి, ఆమె సూర్యునిసోదరి, బహులజ్ఞానవతి. ఏపురుషుణ్ణీ ప్రేమించలేదు. విశుద్ధ బ్రహ్మచారిణి. తన చెలికత్తెలతో అడవులలో తిరుగుతూ ఉంటుంది. ఆమె వనదేవత. మర్త్యులకు రోగచికిత్స చేసే అశ్వినీ దేవత కూడా. ధనుర్బాణాలు పుచ్చుకొని లేడిని వెంబడిస్తూ ఉన్నట్లు ఆమెను చిత్రిస్తారు.

గ్రీకుదేవత సలీనీ. ఆమె జోడు గుర్రాల రథంలో విహారం చేస్తూ ఉంటుంది. ఆమెభుజాలకు రెక్కలూ, ఆమెచేతిలో రాజ

చంద్రం) అనే మన్మథోత్సవం శృంగార క్రీడాభిరామంగా జరుపుకోవడం పరిపాటి.

మేరీమాత స్వర్గారోహణ చిత్రంలో ఆమె పాదాలకింద నెలవంకను చిత్రించడం సంప్రదాయం. సిలువ వేయబడిన యేసు క్రీస్తును చిత్రించేటప్పుడు సిలువమీద గ్రహణచంద్రుణ్ణి వేస్తారు. సృష్ట్యాదిని, సృష్ట్యంతాన్ని చిత్రించే పటాలలో కూడా చంద్రుడు కనిపిస్తాడు. చంద్రవంక ఇస్లామ్‌మత చిహ్నం.

చంద్రమ్మ అభిసంచారి అనే అపప్రథకూడా ఉంది. మహాకవి షేక్‌స్పియర్ జూలియట్‌చేత ప్రియుడు రోమియోతో ఇలా అనిపిస్తాడు:

ఓహో చంద్రమ్మమీద ఒట్టుపెట్టుకోకు
చంచలశీల చంద్రమ్మమీద;
తనముఖగోళం ప్రతిరాత్రీ
పరివర్తనం చెందే చంద్రమ్మమీద:
చంద్రవర్తనంలాగే నీప్రేమకూడా
చంచలం కాగలదు సుమా.

"ఏమైనా చంద్రుడు గుణవంతుడు. ఒక్క కళంకం ఉంటే అది ఏపాటిది? అతని అనంత కిరణాలలో అది అణిగిపోతుంది." అన్నాడు కాళిదాస మహాకవి.

ఏకోహి దోషో గుణసన్నిపాతే
నిమజ్జతీన్దోః కిరణేష్వివాంకః
కృష్ణ భగవానుడు 'నక్షత్రాణా మహం శశీ'
నక్షత్రాలలో నేను చంద్రుణ్ణి అన్నాడు విభూతియోగంలో.

రజతదీప్తిరాజు, రాకా సమ్రాట్టు, శరచ్చక్రవర్తి కవిలోక పోషకుడు. అయనవల్ల కలిగినంత ప్రోత్సాహం కవులకు ఇంకెవ్వరి వల్లా కలగలేదేమో! ఆయన హరి మాత్రమే కాదు పరిమోహన గాథాలహరి. చంద్రునికి ఋణపడి ఉన్న కవిచంద్రుల సమాచారం సమగ్రంగా చెప్పడం ఇక్కడ సాధ్యంకాదు. తిమ్మన్న చకోరప్ప పేరంటాండ్రచేత వెన్నెల బువ్వంపుబంతి విందు పెట్టించాడు. 'రేవెలుంగు మకుటైటభారి మరది: మిసిమి పరసీమ, వలరాజు మేనమామ, అని కీర్తించాడు పెద్దన్న.

మన్మథునికి మేనమామ కావడం వల్ల ఆయన వల్ల ప్రేమికులకు కొంతబాధ కలుగుతూ ఉంటుంది. 'చంద్రం చండకరాయతే, అన్నట్లు అతడు ఒక్కొక్కప్పుడు చండకరుడే అవుతాడు.

స్తనోత్తరీయేణ కరోద్ధృతేన
నివారయంతీ శశినోమయూఖాన్

అని, భర్తృహరి చెప్పినట్లు విరహిణులు పైట చెరగుతో కప్పుకో వలసివస్తూ ఉంటుంది చంద్రకిరణాలకు జడిసి. విరహజ్వర పీడితులకు వెన్నెల పడదనుకొండి. కాని ఆ జ్వరం తగ్గిపోయిన తరవాత అది అపథ్యవస్తువుకాదు; అత్యంత భోగ్యవస్తువు.

ఆరూఢస్థితి చంద్రికాధవళితాజాండంబులో చంద్రుడో
స్ఫారెన్ గాలభిషగ్వరుం డవిరతం బై కాముకశ్రేణికిన్
మారోత్సాహము నిల్వ పాదరసమున్ మర్దించి గ్రాసార్థమై
క్షీర స్థాలిక పెట్టినట్టి గుటికా సిద్ధౌషధంబో యనన్.

వెన్నెలతో తెల్లగా ఉంది బ్రహ్మాండం. కాముకులకు మన్మథోత్సాహం నిలిచి ఉండడానికి కాలమనే వైద్యుడు పాదరసాన్ని మూలికలతో నూరి మింగడానికి వీలుగా మాత్ర కట్టి పాలకుండలో పెట్టాడట. ఆమాత్రే చంద్రుడు.

కాలభిషగ్వరుని వైద్యంవల్ల సంశ్లేషం కలగక మానదు. అప్పుడు చంద్రశాలపై చంద్రాతపం ఆతపం కాదు. అది అమృత వర్షంగా మారుతుంది. శరద్రాత్రివేళ రెల్లు వెల్లి విరిసినట్లు, పిండి ఆరబోసినట్లు వెన్నెల కాస్తూఉంటే, వెండిమలాము చేసినట్లు ధరిత్రీతలం ధవళితం అవుతూవుంటే, మలిన భూయిష్ఠమైన మట్టినేల పాలవెల్లిలాగా పొరాడుతూ ఉంటే ఎవరి హృదయం ఆనంద తరంగాలతో ఉప్పొంగి పోదు! విరహతాపం పోయిన తరువాత వెన్నెల చక్కెరతో చేసిన పరమాన్నమే. వెన్నెలముద్దలు వెన్న ముద్దలే. జ్యోత్స్నారసం ఉష్ణకారకం కాదు చలవచేసే పానకమే.

ఈ ఆనందానుభూతి ఇక మృగ్యం కాబోతోంది. అనాది నుంచీ అనుశ్రుతంగా వస్తున్న అశేష గాథావళి ఇక కల్పనా కథలుగా పోవలసినదేనా! రసపత్రమైన అసంఖ్యాక అఖ్యానాలు కూటకాఖ్యానాలు కావలసినదేనా!

చంద్రుణ్ణి నిర్వాత నిర్జల నిర్జన నిర్జీవ నీరవమైన ఏదో జడ గోళంగా ఊహించుకోవాలంటే, బాధాకరంగా ఉంది. ఆగోళంలో పువ్వులు లేవట. పక్షులు లేవట. మేఘాలు లేవట.

చంద్రుడు హిమకరుడే. హిమం జలంయొక్క రూపాంతరమే కదా. హిమకరునిలో జలం లేకపోవడం విశ్వసనీయంగా లేదు. ది సీ ఆఫ్ రేన్ (వర్షసాగరం), ది సీ ట్రాన్ ఆఫ్ క్వెలిటి

దండమూ ఉంటాయి. సలీనీని దేవరాజు జ్యూస్ ప్రేమించాడు. జ్యూస్‌భార్య హీరాకు అసూయకలిగింది. సలీనీదాది అయిన బీరోగ కామరూపం ధరించి సలీనీదగ్గరకు వెళ్లి హీరా బోధచేసింది. "హీరాదగ్గరకు ఎంతవైభవంగా వెడతావో అంతవైభవంగానూ నాదగ్గరకు కూడా రాకూడదూ?" అని సలీనీ అంది జ్యూస్‌తో. ప్రియురాలికోరికను మన్నించాడు జ్యూస్. దేవరాజు ఉరుములతో పిడుగులతో తరలి వచ్చాడు. సలీనీ విద్యుత్తులో కాలిపోయింది. ఆమెబిడ్డ డైఅనిసస్ మాత్రం ఎలాగో బ్రతికాడు.

గ్రీకుల డైఅనిసస్‌కూ, రోమనుల బాకస్‌కూ భారతీయ ప్రతీకం సోముడు. సోముడు సోమాధిదేవత అయినట్లే, డై అనిసస్ ద్రాక్షాధిదేవత. అతడుకూడ ఓషధీశ్వరుడే.

రోమనుల బాకస్ జ్యూస్‌కు సెమిలీ వల్ల పుట్టినవాడు. తన భార్య హీరా బారినుంచి తప్పించడానికి బాకస్‌ను నైసా పర్వతానికి చేరవేశాడు జ్యూస్. అక్కడ బాకస్‌ను వనదేవతలు పెంచారు. ప్రతిఫలంగా వారికి నక్షత్రలోకంలో స్థానం లభించింది. పెద్దవాడైన తరవాత బాకస్ ప్రాచ్యదేశాల మీదికి దండెత్తి వెళ్ళాడు. భారతదేశం దాకా కూడా వచ్చాడట. మానవజాతికి నాగరికతా సూత్రాలనూ, ద్రాక్షప్రాశస్త్యాన్నీ బోధించాడు. అతని రథాన్ని పులులు లాగుతాయి.

ఇంగ్లీషుభాషలోని మూన్ (చంద్రుడు), మెన్సీజ్ (స్త్రీలఋతువు), మన్త్ (నెల) అనే శబ్దాలు, కొలుచుట అనే అర్థంగల 'మి' అనే సంస్కృత ధాతువు నుంచి వచ్చినట్లు శబ్దరహస్యవేత్తలు చెబుతారు. మూనింగ్ (తెలుగులో 'చంద్రించడం' అనవచ్చునేమో) అంటే పగటికలలు కంటూ బద్ధకంగా ఉండడం అన్నమాట. మూన్‌కాఫ్ (మనభాషలో 'చంద్రవత్సం' అనవచ్చు) అంటే జన్మమూఢుడని అర్థం. (గోమూఢ శబ్దం సంస్కృతంలో వుంది. మూన్‌షైన్ (చంద్రప్రకాశం) అంటే వట్టి మాయ, డంబం, అని అర్థం) మూన్‌డ్రాప్ (చంద్ర బిందువు) అంటే మంత్రోచ్చారణ వల్ల ఓషధులమీద చంద్రుని నుంచి పడే నురుగు.

చాల్డిఅనులూ, ఈజిప్షనులూ, గ్రీకులూ, రోమనులూ చంద్రమండలంలో ఒక మనిషి ఉన్నట్లు భావించేవారు. అతనిపేరు చంద్రస్థమానవుడు (ది మాన్ ఇన్ ది మూన్). కొందరు పాశ్చాత్య భావుకులకు చంద్రమండలంలో ఒక మానవి గోచరించింది. ఆమెపేరు చంద్రస్థమహిళ (ది లేడీ ఇన్ ది మూన్).

చంద్రస్థమానవుని వీపుమీద కట్టెలమోపు ఉన్నట్లుఒక భావన. క్రైస్తవుల విశ్రాంతి దినం ఆదివారం నాడు కట్టెలు ఏరినందుకు ఆమనిషిని లోకాంతరవాసానికి పంపారట. ఆమనిషి వెంట లాంతరూ, కుక్కా, ముళ్లదొంకా ఉన్నట్లు వర్ణించాడు షేక్స్పియర్ మిడ్‌సమర్ నైట్స్ డ్రీమ్ అనే నాటకంలో.

చంద్ర మండలం లోని మనుష్యుడు ఎండిమిఅన్ అనే యువకుడని మరికొందరు కవుల అభిప్రాయం. గ్రీకు పురాణాలలో కొన్నిచోట్ల రాజుగానూ, కొన్నిచోట్ల గోపాలునిగానూ వర్ణింపబడ్డ ఈ యువకుణ్ణి సలీనీ (చంద్రదేవత) మోహించిందట.

చంద్రమండలంలో ఒకబాలుడూ, ఒకబాలిక ఉన్నట్లు భావిస్తారు స్వీడన్ దేశపు రైతులు. జాక్ అనే అబ్బాయీ, జిల్ అనే అమ్మాయీ బాల్చీలో నీళ్లు తీసుకురావడానికి కొండమీదికి వెళ్లారట. నీళ్లతోడి బొక్కెనను ఒక కర్రబద్దకు తగిలించి ఆ బద్దను తమ భుజాలమీద పెట్టుకున్నారట. బద్దా, బొక్కెనా, పిల్లలూ ఆకాశంలోకి ఎగిరిపోయారట. బహుళపక్షంలోని రెండవ వారంలో జాక్ కింద పడిపోతూఉంటాడు. అతడు పడిపోయిన కొన్నాళ్లకు జిల్ జారి పడుతూఉంటుంది.

చంద్రునిలోని మచ్చ లేడి అని భారతీయ సంప్రదాయం. అందుకే చంద్రుడు శశి, శశధరుడు, ఏణాంకుడు, మృగలాంఛనుడు.

యూదుల పాస్ఓవర్ పండుగ పూర్ణిమనాడు వస్తుంది. క్రైస్తవులు ఈస్టర్‌పండుగ మహావిషువం (మార్చి 21) తరువాతి పూర్ణిమ పోయిన మొదటి ఆదివారం నాడు జరుపుకుంటారు. విషువం (సెప్టెంబరు 23) సమీపంలో వచ్చే పూర్ణిమకు హార్వెస్ట్ మూన్ (సస్యపూర్ణిమ) అంటారు. దానితరువాత వచ్చేపూర్ణిమ హంటర్స్‌మూన్ (మృగయ పూర్ణిమ) మనకు ఏరువాకపూర్ణిమ పర్వదినం కార్తికపూర్ణిమ వ్రతదినం.

పూర్ణిమనాటి ఔషధసేవనం ప్రశస్తం. పూర్ణిమకూ ఉన్మాద ప్రకోపానికీ సంబంధం ఉందంటారు. చంద్రుని వృద్ధిక్షయాలకూ, సస్యసమృద్ధికీ కూడా సంబంధం ఉందట. తాంత్రిక యోగాలకు బహుళపక్షం పట్టయింది.

పాశ్చాత్య దేశాలలో నవదంపతులు హనీమూన్ (మకరంద

(ప్రశాంత సాగరం), ది లేక్ ఆఫ్ డ్రీమ్స్ (స్వప్నకాసారం), హరికెన్ ఓషన్ (ఝుంఝూసముద్రం) ఇత్యాదినామాలు పెట్టుకొని ఇంత వరకూ మనం వ్యవహరిస్తూ వచ్చిన జలాశయాలు చంద్ర మండలంలో లేవంటే ఎలానమ్మడం? అవిఅన్నీ మృగతృష్ణలేనా? అవన్నీ మృగతృష్ణలైతే చంద్రమండలంలోని మృగంయొక్క తృష్ణ ఎలా తీరుతున్నట్టు!

అక్కడ గాలి లేదట! గాలి లేకపోతే శబ్దం వినబడదని సిద్ధాంతం. అయితే "కిన్నర వధూ రాజత్కరాంభోజకాంభోజీ మేళవి పంచికారవ సుధాపూరంబు తోరంబుగా" ఏడ్చేవిరహగిరికల రోదనం అరణ్యరోదనం అన్నమాట. ఆ చంద్రరోదనం రామ 'రాజ' భూషణులకు వినబడదన్నమాట. అది "మూగచెవిటివారి ముచ్చట" అన్నమాట.

అక్కడ యూరేనియమ్ ధారాళంగా దొరుకుతుందట. దానిని ఉపయోగించి అణుశక్తిని ఉత్పాదన చేసి చంద్ర మండలం చుట్టూ వాతావరణాన్ని సృష్టిస్తామంటు న్నారు శాస్త్రవేత్తలు.

అక్కడ చెట్టూ చేమా లేకపోవడం అంటే ఆశ్చర్యంగా ఉంది. చంద్రుడు ఓషధీశ్వరుడే. ఆపేరు వాటిని పరిపోషించడం వల్లనే వచ్చింది కాబోలు.

లక్ష ఏభై వేల గ్రహమండలాలలో ప్రాణికోటి ఉండవచ్చు నని ఈమధ్య శాస్త్రజ్ఞులు అంటున్నారు. కొన్నిప్రాణులు మానవుణ్ణి మించినవే ఉండవచ్చుననుకుంటున్నారు కూడా.

భక్ష్యార్థం సర్వదేవానాం సోమః
సృష్ట స్స్వయంభువా

అని దేవీపురాణంలో ఉంది కదా. సర్వదేవతల భోజనం కోసం స్వయంభువు చంద్రుణ్ణి సృష్టించాడట. బహుశా దేవతలనే ప్రాణులు (మనుష్యులను మించినవారు) అక్కడ ఉండవచ్చు. పూర్వం దేవదానవ యుద్ధాలు జరిగాయి. ఇకముందు దేవమానవ యుద్ధాలు వచ్చేయోగం ఉందేమో.



ఇది కర్మభూమి భోగా

స్పదమాలోకంబు ధర్మపరులకు సులభం

బది సత్య శౌచసౌజ

న్యదయాదులు లేనివారి కప్రాప్యమగున్

భారతము (శాం. ప.)



# కన్యాశుల్కంలో నాటకీయ శిల్పం

శ్రీ 'రామకృష్ణ భరద్వాజ'

సరళత–స్పష్టత–రమ్యత అనే మూడుగుణాల్ని ఒకేసారి కల్గిన భావప్రకటన రచనలో 'శిల్పం' అనిపించుకుంటుంది. చెప్పిన భావంలో మెలికలు లేకుండా సుబోధంగా ఉండేట్టుండేది సరళత. ఆ భావంలో సూటిగా బుద్ధిరింద్రియానికి గోచరమయేలా ఉండే గుణం స్పష్టత. అదేభావం వెంటనే హృదయానికి హత్తుకునేట్టుండే రమణీయమైన గుణాన్ని కల్గిఉంటే అది రమ్యత. సాధారణంగా వీనిలో ఏదో ఒకటి ప్రత్యేకంగా పరిణతినందడం మామూలు రచనలో కన్పిస్తుంది. అలా కాక అన్నీ ఒకేసారి ఒకేతీరులో సమగ్ర పరిపుష్టినందితేనే అది శిల్పమనే మాటకి లక్ష్యమౌతుంది. ఏ ఒకటి లోపించినా అది అసమగ్రశిల్పమే... అందుకే ఉత్తమ శిల్పస్వరూపం ఎప్పుడూ ఈ మూటి సమన్వయంగానే దర్శనమిస్తుంది. వ్యస్తంగా వెదకడం కళామర్మాభిజ్ఞుల లక్షణమూ కాదు.

దృశ్యకావ్యాల సందర్భంలో ఈ నిర్వచనం సంకుచిత వ్యాప్తిని పొందడం తప్పనిసరి. ఎందుకంటే పాఠకసహృదయుడు కేవలం బుద్ధిరింద్రియం చేతనే గ్రహించి ఆనందింప గల్గిన వస్తువుని సామాజిక సహృదయుడు నేత్ర కర్ణ బుద్ధిరింద్రియాల మూటి చేతనేగాని గ్రహించి ఆనందించలేని స్థితిలో ఉంటాడు. ఆభావాన్ని బుద్ధికందించే సాధనాలు పాఠకునికి కంటె ప్రేక్షకునికి ఎక్కువ. ఎక్కువ యింద్రియాల వల్ల బుద్ధికి చేరే భావాల్ని సమన్వయించుకుని ఒక రూపమేర్పరచుకొని ఆనందించడానికి కొంత ఆలస్యమౌతుంది. తదనుగుణంగానే ఏకాగ్రతా ఉంటుంది. అందుకవి శ్రవ్యకావ్యంలో కంటె దృశ్యకావ్యంలో రచన ఆలోచనకి తక్కువ అవకాశమిచ్చేదీ, ఎక్కువ భావసౌందర్యాన్నందించేదీ అయుండాలి. ఈ రహస్యాన్ని దృష్టిలో ఉంచుకునే, అనుభవజ్ఞుడైన కవిగాని దృశ్యకావ్యాన్ని చేబట్టరాదని ఊహించి 'నాటకాంతంహిసాహిత్యం' అనడం జరిగింది. అందుకే పైనచెప్పిన శిల్పం శ్రవ్యకావ్యంలో కంటె దృశ్యకావ్యంలో ఉత్తమం.

దృశ్యకావ్యంలోని యీ శిల్పాన్ని పరామర్శించుకునేప్పుడు మూడు ముఖ్య విషయాల్ని దృష్టిలో ఉంచుకోవాలి. సన్నివేశ కల్పనం–సంభాషణ పాటవం–పాత్రపోషణం. నాటక రచయిత ప్రౌఢత్వాన్ని పట్టిచూపే గడ్డువిషయాలీమూడూను. ఈ మూడే నాటకానికోసమగ్రమైన–సమన్వితమైన–సముచితమైన రూపాన్ని కల్పించడానికి పరస్పరం సహకరిస్తాయి. ఈ మూడూ నిరాక్షేపణీయంగాను, సర్వాంగసుందరంగాను ఉండేట్టు రచయిత జాగ్ర

త్తపడితే అప్పుడే ఆనాటకం ఉత్తమోత్తమంగా ఉన్నదన్నమాట! కనుక నాటక రచనలోని శిల్పం విలసిల్లే తావులీమూడే. ఈ మూటినిబట్టి సామూహిక నాటక ప్రయోజన మాధారపడి ఉంటుంది. అందుచేత సూత్రవతుగా యిది కూడా ఎక్కడికక్కడ స్పష్టాస్పష్టంగా నిర్వహింపబడుతూండాలి. లేకుంటే ఆ నాటకం కేవలం వినోదం కోసమే కాని విజ్ఞానం కోసం కాదని పించుకుంటుంది.

నాటకంలోని అంకాలు—రంగాలు వీనిసంఖ్య—సంగతుల మాట అటుంచి, మొత్తం నాటకంమీదగల సన్నివేశాల నేర్పరచడంలోను ఒకదాని తర్వాత ఒకదాన్ని సక్రమంగా అమర్చడంలోను నాటక రచయితని మొదటి సమస్య ఎదుర్కొంటుంది. ఆధునిక నాటక తత్త్వాన్ననుసరించి ఒక సందర్భంలో—ఒక సమయంలో ఒకే దృశ్యంలో—ఒక పాత్రగాని, అంతకంటె ఎక్కువ పాత్రలు గాని ప్రసంగించి ఒక నిర్ణయానికి రావడానికి పట్టే పర్యంతమైన ప్రదర్శిత కథాభాగం సన్నివేశం, ఈ సన్నివేశం స్వతంత్రంగా పటిష్ఠము—సామూహికంగా ప్రయోజనకారీ—కళాత్మకంగా కథాగమనోపకారీ కావాలి. కాకుంటే ఆ సన్నివేశం పేలవము—నీరసము వ్యర్థము అవుతుంది. ఆ సన్నివేశంలేకున్నా కథకిగాని—ఆనందానికి గాని—విజ్ఞానానికి గాని ఏమీలోటు వాటిల్లదన్నమాట! ఇలా సన్నివేశాలన్నీ సక్రమంగాను సలక్షణంగాను నిర్వహింపబడినప్పుడు కథకి బిగువు దానంతటదే సిద్ధిస్తుంది. ఈ ప్రయోజనాన్ని దృష్టిలో ఉంచుకునే ఆలంకారికులు పంచసంధి నిర్ణయం చేశారు.

అలా పటిష్టంగా అనుసంధింపబడ్డ సన్నివేశాల్లో పైచెప్పిన శిల్పం ఏఏ తావుల్లో ఎలాఎలా విలసిల్లిందన్న ప్రశ్నకల్గినప్పుడు ఆ నాటకంలోని ఆయా సన్నివేశాలు పై శిల్ప లక్షణానికి విధేయాలుగా ఉన్నాయా లేదా అని ముందు చూడాలి. అలా లేనప్పుడితరమైన మెఱుగులెన్నున్నా వ్యర్థమే. ముఖ్యంగా సన్నివేశవిషయంలో—వాని కల్పన, నిర్వహణలలో పై శిల్పలక్షణాలు దోబూచు లాడుతుంటాయి. అందుకే విశేషించి సన్నివేశగతమైన శిల్పాన్ని ఎత్తిచూపడం కొంతకష్టమైన పని.

కన్యాశుల్క నాటక ప్రారంభంలో—ఒకటవ స్థలంలో గిరీశం ప్రవేశించినప్పట్నించి వెంకటేశం ప్రవేశించాకాగల గిరీశం స్వగతమే మొదటి సన్నివేశం... ఇదే ప్రేక్షకుల్ని కొంతవశంలోకి క్రమంగా తీసుకరావాల్సినది. ఇది పేలవంగా ఉంటే ప్రథమకబళేమక్షికాపాతః అన్నట్టు తయారవుతుందా ప్రదర్శం... కనక విసుగెత్తనియ్యని తక్కువ సంభాషణ ఉండాలి. ఉన్నకొంచమూ చాలా ముఖ్యమైందిగా ఉండాలి. అందులోనే ఆ పాత్రలక్షణం కొంత సూచనగా ఉండాలి సందర్భవశంగా కొంత వినోదం గాని-రసానుగుణ విభావకల్పనగాని ఉండాలి. అప్పుడే అది పటిష్ఠమయ్యేది. అందుకే ఇక్కడ 'గిరీశం'—అసలు లెక్చర్లివ్వడం తన ప్రియవస్తువైనా—మిగిలిన స్థలాల్లో లోపల కొన్ని పేజీల తరబడి లెక్చర్లు దంచినా—ప్రారంభంలో మాత్రం ముచ్చటగా తన పరిస్థితేదో పూర్వాపరాలు రెండుమాటల్లో—అంటే పదిపంక్తుల్లో మాత్రం చెప్పుకని "శీఘ్రంగా యిక్కణ్ణించి బిచాణా యెత్తివెయ్యడమే బుద్ధికి లక్షణం" అని ఓ నిర్ణయానికి వచ్చేస్తాడు. అంతలోనే ప్రేక్షకుల్ని పట్టి ఉంచేమాటగా— "గాని మధురవాణిని వదలడ మంటే యేమీ మనస్కరించకుండా ఉంది." అని వెంటనే ఒక బ్రహ్మాస్త్రం ప్రయోగిస్తాడు. పూటకూళ్లమ్మ- మధురవాణిలతో గిరీశానిగ్గల సంబంధాన్ని సమన్వయించుకోవడంలో ప్రేక్షకుల దృష్టి లగ్నమై ఉత్సాహం క్రమంగా పెరుగుతుంది. "ఎవరా వస్తున్నది? నా ప్రియశిష్యుడు వెంకటేశ్వర్లులా ఉన్నాడు." అనడంతో రెండో సన్నివేశంతో మొదటి సన్నివేశానికి సమన్వయ మేర్పడుతూందన్నమాట! "వీడి వైఖరి చూస్తే పరీక్ష ఫేలయినట్టు కనబడుతుంది. వీణ్ణి కొంచెం వోదార్చి వీడికి సెలవుల్లో చదువు చెప్పే మిషమీద వీడితో వూరికి పుడాయిస్తే చాలా చిక్కులు వొదుల్తాయి." అనడంతో ఆ సమన్వయం బలపడి పరిణతి నందింది. ప్రేక్షకుల్లో ఆ వచ్చే పాత్ర వివరాలు జరగబోయే సూచనలు లీలగా పొడగట్టి ఉత్కంఠ పెరుగుతుంది. ఇలా ఈ కన్యాశుల్క నాటకంలోని ప్రథమ సన్నివేశం లక్షణబద్ధమైంది. పైన పేర్కొన్న ఉదాహరణల్లోనే మన ముద్దేశించిన శిల్పంకూడా యిమిడిఉంది. "శీఘ్రంగా యిక్కణ్ణించి ...మనస్కరించకుండా వున్నది." అనడంలో ప్రేక్షకులు బుద్ధికి కల్పించాల్సిన పని అంతగా ఉండదు. ఇక్కడ వ్యంగ్య మర్యాద పాటి-చనక్కర లేదు. సరళంగాను—స్పష్టంగాను చెప్తేనేగాని ప్రేక్షకులు వారి వాస్తవలోకాన్ని వదలరు. క్రమంగా వారిని ఊహాలోకంలోకి తీసికెళ్లాల్సిన బాధ్యత పాత్రలో అంతర్గతుడైన నటునిమీద ఉంటుంది. దానికి కొంతసామగ్రిని సంపాదించి పెట్టేది రచయిత. వీరి లక్ష్యం ఎంత త్వరగా సిద్ధిస్తే నాటక విజయం అంత ఉన్నతంగాను—ప్రకృష్టంగాను లభిస్తుందన్నమాట! అందుకని ఆ మాటలనంత సరళంగాను—స్పష్టంగాను—హృదయాహ్లాదకరంగాను తీర్చాల్సి వచ్చింది. మొదటి సన్నివేశంలోనే బహుపాత్ర ప్రవేశం జరిగితే ప్రేక్షకులికి ఏకాగ్రత కొంత సడలుతుంది. వారందరి వివరాలు—సంభాషణలు—చర్యలు గమనించి—తెలిసికోవడానికి పడే శ్రమలో ఏకాగ్రత కొంత శిథిలం కావచ్చు. ఈ రహస్యం తెలిసిన గురజాడ

వారు నాటక ప్రారంభంలో ఒకే ఒక పాత్రని ప్రవేశపెట్టారు. అతనిచేతే యితరమైన క్లిష్టచర్యల్ని చేయించక నాలుగు పొడి మాటల్ని పలికించారు. అలా ఈ సన్నివేశంలోని సంభాషణ శిల్ప సమ్మతంగా ఉంది. సామూహికంగా యీ సన్నివేశంకూడా సుబోధంగా నే ఉంది కాని క్లిష్టంగా ఏమీ లేదు. గిరీశమీసంభాషణ నొక విధమైన శిష్టోచ్చారణతో నిర్వహించడంవల్ల ఈ సన్నివేశ మంతాకూడా రమ్యంగా ఉంటుంది. ఇలాగే అన్ని సన్నివేశాల్లోనూ పై శిల్ప ధర్మాన్ని సమన్వయించుకోవచ్చు.

సన్నివేశానికి స్వతంత్రంగాను—ప్రత్యేకంగాను నాయకు లుంటారు. ఇది ఆధునిక నాటక పద్ధతి. సన్నివేశ ప్రయోజనం ఏ పాత్రకి చెందితే ఆ సన్నివేశానికి ఆ పాత్ర నాయకత్వాన్ని వహిస్తుందన్నమాట. ఆ సన్నివేశంలో యితర పాత్రలన్నీ యీ నాయకపాత్ర నాశ్రయించుకునే ఉంటాయి. అలాచూస్తే యీ తొలి సన్నివేశంలో గిరీశమే నాయకుడు. అతడొక్కడే పాత్రకూడాను. రెండో సన్నివేశానికి వెంకటేశం నాయకుడు. ఇలాగే మూడో సన్నివేశానికి ఫోటోగ్రాఫ్ పంతులి బంట్రోతు నాయకుడు. ఇలాగే అంతటాను నాటకం మొత్తంమీద గల నాయకునికి దీనికి ఏమీ సంబంధంలేదు. రెండూ విభిన్నాలు. సాధారణంగా పాత్ర ప్రవేశ నిష్క్రమణలతో ఈ సన్నివేశాలు మారుతుంటాయి. ఇలాంటి సన్నివేశాలీ నాటకంలో దాదాపు తొంభైఅయిదు దాకా ఉన్నాయి. వాని అన్నింటిలోను ఈ లక్షణాల్నిలాగే సమన్వయించుకోవడం. ఈ సన్నివేశాలన్నీ కూడా గురజాడవారి చేతులో సానదీరినవి. వేనికవే స్వయంసమగ్రాలు—సమర్థ ప్రయోజకాలు—సరసహృదయాహ్లాదజనకాలూను.

రెండో విషయం సంభాషణ పాటవం. రచయిత ఉక్తిచమత్కృతిని బయటపెట్టే సాధనమిది. ఆయా పాత్రలు సాధ్యమైనంతవరకు మితభాషులు కావాలి. వ్యస్తంగా ప్రతి పాత్రతోను రచయిత ఐక్యాన్ని పొందాలి. అప్పుడే సంభాషణలు పటువుగా నడుస్తాయి. అనవసరమైన మాట ఒకటి కూడా దొరలకూడదు. ఆయా పాత్రల శీలాల కుచితమైన శైలీ—భాషా—సంస్కారమూ సక్రమంగా నిర్వహింపబడాలి. అప్పుడే శిల్పం సంభాషణల్లో అప్రయత్నంగా సిద్ధిస్తుంది.

మధురవాణికి పార్టింగ్ విజిట్ యివ్వడానికి గిరీశం మధురవాణి యింటికి వస్తాడు. అప్పటిదాకా గిరీశాన్ని తిట్టి అక్కసు వెళ్ళబోసుకుంటూ తన గొప్పతనాన్ని చూపించుకుంటూన్న రామప్పంతులికి భయంచేత కాళ్ళు వణికి మంచం కింద దూరతాడు. గిరీశం కిరస్తానీవాడనీ— వాణ్ణి పూటకూళ్ళమ్మే వుంచుకుందనీ యింతవరకూ ధైర్యంగా రామప్పంతులు మధురవాణితో చెప్పేడు. ఇప్పుడు గిరీశాన్ని మధురవాణి ఆ సంగతులే దెప్పుతుంది. ఈ సంగతి అంతుబట్టక గిరీశం "యవడీమాటలు పేలుతున్నాడో వాడి పేరు తక్షణం చెబుతావా చెప్పవా" అని అంటాడు. "రామ" అంటుంది మధురవాణి. వెంటనే మంచంకిందున్న రామప్పంతులికి గుండెలో రాయిపడుతుంది. 'సచ్చాన్రా, పేరు చెప్పేసింది' అనుకుంటాడు. 'రామ' అన్న ఒక్కమాట ఇటు రామప్పంతులికి భయాన్నీ—అటు గిరీశానికి సంభ్రమాన్నీ— మధురవాణికి వినోదాన్నీ కలిగించింది. మధురవాణి వెంటనే సర్దుకుని "రామ! రామ! ఒహరు చెప్పేదేవిటి— లోకవంతా కోడై కూస్తుంటేనూ" అంటుంది. దాంతో రామప్పంతులికి గిరీశానికి కూడా ప్రాణం కొంత కుదుటన పడిందన్నమాట. "రామప్పంతుల"న్న పేరువల్ల యింత నాటకీయ ప్రయోజనం సమకూరింది సంభాషణలో శిల్పం అంటే యిదే. దాని మూడు లక్షణాలు పైన చెప్పినట్టు సమన్వయమయ్యాయి. ఇలాంటి ఉక్తి చమత్కృతులీ నాటకం నిండా కోకొల్లలు. పంచమాంకంలో పూజారి గవరయ్య భూతవైద్యం చేసే సన్నివేశంలో గవరయ్య సీసాల్లో దెయ్యాల్ని పెట్టానన్న సందర్భంలో మీనాక్షి 'మనిషి సీసాలోకి యలా వచ్చింది?' అంటుంది. తన సవతితల్లిని దృష్టిలో ఉంచుకుని. దానికి పూజారి గవరయ్య— "అయ్యో సత్యకాలవా! అది మనిషా అనుకున్నావు? అది కామినీ పిశాచం. అంచేతనే నేను మీ యింటికొచ్చినప్పుడల్లా దూరంగా వెళ్ళిపోయేది. యేమి చెప్మా అనుకునేవాణ్ణి" అంటాడు. వెంటనే మీనాక్షికో సందేహం కలుగుతుంది; 'యిద్దర్నీ ఓసీసాలో పెడితే దెయ్యప్పిల్లల్ని పెడతాయేమో' అంటుంది. తన సవతితల్లి పిశాచాన్నీ దాని చచ్చిపోయిన మొదటి భర్త దెయ్యాన్నీ ఒక సీసాలో పెడితే వాళ్ళిద్దరూ ఒకప్పుడు దంపతులు కనక అలాంటి ప్రమాద ముంటుందేమో అని ఆమె భయం. ఇదీ ఆమె సంస్కారం. ప్రాసంగికంగా పాత్రపోషణ— హేళనలీసంభాషణ వల్ల సాధింపబడ్డప్పటికీ ఒక విధమైన హాస్యాన్ని-తత్కారణంగా వినోదానికూడా ప్రసాదించడమే రచయిత లక్ష్యమిక్కడ. ఆ ఒక్కమాటలోనూ శిల్పమిలా భాసిస్తుంది.

షష్ఠాంకంలో కంటకశాస్త్రి శిష్యుణ్ణి మధురవాణి వద్ద తాకట్టుంచి కంటె తీసుకువెళ్ళే సందర్భంలో మధురవాణి 'తాకట్టు వస్తువ తప్పించుకు పారిపోతేనో? కుక్కా, నక్కా, కాదుగదా

గొలుసులువేసి కట్టడానికి?' అంటుంది. కరటకశాస్త్రి "నీ వలల్లో పడ్డ ప్రాణి మరి తప్పించుకు పోవడం యలాగా? వాటికి వున్న పటుత్వం యే వుక్కు గొలుసులకూ వుంటదు."అంటాడు ఇది సరైన సమాధానం కావడంవల్ల ప్రేక్షకుల్లో ఇప్పటికే కొంత సంతృప్తి కలిగి ముఖంలో వికాసం పొడసూపుతుంది. ఇది చాల దన్నట్టు మధురవాణి వెంటనే "వలలో ముత్యపు చిప్పలు పడితే లాభంగాని—నల్లగుత్తలు పడితే మోతచేటు" అని ఉత్తమశ్రేణి వ్యంగ్యాన్ని పాటిస్తుంది. దాంతో సహృదయునికి పరిపూర్ణమైన తృప్తి కల్గుతుంది. ఇది సుబోధం కాదేమోననే భయం— అపార్థ స్ఫోరకం కావచ్చుననే ఆతురత— పాత్రపోషణ కుంటువడుతుందనే బాధ— ముప్పిరిగొని గురజాడవారు కరటకశాస్త్రిచేత "యంత సేపూ డబ్బు, డబ్బేనా? స్నేహం, వలపూ అనేవి వుంటాయా?" అని వాఖ్యానింపచేస్తారు. అది వారి సంభాషణ రచనలోని శిల్ప నిర్వహణ విన్యాసం.

గిరీశానికి మొదటిసారిగా బుచ్చమ్మ కన్పించినప్పుడు గిరీశం—'వాట్! యీమె నీ సిస్టరా? తలచెడ్డట్టు కనబడుతూందే' అంటాడు వెంకటేశంతో. దానికి సమాధానంగా వెంకటేశం 'మా అక్కే. జుత్తుకిచవుర్లొసుకోదు' అంటాడు. చక్కని శ్లేష సాధింపబడి హాస్యముత్పన్నమైందిక్కడ. వెంటనే ప్రేక్షకుడు కడుపుబ్బేలా నవ్వుతాడు. ఇది తాత్కాలిక ప్రయోజనం కోసమే ఏర్పాటైన హాస్యం. అంటే కేవలం ఉపాంగమన్నమాట. కాని ఆ సంభాషణలోని అసలు ప్రయోజనం బుచ్చమ్మ పాత్రప్రవేశం గిరీశంలో వెంటనే ఎలాంటి మార్పుని తీసుకుని వచ్చిందో చూపడం. ఆమెని చూడగానే గిరీశం పాత్రలక్షణమంతా ఒక్కసారి బయటపడి ఆమె సౌందర్యము—వైధవ్యము—యౌవ్వనము యీ మూడూ అతనిలోని స్త్రీ లౌల్యాన్ని అవకాశదృష్టిని—వంచన తత్వాన్ని ప్రకోపింప చేశాయి. ఇలా అతని పాత్రపోషణనీ సంభాషణవల్ల సాధించడమే గురజాడవారి నాటకీయ లక్ష్యం... కనకనే యీ సంభాషణ అంతరసవత్తరంగా అప్రయత్న సిద్ధమైంది. సనాతనాచారాల పేరుతో మూర్ఖంగా ప్రవరిస్తూ—సాగినంతవరకు ఆచారాలు పాటిస్తూ—సాగని వానిని సడలించుకుంటూ— అయినా తాము యథార్థ సంప్రదాయ పరిపాలకులమని విఱ్ఱవీగుతూన్న ఒక ప్రత్యేకమైన సమాజాన్ని హేళనద్వారా విమర్శించాలనే లక్ష్యాన్ని అవాంతర ప్రయోజనంగా భావించిన గురజాడ వారికీ అగ్నిహోత్రావధాన్లు కుటుంబమొక చక్కని అవకాశమిచ్చి పాత్రావైవిధ్యానికాస్పదమైన సందర్భంలో బుచ్చమ్మ సకేశ అయితేనే వారా విమర్శలో కృతకృత్యులైనట్టు. ఈ హేళనన వారా సంభాషణలో సాధించారు. ఆ విషయాన్నే తృతీయాంకంలో గిరీశం బుచ్చమ్మతో వెధవల అవస్థలు చెబుతూ వెంకటేశంతో 'తుమ్మెద పంక్తుల్లా ఉండే జుత్తు కూడా తీసి వేస్తారు కదా! ఫర్ ఎగ్జాంపిల్—మీ అక్కయ్యకు ఆ చంద్రబింబవంటి ముఖము పైని ఒక కుంకుమ బొట్టుంచే త్రినేత్రుడికైనా చూడ్డానికి అలవి వుండునా?' అంటాడు. దాంట్లోనే విధవల లక్షణము—ఆ లక్షణాలు లేనివారి వికృతి కూడా విమర్శింపబడ్డాయి. ఇంత సొగసైన సంభాషణని తీసికొని 'అగ్నిహోత్రావధాన్లువంటి నైష్ఠికుడు తన వితంతు పుత్రికని సకేశగా ఉంచుతాడా' అని దోషమెన్నే విమర్శకవకాశముంటుందని ఊహించుకునే గురజాడవారు గిరీశం చేత ఈ రెండో సంభాషణ చేయించారు.

చివరి విషయం పాత్రపోషణ. ఆయాపాత్రల రూపురేఖలు— శీలధర్మము—సమగ్రత: ఈ మూడు లక్షణాలు పాటింపబడినప్పుడే ఆ పాత్రపోషణ నిండుతనాన్ని సముపార్జించుకొంటుంది. ఈ మూడూ ప్రత్యక్షంగానో—పరోక్షంగానో నాటకం మొత్తం మీద వ్యక్తం కావాలి. అలా వ్యక్తం చెయ్యడంలో ప్రత్యక్ష పద్ధతి కంటె పరోక్ష పద్ధతికే ఎక్కువ విలువ ఉంటుంది. ఆ పద్ధతిని పాటించడంలో రచయిత తీసికొన్న మెలకువల్ని బట్టి పాత్ర పోషణలోని శిల్పం మెఱుగు తఱుగులాధారపడి ఉంటాయి.

నాటకం మొత్తం మీద గురుజాడ వారే పాత్రకీ రూపురేఖలు కాని—వేషధారణకాని యిదమిత్థమని ఎక్కడా చెప్పలేదు. అవి ఆయా పాత్రల సంభాషణలవల్ల—చర్యలవల్ల—స్వభావాలవల్ల వ్యక్తం కావాలని వారి అభిలాష. దానికే వారు బహుధాయత్నించి పరోక్ష వ్యక్తీకరణ పద్ధతినే పాటించారు.

నాటకానికి ముఖ్యపాత్ర గిరీశంరూపం మనకి కొన్ని సంభాషణలవల్ల తెలుస్తుంది. చతుర్థాంకంలో బుచ్చమ్మతో ఒంటరిగా తనతో లేచి వచ్చేసి పెళ్లాడమని ప్రోత్సహిస్తూ గిరీశం అలా కాకపోతే తాను నిద్రాహారంమాని ఆత్మహత్య చేసుకుంటానంటాడు. అప్పుడు "ఆ అద్దంలో నా ముఖంచూసుకుని యేమంటానూ?' యీ సొగసైన ముఖం—ఈ తామరరేకులవంటి నేత్రాలూ—యీ సోగమీసాలూ యివన్నీ వృథాకదా?" అంటాడు. దీన్నిబట్టి అతని ఆకారం కొంత ఊహించుకోవచ్చు. పంచమాంకంలో లుబ్ధావధాన్లు తనని సుబ్బి మొదట మొగుడు దయ్యమై పీడిస్తున్నాడని హడావుడిచేస్తున్న సందర్భంలో మీనాక్షి' ఆయన ఎలా ఉంటాడునాన్నా' అని అడుగుతుంది. 'గిరీశంగాడి ముమ్మా

ర్తులేనే అంటాడు లుబ్ధావధాన్లు. అయితే యిప్పటికేమీ గిరీశం మూర్తిని గూర్చిన ఆధారమేమీ దొరకలేదు. మరికొంత సంభాషణ గడిచాక సుబ్బిని ఆ విషయంలోని యాథార్థ్యాన్ని కనుక్కొని వచ్చిన మీనాక్షి 'వాడు రోజూ దానికొనబడతాట్టనాన్నా-వాడికి మీసాలూ-గిరజాలూ వున్నాయట-చాపంచాయట.' అంటుంది వెంటనే లుబ్ధావధాన్లు తనకి కన్పించిన రూపంకూడా అలాగే ఉందనిచెప్తూ "వాడేనే! వాడేనే! ఏవిటేసాధనం?" అంటాడు. ఇప్పటికి గిరీశం రూపకల్పనకి కొంత ఆధారం లభించింది. ఇలాగే అగ్నిహోత్రావధాన్లు రూపంకూడా సూచిస్తారు గురజాడ మరోచోట సంభాషణ ద్వారానే. షష్ఠాంకంలో రామప్పంతులు అగ్నిహోత్రావధాన్లుకి వకీలు నాయకుడికి వైషమ్యం కల్పించిన సందర్భంలో నాయుడు "అందులో మన డిప్టీ కలెక్టరుగారికి యింగ్లీషు వకీలంటే కోపం-అందులో బ్రాహ్మడంటే మరీని-ఆమాట ఆఅందరికి బోధ పర్చండి..." అంటాడు... అగ్నిహోత్రుణ్ణి ఉద్దేశించుకుని. ఈ అభిప్రాయాన్నే గురజాడవారు చమత్కారంగా సప్తమాంకంలో వ్యక్తంచేస్తారు. డిప్యూటీకలెక్టరు కచేరీలో వకీలునాయుడు భీమారావు కలిసి అగ్నిహోత్రుణ్ణి, రామప్పంతుల్ని మూర్ఖుల్నిగానూ వంచకుల్నిగనూ నిరూపిస్తారు-ఆ సందర్భంలో కలెక్టరు అగ్నిహోత్రుడితో 'నీ దుర్మార్గత వల్ల నీకుమార్తెను ఈ అవస్థలోకి తెచ్చి మళ్లీ ఆబ్‌జక్షన్ కేసుకూడానా? నీ పొట్ట కరిగించేస్తామండు.' అంటాడు అదీ అగ్నిహోత్రుని రూపం.

ఇక శీలధర్మ పోషణము. ఎప్పుడూ పాత్ర స్వభావ గమనంలో ఒక విధమైన ఐక్యం ఉండాలి. ఒకే పాత్రలో విరుద్ధ స్వభావచిత్రణ ఎంతో బలమైన కారణం-పోషణ ఉంటేనే కాని చెయ్యరాదు. అలా అడుగడుక్కీ అక్రమంగా మారిపోయే పాత్రలో పైచెప్పిన ఐక్యం కుంటువడిందన్నమాట! అవసరం కల్గినప్పుడల్లా ఆ పాత్రలోని ఆ స్వభావం ప్రేక్షకులికి దర్శనమిస్తూండాలి.

అగ్నిహోత్రుడికి మూర్ఖపు కోపం తాపట్టిన కుండేటికి మూడే కాళ్లనే స్వభావం. ఎంతసేపూ కోర్టు బాల్య వివాహాలూ అనో-వైదిక కర్మకాండా మనువర్తిరొఖ్ఖం అనోవాదిస్తాడు కాని ఒక పరిష్కారానికి లొంగిరాడు. కోపోద్రేకంలో లుబ్ధావధాన్లుని కొట్టివచ్చి పైగా "అన్నగారూ! క్రిమినల్ కేసు తేవడాని కనకాశ ముంటుందా" అని అడుగుతాడు రామప్పంతుల్ని. ఆకేసులో బాగా ఊబిలో దిగిపోయి అతడు-సౌజన్యారావు పిలిస్తే-ఆయనింటికి సలహా చెయ్యడానికి వస్తాడు. సౌజన్యారావు పంతులు అగ్నిహోత్రుణ్ణి మెల్లిగా విధవావివాహానికీ-బాల్య వివాహనిర్మూలనకి ఒప్పించాలని ప్రయత్నిస్తాడు. అగ్నిహోత్రావధాన్లు యిదంతా వ్యవహారం కాబోలని కొంతవరకు వింటాడు శాంతంగా... ఇక సౌజన్యారావు "కానిండి కాని-మీ రెండోపిల్లకి తగిన వరుణ్ణి చూసి పెళ్లిచెయ్యండి-యేం సుఖపడుతుందని ముసలివాళ్లకి యివ్వడం? శల వియ్యండీ!" అంటాడు. దాంతో అగ్నిహోత్రుని ప్రకృతి బయట పడుతుంది. ఇప్పటికి గ్రహించాడు కాబోలు-వెంటనే- "అదంతా మీకెందుకయ్యా? ఓహో యిందుకా నన్నుపిలిపించారు? మీ గృహకృత్యాల వూసుకినేవచ్చానా ఏవిటి? నా గృహకృత్యాల వూసు మీకెందుకూ?" అంటాడు నిర్మొహమాటంగా. రచయిత యెంతో మెలకువ గలవాడైతేనే కాని యిలాంటి సూక్ష్మమైన రహస్యాన్ని గుర్తించి పాటించలేడు. ఈ సందర్భంలో కనక అగ్నిహోత్రావధాన్లు నోరుమూసుకుని-బుజ్జుఊపి ఊరుకున్నాడంటే "అగ్నిహోత్రావధాన్లు" వ్యక్తిత్వం దెబ్బతిని-మొదట్నించీ ఆ పాత్రని తీర్చుకొనివచ్చిన సొగసంతా నాశనమై పాత్రపోషణ భ్రష్టమౌతుంది. అందుకే రచయిత ప్రతి చిన్న విషయంలోనూ ఎంతో జాగ్రత్తపడాలి

ఇలాగే కరటకశాస్త్రి శీల మెలాటిదో షష్ఠాంకందాకా వెడితేనే కాని స్పష్టపడదు. శిష్యుణ్ణి మధురవాణి దగ్గిర తాకట్టుగా విడిచి తాను కంటె తీసుకుని నిష్క్రమించేటప్పుడు ఒక సంభాషణలో కరటకశాస్త్రి "నాబోటి అల్పప్రజ్ఞ కలవాళ్ళు -లభ్యం కానప్పుడల్లా యాంటినాచే" అంటాడు. దానికి సమాధానంగా మధురవాణి "మీ యోగ్యత చెప్పేదేమిటి" అంటుంది. మరికొంత సంభాషణ గడిచాక "కరటకశాస్త్రి: — నీ స్నేహం చెప్పేదేమిటి! గాని నీ యౌవ్వనం, నీ శృంగారం దేవతా స్త్రీలకువలె శాశ్వతంగా ఉంటాయి. మధు:— మా తల్లి ధర్మవా( అని ఆమె నా చెవిలో గూడుకట్టుకుని బుద్ధులు చెప్పబట్టికాని, లేకుంటే మీలాంటి విద్వాంసుల యిచ్చకాలికి మైమరచి, యీపాటికి వూళ్ళో సానులవలె చెడి వుండనా?..." అని సాగుతుంది. చివరికి కరటకశాస్త్రి "అతి జరూరు పనివుంది. మధురవాణీ మరొకమాటు వస్తాను. (నిష్క్రమిస్తూ) తలవాయగొట్టింది-తెల్లవెంట్రుకలు లాపయినా-మనసు కొంచెం మళ్ళించుకుందాం." అంటాడు. ఇదీ అతని శీలం. ఈతని యీ తత్త్వం ఇంతవరకు తెలియకపోవడంచేత- కరటకశాస్త్రి కేవలం తన మేనగోడలికి ముసలివానితో పెళ్ళి తప్పించడానికే నిస్స్వార్థమైన దృష్టితో ఇన్ని బాధలు పడుతున్నాడనే సానుభూతి కరటకశాస్త్రి మీద క్రమంగా పెరిగి దృఢమైపోతుంది. అది

యిక్కడ చెప్పడంవల్ల ఆ సానుభూతి నశించిపోయే అవకాశమూ లేదు. ఎందుకంటే ఒక మంచి పని చెయ్యడంవల్ల ఒక పాత్రమీద యేర్పడ్డ దృఢమైన సదభిప్రాయం దానికి విరుద్ధంగానూ అపకారం చెయ్యని ఒక సూక్ష్మమైన బలహీనతవల్ల ఎంతమాత్రం సడలదు. ఇది సాధారణంగా మన స్తత్త్వ లక్షణం. అయితే యీ బలహీనత మొదటనే బయటపెడితే ఆ పాత్రమీద ఎప్పటికీ యింక సానుభూతి కలగదు. ఎంచేతంటే అప్పటికే ఆ బలహీనత సహృదయ ఫలకంమీద ఒక మలినాభిప్రాయన్నేర్పరుస్తుందికనక ఈ మర్మాన్ని ఎరిగిన గురజాడవారు ఇంతవరకు ఆ బలహీనతని బయటపెట్టకుండా జాగ్రత్తపడి—ఎవరూ గమనించడానికి అంతగా అవకాశంలేని ఓ సాధారణ స్థలంలో చాలా సామాన్యంగా ఈ మాటని అనిపించి— ఆ ప్రసంగాన్ని అంతతో ముగించేసి స్థలం- రంగం మార్చేశారు. అయితే అంత అనవసరమైన విషయాన్నెందుకు ప్రస్తావించాలి అనే ప్రశ్న కలగవచ్చు. అసలు ప్రస్తావించకపోతే అది పరిహరణ దోషం క్రిందికి వస్తుంది. పాత్ర చిత్రణ అసమగ్రమౌతుంది. అదీగాక యింత శిష్టు అసలు వేశ్య యింటికి వెడతాడా? అది పాత్ర ఉదాత్తతకి భంగంకాదా? అనే కుశ్శంకలనేకం కలుగవచ్చు...

సౌజన్యారావు పాత్రనికూడా ఎంత ఉదాత్తంగానూ— ఆదర్శప్రాయంగానూ చిత్రించి— అతని శీలాన్నింకా ఉదాత్త పదంలోకి తీసుకువెళ్ళడానికా అన్నట్టు మధురవాణితో సుదీర్ఘమైన—సహేతుకమైన చర్చ ఏర్పరచారు. ఒక సమయంలో మధురవాణితో— "అట్టేసేపు నువ్వు నా ఎదటగానీ నిలిచిఉంటే— నువ్వు ఏ తగువు తీరిస్తే ఆతగువుకు వొప్పదల అవుతానేమో అని భయం వేస్తూంది "అంటాడు. దానితో మధురవాణి పూర్తిరూపం మనస్సుకి హత్తిపోతుంది. మధురవాణి ప్రతిమని మనస్సుకి అలా హత్తింపజేయడమే గురజాడవారిందులో సాధించ దల్చుకున్న ముఖ్య ప్రయోజనం. రెండోది సౌజన్యారావు నిగ్రహాన్ని- పరోపకార తత్త్వాన్ని బయటపెట్టడం. అయితే ఆ నిగ్రహం వీగిపోతే ఈ రెండు పాత్రలూ నాశనమైనాయన్నమాటే. అందుకనే గత్యంతరం లేక అయిష్టంగా—ఎంతో బాధగా సౌజన్యారావు మధురవాణిని ముద్దుపెట్టుకోడానికి ఒడబడ్డప్పుడు "చెడని వారిని చెడకొట్ట వద్దని మా తల్లి చెప్పింది" అని మధురవాణిచేత తిరస్కరింప చేశారు రచయిత. దానితో రెండు పాత్రలూ రక్షింపబడ్డాయి. ఇందులో మనం చూడాల్సింది సౌజన్యారావు పరోపకార తృష్ణ- ఆదర్శ సంరక్షణ తత్పరత మాత్రమే. ఈ రెంటిలోనూ పరోపకారం దగ్గిరికి వచ్చేసరికి స్వార్థపరమైన ఆదర్శంకూడా ద్వితీయస్థానాన్నే పొందాలనీను. గిరీశం పాత్రలో ప్రేక్షకులికేమీ కష్టం లేకుండానే ఎక్కడికక్కడ స్పష్టమౌతూనే ఉంటుంది. అతని నిర్లక్ష్య తత్త్వాన్ని పరిపోషించడానికేనా అన్నట్టు చివరగా గిరీశంచేత "డామిట్— కథ అడ్డం తిరిగింది" అనిపిస్తారు.

ప్రతి పాత్రకీ ఏదో ఒక ముఖ్యమైన ప్రయోజనం చూపించి దానికి సరైన గమ్యాన్ని నిర్దేశించాల్సిన బాధ్యత రచయితమీద ఉంటుంది. అదే సమగ్రత. స్త్రీలోలుడుగాను, ప్రయోజనరహితుడుగాను బయలుదేరిన గిరీశం కాలేజీలో ప్రవేశించి పై పరీక్షలికి చదువుకోవాల్సి వచ్చింది. అలా అతనిలో కొంత మార్పు- అవకాశం కల్గించిన అనేక సన్నివేశాలికి అతడే నాయకుడై యీ నాటకానికి సూత్రప్రాయమౌతాడు. అలాగే అగ్నిహోత్రావధాన్లు— లుబ్ధావధాన్లు - రామప్పంతులు - కరటక శాస్త్రి పశ్చాత్తప్తులు కావాల్సిన స్థితి కల్పించబడింది. బుచ్చమ్మని విడోజ్‌హోమ్‌కి పంపే అవకాశం కల్గింది. మధురవాణి సౌజన్యారావులు తమ ఉదాత్తతని నిలబెట్టుకున్నారు, ఈ పాత్రలన్నీ కన్యాశుల్కనాటకం లక్ష్యసాధనకి తీసుకోబడ్డ వివిధ పరికరాలుగా సార్థకమైనాయి. ఇందులోని ఏ పాత్రకూడా వ్యర్థంకాదు. ఇదీ పాత్రపోషణ విషయకమైన గురజాడవారి శిల్ప నిర్మాణం.

ఇవికాక సంఘసంస్కారమనే సామూహిక నాటక ప్రయోజన మొకటి ఆదినుంచీ అంతంవరకూ కనుపించీ కనుపించకుండా నిర్వహింపబడుతూనే వచ్చింది. సనాతనాచారాల సాకుతో బాహ్య పారిశుద్ధ్యమాత్రధర్మతత్పరతతో ఆడంబరాలతో. ఎన్నిసంఘాలు ఎలా వంచనకి అవకాశాలిస్తున్నాయో— ఎలా పతనమై నైతికమైన విలువల్ని నిలుపుకోలేక పోతున్నాయో యెత్తి చూపాల్సిన పని యీయనది. అందుకే కొన్నికొన్ని తావుల్లో గిరీశం పాత్రద్వారా ప్రత్యక్షంగానూ - అగ్నిహోత్రావధాన్లూ - లుబ్ధావధాన్లూ- రామప్పంతుళ్ళ ద్వారా పరోక్షంగానూ విమర్శించి ఆయా ధర్మాల్ని దర్పణంలోలా ప్రతిబింబింపజేశారు.

ఆయన కన్యాశుల్కం నేటిదాకా యింకా చెక్కుచెదరకుండా నిలిచి ఉందంటే దానిక్కారణం ఆయన యిన్ని విధాలుగా మెలకువలు పాటించి దాన్ని చిత్రించడమే. ఇలాంటి శిల్పరచనాకౌశలం అలాంటి కళా నిర్వహణ ప్రజ్ఞ గలవారికే అబ్బుతుంది. ఈ ధర్మం ఆయన కన్యాశుల్కంలో వెదకిన చోటల్లా కనపడుతుంది. ఎత్తి చూపించాలంటే స్థలం-సమయం బాగా ఔదర్యాన్ని వహించాల్సి వస్తుంది అలా సంప్రాప్తింప చేసుకోవడం సహృదయ జిజ్ఞాసువులకే సాధ్యం.

* * *

# ప్రభుత్వ నిర్ణయాలు

• పరిపాలనా సంస్కరణల సంఘం సమర్పించిన నివేదికను రాష్ట్రప్రభుత్వం పరిశీలించి, ఈ సంఘం చేసిన 91 సిఫార్సుల లోను దాదాపు సగం సిఫార్సులను ఆమోదించ టానికి నిశ్చయించింది.

ప్రభుత్వం ఆమోదించిన సిఫార్సులలో ముఖ్యమైనవి ఇవి:

ఉద్యోగుల ప్రొబేషన్ గడువు రాష్ట్రమంతటా, నేరుగా రిక్రూట్ చేయబడన వారి విషయంలో అయితే మూడు సంవత్స రాల కాలంలో రెండు సంవత్సరాల పాటు, ప్రమోట్ చెయ్యబడిన వారి విషయంలో అయితే రెండేళ్లలో ఒక యేడాది వుండాలి.

నాలుగు సంవత్సరాల నుంచి లేదా అంతకంటే ఎక్కువ కాలం నుంచి వున్న తాత్కాలిక ఉద్యోగాలలో కనీసం సగం ఉద్యో గాలను అవసరమైతే అంతకంటే ఎక్కువ ఉద్యోగాలను ఖాయం చెయ్యాలి.

ప్రభుత్వోద్యోగులందరికీ వారి సర్వీసులను రెగ్యులరైజ్ చేసినా చేయకపోయినా వారినియామకపు తేదీనుంచి ఏటేటా ఇంక్రిమెంట్లు ఇవ్వాలి.

పనిలో విశేష ప్రతిభా సామర్థ్యాలు చూపిన సాంకేతికో ద్యోగులకు అడ్వాన్సు ఇంక్రిమెంట్లు ఇవ్వటం ద్వారా ప్రత్యేక ప్రోత్సాహాన్నివ్వాలి.

ప్రతి ప్రభుత్వాధికారి విషయంలోను రిటైర్ అయ్యే సమయంలో, రిటైర్ కావటానికి పూర్వం మూడు సంవత్సరాల కాలం లో అతడు పొందిన సగటు జీతం ప్రాతిపదికపై అంటిసిపేటరీ పెన్షను మొత్తాన్ని లెక్కకట్టాలి. అతని రికార్డుల పూర్తి పరిశీలన జరిగేలోగా, పైవిధంగా లెక్కవేసిన మొత్తంలో ముప్పాతిక భాగాన్ని అంటిసిపేటరీ పెన్షనుగా చెల్లించాలి,

ఉద్యోగాలలో వున్నవారందరికీ నాలుగు నెలల వరకు సెలవు కూడబెట్టు కోటానికి అనుమతి ఇవ్వాలి.

సచివాలయం మినహా మిగతా అన్ని కార్యాలయాలలోను గుమాస్తాల రిక్రూట్మెంటుకు సంబంధించిన విధులను రాష్ట్ర పబ్లిక్ సర్వీసు కమిషన్ నుంచి తప్పించాలి. ఆ బాధ్యతను వికేంద్రీకరించి, జిల్లా స్థాయిలో అందుకొరకు ఏర్పాటు చేయబడిన కమిటీలకు అప్పగించాలి.

జిల్లా కార్యాలయాలలో ప్రత్యేకించి తెలంగాణాలోని రెవిన్యూ కార్యాలయాలలో సిబ్బందిని పెంచాలి.

వివిధ శాఖాధి పతులు ప్రతిసంవత్సరం ప్రాంతీయ కార్యా లయాలు, జిల్లా కార్యాలయాలన్నింటినీ తనిఖీచేయాలి.

ప్రభుత్వ కార్యాలయాలకు వాడకానికై ఫ్రాంకింగ్ మెషిన్లు, డుప్లికేటర్లు, టెలిఫోన్లు మొదలైన అధునిక పరికరాలను విరివిగా సరఫరా చెయ్యాలి.

సమాచారం కొరకు వచ్చేవారికి తగు సమాచారం ఇవ్వ టానికై సచివాలయంలో సూపరింటెండెంటు ఆధ్వర్యం క్రింద ఒక కేంద్ర రెసెప్షన్ ఆఫీసును నెలకొల్పాలనీ, ప్రతి కార్యాలయం లోను వెయిటింగ్ రూమ్ వుండాలనే సిఫార్సులను కూడా ప్రభుత్వం అంగీక రించింది,

ప్రతి కార్యాలయం లోనూ ఒక పార్ట్‌టైమ్ సంక్షేమాధి కారిని నియమిస్తారు. సచివాలయం సిబ్బంది సంక్షేమాధికారి కూడా అయిన సాధారణ పరిపాలన శాఖ ఉపకార్యదర్శి శ్రీ భరత్ చంద్ ఖన్నా ద్వారా వారి కార్యకలాపాలను సమన్వయ పరచటం జరుగుతుంది.

* భారత ప్రభుత్వం వారు ఈ ప్రాంతంలో స్థాపించనున్న జియో ఫిజికల్ ఇనిస్టిట్యూట్ కొరకు భవనాలు నిర్మించే నిమిత్తం ఉస్మానియా విశ్వవిద్యాలయం సమీపంలో కానీ లేదా దానికి పైన కాని సుమారు 150 ఎకరాల స్థలాన్ని సేకరించటానికి రాష్ట్ర ప్రభుత్వం తీర్మానించింది.

* రాయలసీమకు ప్రత్యేకంగా ఒక అభివృద్ధి మండలిని స్థాపించ వలసిన ఆవశ్యకత లేదని రాష్ట్రప్రభుత్వం నిశ్చయించింది.

* విశాఖపట్నం నగరానికై పట్టణ ప్లానింగ్ ట్రస్టును ఏర్పాటు చేయటానికి రాష్ట్ర ప్రభుత్వం నిశ్చయించింది. జిల్లా కలెక్టరు ట్రస్టు అధ్యక్షులుగా వుంటారు. గృహనిర్మాణం, నీటి సరఫరా, రోడ్లను వెడల్పు చేయటం, పౌరులకు సౌకర్యాలు కలుగ జేయటానికి ఉద్దేశించిన ఇతర పనులను ఈ ట్రస్టు నిర్వహిస్తుంది. మునిసిపాలిటీల చట్టనిబంధనల క్రింద ఇది స్థాపించ బడుతుంది. ప్రారంభంలో దీనికి రూ. 5 లక్షల గ్రాంటు లంభింప జేయ బడుతుంది.

కొత్త కంట్రాక్టులు ఇచ్చేప్పుడు సరిహద్దు ప్రాంతాలలో మూడు మైళ్ళకు బదులుగా 10 మైళ్ల వరకు మద్యపాన నిషేధాన్ని అమలు పరచ టానికిగల అవకాశాలను పరిశీలించ టానికి ప్రభుత్వం నిశ్చయించింది. ఈలోగా, సరిహద్దు ప్రాంతాలలో మూడు మైళ్లవరకు మద్యం వాడకం పైగల నిషేధాన్ని కట్టుదిట్టంగా అమలుపరచడం జరుగుతుంది. నివాస స్థలాలకు సమీపం లోనున్న దేశీ సారాయి దుకాణాలను సాధ్యమైనంత వరకు త్వరలోనే పట్టణాలు. గ్రామాల పొలిమేరల లోనికి తరలించటం జరుగుతుంది. లేదా కొత్త కంట్రాక్టులలో. ఈ విషయం ఒక షరతుగా చేర్చబడుతుంది.



మొండమోపె వట్టి మొప్పెరా అని తిట్టి
తిరిగి అతనిదేబె దేవురించు
కక్కు కతుకు బ్రతుకు కుక్కకే చెల్లురా?
జననుతాంతరంగ! వినుర! రంగ!

— "కృష్ణశతకము"

# ప్రగతి పథంలో

( జిల్లాల నుంచి అందిన వివిధ అభివృద్ధి కార్యక్రమాలను గురించిన సంక్షిప్త వార్తలు )

## ఆదిలాబాదు

### కమ్యూనిటీహాలు నిర్మాణం

ఉట్నూరులో రూ. 5,000 ల వ్యయంతో నిర్మించిన కమ్యూనిటీహాలుకు నవంబరు 27 వ తేదీన ప్రారంభోత్సవం జరిగింది.

## అనంతపురం

### చిత్రావతి నదికి అనకట్ట

చిత్రావతి నదికి అడ్డంగా నిర్మించ దలిచిన ఆనకట్టకు రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ డి. సంజీవయ్య అక్టోబరు 23 వ తేదీన శంకుస్థాపన చేశారు.

### హరిజన దినోత్సవం

అనంతపురంకు 15 మైళ్ళదూరంలో వున్న ఆత్మకూరులో నవంబరు 30 వ తేదీన హరిజన దినోత్సవం జరిగింది. జిల్లా కలెక్టరు ఉత్సవానికి అధ్యక్షత వహించారు. అస్పృశ్యతను రూపు మాపటంలో ప్రభుత్వంతో సహకరించవలసిందిగా ఈ సందర్భంలో కలెక్టరు ప్రజలకు విజ్ఞప్తి చేశారు.

## కడప

### పులివెందల ఆనకట్ట పథకం

పులివెందల ఆనకట్ట పథకానికి ముఖ్యమంత్రి శ్రీ డి. సంజీవయ్య నవంబరు 23 తేదీన పునాదిరాయి వేశారు.

### తొగురుపేట ప్రాజెక్టు

రాజంపేట తాలూకాలో తొగురుపేట ప్రాజెక్టు పథకానికి నవంబరు 23 వ తేదీన పబ్లిక్ వర్క్సు శాఖామంత్రి శ్రీ ఎ. సత్యనారాయణరాజు శంకుస్థాపన చేశారు.

## తూర్పు గోదావరి

### శిక్షణ శిబిరం

కరప పంచాయతీసమితి వారు పెద్దపురప్పాడులో నవంబరు 13 వ తేదీనుంచి 15 వ తేదీవరకు మహిళల శిక్షణ శిబిరాన్ని నిర్వహించారు.

### ఉచిత మధ్యాహ్నభోజనం

అన్నవరం ఓరియంటల్ హైస్కూలు నిర్వాహకులు, 50 మంది విద్యార్థులకు ఉచితంగా మధ్యాహ్నభోజనం సరఫరాచేసే కార్యక్రమాన్ని 1961 నవంబరులో ప్రారంభించారు.

## గుంటూరు

### కీలక గ్రామకేంద్రం ప్రారంభం

ఒంగోలు తాలూకా అల్లూరులో నవంబరు 20 వ తేదీన కీలక గ్రామ కేంద్రానికి ప్రారంభోత్సవం జరిగింది.

### రైతుల విజ్ఞానయాత్ర

బాపట్ల పంచాయతీ సమితి గత నవంబరులో రైతుల విజ్ఞానయాత్రను ఏర్పాటు చేసింది. 40 మందిరైతులు యాత్రలో

పాల్గొన్నారు. నాగార్జునసాగర్, హైద్రాబాద్, రాజేంద్రనగర్, అజంతా, ఎల్లోరాగుహలు, కొండపల్లిలోని కుటీరపరిశ్రమల కేంద్రం మొదలైనవాటిని వీరు సందర్శించారు. ఈ యాత్ర 10 రోజులపాటు జరిగింది.

### చిన్న మొత్తాల పొదుపు ఉద్యమం

నర్సారావుపేట బ్లాకు లింగంగుంట గ్రామంలో బహుమతి పత్రాల అమ్మకానికై నవంబరు 11 వ తేదీన ప్రత్యేక ఉద్యమాన్ని ప్రారంభించారు.

### పెనుమాకలో రవీంద్ర థియేటరు

పెనుమాకలో నవంబరు 10 వ తేదీన ఆరుబయలు రంగస్థలానికి ప్రారంభోత్సవం జరిగింది. దీనికి టాగూరు పేరు పెట్టారు. పరిషత్తు ఉన్నత పాఠశాలలో నిర్మించబడిన ఈ నాట్యకళామందిరానికి రు. 6,000 లు ఖర్చయింది. ఈ మొత్తాన్ని శ్రీయుతులు కె. వి. సుబ్బయ్య, కె. కోటిరెడ్డి విరాళంగా ఇచ్చారు.

## హైదరాబాదు

### పశుప్రదర్శనలు

మేడ్చల్ పంచాయతీ సమితి ఆధ్వర్యం క్రింద నవంబరు 25 వ తేదీన పశుప్రదర్శనం జరిగింది.

హయాత్‌నగర్‌లో కూడా పంచాయతీ సమితి బ్లాకు మేలాసందర్భంగా 1961 నవంబరులో పశుప్రదర్శనం జరిగింది.

## కరీంనగరం

### శిక్షణ శిబిరం

కరీంనగరంకు 18 మైళ్ళదూరంలో వున్న కొడపలకలలో 1961 నవంబరులో మూడు రోజులపాటు గ్రామ సహాయకుల శిక్షణశిబిరం జరిగింది.

### మేలాఉత్సవాలు

మెట్పల్లి పంచాయతీ సమితి ఆధ్వర్యం క్రింద నవంబరు 23 వ తేదీన వెంకటాపురంలో మేలా ఉత్సవాలు పెద్ద ఎత్తున జరిగాయి. ఈ సందర్భంలో సమితి ఆకర్షణీయంగా ఒకప్రదర్శనను ఏర్పాటు చేసింది. దీనిని సందర్శించిన వారిలో నూటికి 90 వంతుల మంది స్త్రీలే.

## కృష్ణా

### పరిషత్తుహాలుకు లక్షరూపాయల విరాళం

పరిషత్తుకొంకు సమావేశ మందిరం నిర్మాణం నిమిత్తం జిల్లా పరిషత్తు లక్ష రూపాయలు మంజూరుచేసింది. దీని నిర్మాణానికి రూ. 1,94,000ల వ్యయాన్ని అంచనా వేశారు విజయవాడ స్టేడియం నిధికి తమ కోటాక్రింద రు. 1,116ల మొత్తాన్ని కూడా ఈ సమావేశంలో మంజూరు చేశారు

### యానాది స్త్రీలకొరకు బుట్టల అల్లికం కేంద్రం

నూజివీడులోని యానాది కాలనీలో 1961 నవంబరు నెలలో యానాది స్త్రీలకొరకు శిక్షణ-ఉత్పత్తి కేంద్రాన్ని తెరిచారు. ఈ కేంద్రంలో స్త్రీలకు బుట్టల అల్లికంలో మూడు నెలలపాటు శిక్షణ ఇస్తారు.

## కర్నూలు

### రెండు ప్రాజెక్టులకు శంకుస్థాపన

వరదరాజ స్వామి, గాజులదిన్నె మధ్యరకం ఇరిగేషన్ ప్రాజెక్టులకు నవంబరు 22 వ తేదీన శంకుస్థాపన జరిగింది.

### లోకసహాయక సేన శిక్షణ శిబిరం

వెల్దుర్తిలో 1961 నవంబరు నెలలో లోక సహాయక సేన శిక్షణ శిబిరం జరిగింది.

## మహబూబ్‌నగరం

### బావులకు సబ్సిడీలు

నాగర్ కర్నూలు తాలూకాలో వ్యవసాయావసరాల కొరకు బావులు త్రవ్వుకునే నిమిత్తం 1960-61 వ సం. లో 102 మందికి ఒక్కొక్కరికి రూ. 750 ల చొప్పున సబ్సిడీ ఋణాలు ఇచ్చారు.

## మెదక్

### శిక్షణ శిబిరం

రామాయంపేట బ్లాకు సెరిపల్లి గ్రామంలో నవంబరు 16 నుంచి 18 వరకు గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం జరిగింది.

నార్సింగి సర్కిల్‌లోని వివిధ గ్రామాలకు చెందిన సుమారు 50 మంది గ్రామ సహాయకులు శిబిరంలో పాల్గొన్నారు.

### మంచి నీటి బావులు

కొత్తగా మంచినీటి బావులను నిర్మించే నిమిత్తం జిల్లా పరిషత్తు 1961 నవంబరు నెలలో రూ. 1,18,901లు మంజూరి చేసింది.

## నల్గొండ

### పాఠశాల ప్రారంభం

సూర్యాపేట పంచాయతీ సమితి వట్టిఖమ్మంపాడు గ్రామంలో ప్రజల విరాళంతో నిర్మించిన పాఠశాల నూతన భవనానికి నవంబరులో ప్రారంభోత్సవం జరిగింది.

### 61 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా

ఈ జిల్లాలో గ్రామాలకు విద్యుత్ సౌకర్యాలనువిస్తరింపజేసే కార్యక్రమం రెండవ ప్రణాళికా లక్ష్యాన్నిమించి అమలు జరిగింది. ఈ ప్రణాళికా కాలంలో 22 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సౌకర్యాలను కలుగజేయటానికి లక్ష్యంగా పెట్టుకొనగా 61 గ్రామాలకు ఈ సదుపాయాలను లభింపజేయటం జరిగింది.

### మిర్యాలగూడెం సమితిలో సర్వతో ముఖాభివృద్ధి

గ్రామాల ఆర్థికాభివృద్ధి రంగంలో మిర్యాలగూడెం పంచాయతీ సమితి అభివృద్ధి సాధించింది. ఈ బ్లాకులోని సేద్య యోగ్యమైన భూమి దృష్ట్యా వ్యవసాయోత్పత్తి పెంపుకు అధికతర ప్రాముఖ్యత ఇవ్వటం జరిగింది. 12,165 మణుగుల ఎరువులను, 6672 మణుగుల మేలిరకం విత్తనాలను, 89 వ్యవసాయ పనిముట్లను ఈ ప్రాంతంలో పంపిణీ చేశారు.

సమితి ఏర్పడినప్పటినుంచి 10 ప్రాథమిక పాఠశాలలను కొత్తగా తెరిచారు.

పాములపాడులో 6 పడకలతో కూడిన వార్డుతోసహా ఒక ప్రాథమిక ఆరోగ్య కేంద్రాన్ని తెరిచారు. మాడుగలపల్లి, కొండ్రపోలు తడకమళ్ళలలో మూడు ఉపకేంద్రాలను తెరిచారు. 45 మంచినీటి బావులను కూడా త్రవ్వారు. వేములపల్లిలో తోలు పనివారల సహకారసంఘాన్ని నెలకొల్పారు. యాదగిరిపల్లిలో చాపల అల్లకం కేంద్రాన్ని తెరిచారు.

### ఉత్తమ గ్రామ సేవకునికి బహుమానం

సూర్యాపేటలో నవంబరు 19వ తేదీన జరిగిన ఒక సమావేశంలో జిల్లా పరిషత్తు అధ్యక్షులు ఉత్తమ గ్రామ సేవకునిగా ఎన్నికైన శ్రీ జబ్బార్‌కు సైకిలును బహూకరించారు. స్థానిక పాఠశాల నూతన భవనానికి ఆయన అదే రోజున ప్రారంభోత్సవం చేశారు

### జిల్లా ప్రణాళిక పెట్టుబడి

తృతీయ ప్రణాళికకై ఈ జిల్లాకు రూ. 3 90 కోట్లు కేటాయించారు. దీనిలో రూ. 106 లక్షలను సమాజాభివృద్ధి కార్యక్రమానికి ప్రత్యేకించారు. ఈ జిల్లా 19 బ్లాకులక్రింద విభజించబడినది రెండవ ప్రణాళిక ముగింపునాటికి 14 బ్లాకులు ఏర్పడినవి. రెండవ ప్రణాళికలో పూర్తికాక మూడవ ప్రణాళికలో చేర్చబడిన పథకాలక్రింద, మధ్యరకపుదైన మూసీ ప్రాజెక్టును పూర్తిచేసే నిమిత్తం రూ. 15లక్షలు కేటాయించబడినవి ఈ ప్రాజెకువల్ల 38,000 ఎకరాలకు లాభిస్తుంది.

### పౌష్టికాహార కార్యక్రమం

విస్తరింపబడిన పౌష్టికాహార కార్యక్రమాన్ని అమలుపరిచే నిమిత్తం భువనగిరి పంచాయతీ సమితిలో పది గ్రామాలను ఎన్నిక చేశారు.

### బీబీగూడ పంచాయతీ గృహం

సూర్యాపేట పంచాయతీ సమితిలోని బీబీగూడలో నవంబరు 18వ తేదీన పంచాయతీ గృహానికి శంకుస్థాపన జరిగింది. ప్రభుత్వ సహాయాన్ని అపేక్షించకుండా ఈ గ్రామస్థులు గృహనిర్మాణానికి పూనుకున్నారు. జిల్లా అంతటిలోనూ ఒక్క ఈ గ్రామంలోనే రక్షిత నీటి సరఫరా పథకాన్ని ప్రవేశపెట్టారు.

### ఉత్తమ రేడియో గోష్ఠికి బహుమతి

ఆంధ్రప్రదేశ్‌లో గ్రామస్థుల రేడియోగోష్ఠి ద్వితీయ వార్షికోత్సవం సందర్భంగా, హైదరాబాదు ఆకాశవాణి కేంద్రం వారు, సమాచార పౌర సంబంధముల శాఖతో సంప్రతించి, వారం వారం సమావేశాలు జరిపి, ప్రసారంలో సూచించబడిన విధానాలను సక్రమంగా అమలుపరిచిన ఉత్తమ గోష్ఠికి బహుమతి ఇవ్వటానికి నిశ్చయించింది. ఇప్పటివరకు రాష్ట్రంలో 112 గ్రామస్థుల రేడియో గోష్ఠులను ఏర్పరిచారు వీటన్నింటిలో సూర్యాపేట బ్లాకులోని పిల్లలమర్రి గ్రామస్థుల రేడియో గోష్ఠిని ఈ సంవత్సరపు ఉత్తమ గోష్ఠిగా ఎన్నిక చేశారు.

## నెల్లూరు

### బాలల దినోత్సవం

నెల్లూరులో నవంబరు 14వ తేదీన బాలల దినోత్సవం

జరిగింది. అధికార్లు, అనధికార్లు, పాఠశాలల పిల్లలు ఈ ఉత్స వంలో అత్యధిక సంఖ్యలో పాల్గొన్నారు. భారత శిశు సంక్షేమ మండలి నెల్లూరు శాఖవారు ఇచ్చిన బహుమతులను ఈ సందర్భంలో పంచిపెట్టారు

### ఫోను ఎక్చేంజి ప్రారంభం

బుచ్చిరెడ్డిపాలెంలో నవంబరు 13వ తేదీన టెలిఫోను ఎక్చేంజికి ప్రారంభోత్సవం జరిగింది.

### ఆయుర్వేద చికిత్సాలయ భవనం

కావలి పంచాయతి ఆయుర్వేద చికిత్సాలయభవనానికి ప్రణాళికా, సమాచారశాఖల మంత్రి శ్రీ పిడతల రంగారెడ్డి నవంబరు 13వ తేదీన శంకుస్థాపన చేశారు. దీని నిర్మాణ వ్యయాన్ని కావలి వాస్తవ్యులైన శ్రీ స్వామి శేషాచలం చెట్టి భరిస్తారు.

## నిజామాబాదు

### శిక్షణ శిబిరం

నిజామాబాదు పంచాయతీసమితి అధ్వర్యం క్రింద దోనకల్ గ్రామంలో నవంబరు 21 నుంచి 23వ తేదీ వరకు గ్రామనాయకుల శిక్షణ శిబిరం జరిగింది.

### "నవభారత నిర్మాణం" ప్రదర్శనం

యూనియన్ సమాచార, ప్రసార మంత్రిత్వ శాఖ ఫీల్డ్ ఎగ్జిబిషన్ కార్యాలయంవారు, ఆర్మూరులోని జిల్లా పరిషత్తు ఉన్నత పాఠశాలలో నవంబరు 28వ తేదీనుంచి వారంరోజుల పాటు, పంచవర్ష ప్రణాళికలపై "నవభారత నిర్మాణం" అనే ప్రదర్శనను నిర్వహించారు.

## శ్రీకాకుళం

### నందిగామ సమితి

నందిగామ పంచాయతీసమితికి డిశంబరు 3వ తేదీన ప్రారంభోత్సవం జరిగింది

### బొబ్బిలిలో టాగూరు శత జయంత్యుత్సవం

బొబ్బిలి ఎస్.ఎం.పి. పాఠశాలలో నవంబరు 13, 14వ తేదీలలో టాగూరు శత జయంత్యుత్సవం, బాలల దినోత్సవాలు జరిగాయి. టాగూరు చిత్రపటావిష్కరణ, కవీంద్రుని రచనలపై గోష్ఠి మొదలైన కార్యక్రమాలు ఈ రెండు రోజులలో జరిగాయి.

### కుష్టువ్యాధ చికిత్సాకేంద్రం

డెన్మార్కు శిశురక్షణ సంస్థ వారు పొగిరిలో కుష్టువ్యాధి ఆసుపత్రిని ప్రారంభించటానికి నిశ్చయించారు. ఈ సంస్థవారు భారతదేశంలో కుష్టువ్యాధి నివారణకు చర్యలు తీసుకుంటున్నారు.

## విశాఖపట్నం

### పారిశ్రామిక కార్మికులకు చికిత్సాకేంద్రం

విజయనగరంలో నివసిస్తున్న పారిశ్రామిక కార్మికులు, వారి కుటుంబాలకొరకు ప్రత్యేకంగా ఒక పూర్తిసమయం చికిత్సాకేంద్రాన్ని కోట అగ్రహారంలో నవంబరు 19వ తేదీన తెరిచారు. విజయనగరం పారిశ్రామిక వర్గానికి చెందిన వృద్ధుడు శ్రీ గాది ఎల్లయ్య దీనికి ప్రారంభోత్సవం చేశారు. ఈ చికిత్సా కేంద్రం స్థాపనతో మూడవ పంచవర్ష ప్రణాళిక క్రింద కార్మిక సంక్షేమ రంగంలో రాష్ట్రవైద్యశాఖ కార్యకలాపాలు ఆరంభమైనవి.

ఉద్యోగుల ప్రభుత్వభీమా పథకాన్ని విజయనగరంకి నవంబరు 19వ తేదీనుంచి వర్తింపజేశారు.

## వరంగల్

### కొత్తరోడ్లు, బావులకు పరిషత్తు గ్రాంట్లు

తెలంగాణా అభివృద్ధి పథకం క్రింద జిల్లాలో కొత్తరోడ్లు నిర్మించే నిమిత్తం జిల్లా పరిషత్తు 1961 డిశంబరులో రూ. 16,70,000లు వ్యయం కాగల ఒక పథకాన్ని మంజూరు చేసింది. ఈ సంవత్సరం రోడ్ల నిర్మాణానికి రు. 5 లక్షలు ఖర్చు చేయటానికి కూడా పరిషత్తు తీర్మానించింది. 1961-62వ సంవత్సరంలో, 145 మంచినీటి బావుల నిర్మాణానికి రూ. 2.16 లక్షలు మంజూరుచేశారు. రెండు పాఠశాల భవనాలు, రెండు కమూనిటీ హాళ్ళ నిర్మాణానికి రూ. 39,000లు మంజూరుచేశారు.

### రోడ్ల నిర్మాణానికి గ్రాంటు

రోడ్ల నిర్మాణానికీ నిర్వహణకు జిల్లా పరిషత్తు 1961 నవంబరులో రూ. 90,000లు మంజూరు చేసింది. జిల్లాలో క్షామ నివారణ కార్యక్రమం క్రింద నిర్మించిన రోడ్ల నిర్వహణ కొరకు గ్రాంట్లు మంజూరు చేయటానికికూడా పరిషత్తు నిశ్చయించింది.

## పశ్చిమ గోదావరి

**పాఠశాల నూతన భవనాలకు శంకుస్థాపన**

బంగారు రామారావు, మాచేపల్లి వెంకటరత్నం మునిసిపల్ హైస్కూల్ నూతన భవనాలకు డిశంబరు 3వ తేదీన శంకుస్థాపన జరిగింది. శ్రీ రావు, శ్రీ వెంకటరత్నం చెరి రూ. 20,000 లు విరాళం ఇచ్చారు.

**ప్రణాళికా గోష్ఠి**

ఏలూరు కళాశాల ప్రణాళికా గోష్ఠికి 1961 డిశంబరులో ప్రారంభోత్సవం జరిగింది.

**ప్రాతిపదిక ప్రాథమిక పాఠశాల ప్రారంభం**

కొవ్వూరు పంచాయతీ సమితివారు, మల్లవరం పంచాయతీ సహాయంతో మల్లవరంలో నిర్మించిన ప్రాతిపదిక ప్రాథమిక పాఠశాల భవనానికి నవంబరు 26వ తేదీన ప్రారంభోత్సవం జరిగింది. దీనిలో ఆరుగదులున్నాయి. నిర్మాణానికి రూ. 15,000లు ఖర్చయింది.

**ఏలూరు కళాశాలలో లైబ్రరీ హాలు**

సి. ఆర్. రెడ్డి కళాశాలలో కొత్తగా నిర్మించిన లైబ్రరీ హాలుకు ధర్మాదాయాలు, సహకార శాఖల మంత్రి నవంబరు 21వ తేదీన ప్రారంభోత్సవం చేశారు దీనికి శ్రీ వి. వెంకటసుబ్బయ్య గారి పేరు పెట్టారు. హాలు నిర్మాణానికి శ్రీ వెంకటసుబ్బయ్య రూ. 26,000లు విరాళం ఇచ్చారు.



# గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా

శ్రీకాకుళం జిల్లాలోని ఈ క్రింద పేర్కొన్న గ్రామాలకు 1961 అక్టోబరు నెలలో విద్యుత్ సౌకర్యాలను విస్తరింపజేశారు.

1. చిలకలపాలెం (శ్రీకాకుళంతాలూకా)
2. అల్లినగరం (చిలకలపాలెంశివారు, శ్రీకాకుళంతాలూకా)

ఇదే జిల్లాలోని దిగువ గ్రామాలకు 1961 నవంబరునెలలో విద్యుచ్ఛక్తి సౌకర్యాలను లభింపజేశారు.

1. పాలకొండ తాలూకాలోని వెంకటపతిరాజుపేట
2. పార్వతీపురం తాలూకాలోని సూడిగం, పుట్టూరు, మూడల వలస గ్రామాలు.

చిత్తూరు జిల్లాలోని ఈ క్రింద తెలిపిన గ్రామాలకు 1961 సెప్టెంబరు నెలలో విద్యుత్ సౌకర్యాలను చేకూర్చారు.

1. రేగట్లపల్లె (వాయల్పాడు తాలూకా)
2. బోడిగుట్టవారిపల్లె (వాయల్పాడు తాలూకా)

అనంతపురం జిల్లాలోని దిగువ పేర్కొన్న గ్రామాలకు 1961 అక్టోబరు మాసంలో విద్యుచ్ఛక్తి సౌకర్యాలను కలుగజేశారు.

వెంకటగిరిపల్లె (ధర్మవరం తాలూకా)

తెలంగాణా ప్రాంతంలోని ఈ క్రింద తెలిపిన గ్రామాలకు 1961 అక్టోబరు నెలలో విద్యుత్ సదుపాయాలను విస్తరింపజేశారు.

1. కొత్తూరు బుజుర్గ్ (జహీరాబాదు తాలూకా, మెదక్ జిల్లా);
2. విట్టాయ్‌పల్లె (కల్వకుర్తి తాలూకా, మహబూబ్‌నగరం జిల్లా);
3. చాకిరాల (హుజూర్‌నగర్ తాలూకా, నల్గొండజిల్లా);
4. శ్రీరంగపట్నం (చాకిరాలశివారు, హుజూర్‌నగర్ తాలూకా, నల్గొండ జిల్లా)

**

నాటిక :

# బాంధవ్యం

శ్రీ ఇనుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి

—: పాత్రలు :—

మూర్తి

నర్సు

లేడీ డాక్టరు

మూర్తి తనగదిలో కుర్చీలో కూర్చుని తెగ ఆయాస పడుతూ ఉంటాడు. క్షణంలో గభాలున లేచి, గది నాలుగు మూలలా పిచ్చివానిలాగ తిరుగుతూ ఉంటాడు. చప్పున దర్వాజా దగ్గరకు వెళ్లి, కళ్ళు నిలిపేసి ఆశ్చర్యంగా నిలబడిపోతూవుంటాడు. తెగ అలసట చెందుతున్నట్లు, విరామం లేకుండా, ఆవేదన వెళ్ళగక్కుతూ వుంటాడు.

మూర్తి : అబ్బ! యింకా రాలేదే. (రిస్టువాచి చూసుకుంటూ) చాలా టైమయింది. ( చప్పున ఆగి కళ్లు నిలిపేసి) ! ఏమీ ప్రమాదం లేదు కదా! ( తనలో ) ఇంకే ప్రమాదం అవుతుంది, అవాలసింది అయిపోయింది. ( తల ఊపుతూ ) తెలివి వచ్చి, నన్ను అడుగుతోందో, ఏమి గాభరా పడుతోందో! ( మెల్లగా ) నేనేవెళితే! అమ్మో, నేను వెళ్లి ఏంచేస్తాను! ఏమీ చెయ్యలేను! నేను కనిపించకుండా ఉండటమే మంచిది, ( ఎడం చేతిచూపుడు వ్రేలుతో తలమీద కొట్టుకుంటూ ) పాడుబుర్ర! ఏమీ తోచనీదు! ఇలాంటి సమయంలో కూడా ఏమీ ఆలోచన పోనీయదు! ... ( చప్పున గంతేసి ) అదిగో వస్తోంది! ...

నర్సు : ( గదిలోకి గబ గబ జొరపడుతూ): ఏమండీ! ...

మూర్తి : తెలివివచ్చిందా! అబ్బ! ఇంత సేపు చేశారేమండి! ...

నర్సు : తెలివింకా రాలేదు ! ...

మూర్తి : ఆ! ప్రమాదం ఏమీ లేదు కద!

నర్సు : అది తప్పిపోయింది లెండి! ఇంకో అరగంటలో స్పృహ కూడ వచ్చేస్తుంది. మేము చెయ్యాలసినదంతా చేశాం! కాని...

మూర్తి : మీరు మాత్రం ఏం చెయ్యగలుగుతారు! దేవుళ్లా ఆయుర్దాయం యివ్వటానికి. ఇంతకీ మాకు ఆ అదృష్టంలేదు, నేను ఎందుకు బాధ పడటంలేదు! జయకు స్పృహవచ్చిన తర్వాత నేను చెప్పాలిసిన సమాధానం ఏమిటా అని ఆలోచిస్తున్నా, అంతే!

నర్సు: ( పల్లు బైట పెడుతూ) : ఇంతమాత్రానికేనా! ఇంకా నయం ఆమె అదృష్టవంతురాలు!

మూర్తి : ఆ అదృష్టం నాది! ( గంభీరంగా చూస్తూ ) ఆ అదృష్టం నాది!...

నర్సు : ఇలాంటి సమయాల్లో, ఏ ప్రమాదమైనా జరగచ్చు, అలాంటిది తప్పిపోయింది. మీరు చాలా అదృష్టవంతులు!

మూర్తి : మీతో ఒక్కమాట: మీరెట్లాగైనా సరే జయనుబతికించాలి:

నర్సు : ప్రమాదంలేదని చెపుతున్నా కాదండి! ఇంకెందుకు గాభరా పడతారు! ఇంకో అరగంటలో స్పృహకూడా వస్తుంది. మీరువెళ్ళి మాట్లాడచ్చు. రెండు రోజుల్లో యింటికి కూడా తీసుకపోవచ్చు!

మూర్తి : అవుననుకోండి! కాని, మీకు తేలీదు. జయసంగతి మీకు తెలీదు, అందరి ఆడవాళ్ళ మాదిరి కాదు!...

నర్సు : ప్రతి మగవాడు, తన భార్యనుగురించి యిట్లాగే అంటారు లెండి! (కొంచెంగా నవ్వుతూ మూర్తి కళ్ళల్లోకి చూసింది)

మూర్తి : (బింకంగా మొహంపెట్టి) మీరంత తేలికగామాట్లాడటం భావ్యం కాదు. జయ అందరిమాదిరిది కాదు, నేను ఎగతాళికి చెప్పటం లేదు. పిల్లలకోసం ఎంత తా ప న ప డి పోయిందో, ఎంత ఆవేదన పడిందో, నాకుతెలుసు, మీకు ఆ వియషం ఎట్లాచెప్పాలో అర్థం కావటంలేదు. ఆమె ఆరాటం, ఆవేదన, మీకు అర్థమయ్యేటట్లు చెప్పాలంటే నాకు చేతకాదు, నేను ఒప్పుకుంటాను! కాని నన్ను మీరు అర్థం చేసుకోవటానికి ప్రయత్నించండి!...

నర్సు : ఆడవాళ్లు పిల్లలంటే మోజుపడటం అతి సహజ , దాన్ని మీరు కొండంతలు గోరంతలుచేసి చెపుతున్నారు, అంతకంటె, ఏంలేదు. నిత్యమూ ఇలాంటికేసులు ఎన్నిచూస్తున్నాం, ఇదొక్కటే మీరుచూసింది, అలాంటి తల్లులందరూ మళ్లి క్షేమంగా ఇళ్లకు వెళ్లటంలేదా, మళ్లీ మాదగ్గరకు రావటం లేదా! ఇది లోక సహజమండి!... నే వస్తా! నాకు!...

మూర్తి : మీకు నామనస్సు అర్థంగాలేదు. నాహృదయ ఆవేదన మీరు అర్థం చేసుకోవటానికి ప్రయత్నించటం లేదు. జయ, పిల్లలకోసం, నిత్యమూ కలవరిస్తూవుండేది. పెళ్లయినప్పటినుంచి అమెకు పిల్లలధ్యాసే, ఇంకోటిలేదు. నాకు ఆశ్చర్యంవేసేది! నాకు పిల్లలంటె చెడ్డచిరాకని చెపితే మీరు ఆశ్చర్య పడతారు! ఇంతగా విప్పదీసి చెప్పుతున్నందుకు మీరేమి అనుకోకండి!... నా ఆవేదన మీతో చెపుతున్నా అంతే!...

నర్సు : అదిసరే లెండి (కొంచంగా నవ్వుతూ): ఇంతకీ నన్నేం చెయ్యమంటారు!

మూర్తి : జయమనస్సు మీకు అర్థంకాదు! స్పృహరాంగానే ఈ విషయం తెలుస్తే, ఎక్కడ అవురు మంటుందో అని భయంగా వుంది!

నర్సు : మీ మగవాళ్లు ఒట్టి పిరికి వాళ్లు! ఆడదానిసహనం, నిబ్బరం నిండుతనం మీకు అర్థంగాదు. మీకుఅర్థమయ్యేటట్లు ఎట్లా చెప్పాలో నాకు తెలీకుండావుంది. ఇంతమాత్రానికే జయ ఏదో అవుతూందటే! నేను నమ్మలేకండా వున్నా! ఇదంతా మీ ఊహేగాని అంతకంటె యేంలేదు! మేం వున్నాంగా, చెయ్యాలిసినదేమిటో చేస్తాం, ఆమెగారికి ధైర్యం వచ్చే మాటలు చెపుతాం, ఇది మాకు అలవాటేగా! ఆమెగారి మనస్సు అటువైపుకు మళ్లకుండా చెయ్యాలసినదంతా చేస్తాం, మీరు ధైర్యంగా వుండండి! ఆమెగారు అధైర్య పడిపోతుందని, ఇప్పుడు మీరు చప్పగాజారిపోతే యెలా! ముందర, మీకు ధైర్యం చెప్పడం ఎట్లాగా అనిచూస్తున్నా!.

మూర్తి : మీకేం మీరు ఏమైనా అంటారు నేనేమి అనుకోనులెండి మీరేమన్నా పరిహాసం చెయ్యటానికి కాదుగా ఇంతకీ మీరు మమ్ముల్ని అర్థంచేసుకోలేదు అనుకుంటాఅంతే! ఏమయినా కాని, మీరుమాత్రం జయను బతికించాలి!

నర్సు : (విసుగ్గా)! అయితే నన్నేం చెయ్యమంటారు; పిల్లవుతె చచ్చిపోయింది

మూర్తి : (ఉలిక్కిపడుతూ) అవును! అవును!

నర్సు : మీరు ఆమెగారిని ఓదార్చాలసింది పోయి, మీరే యిదవుతారేమిటండి! నే వస్తా! మీరోసారి రండి అటు.

(చకచక వెళ్లిపోతున్న నర్సును దిగాలపడిచూస్తూ, మూర్తి నిలబడిపోయాడు)

మూర్తి : (తనలో) జయ, ఒట్టి, భయస్థురాలు పి రి కి ది! పిల్లపోయినదని తెలుస్తే, ఏట్లా వుంటుందోమరి!... అవును ఈ వయస్సులో పిల్లలేమిటి.! అయిదేళ్లదాక పిల్లల ప్రమేయం ఉండగూడదని అన్నప్పుడు ఎట్లావుందోతలుచుకుంటుంటే ఇప్పుడు భయమేస్తోంది! ఏమో! ఏమిటో!... ఎవరిపిల్ల కనిపించినా, యిట్టే చేతుల్లోకి తీసుకుని మురిసిపోయేది:తనపిల్లను చూసుకుని సంతోషించే యోగ్యత లేకపోయింది. (పెద్దగా నిటూర్పు విడిస్తూ కుర్చీలో కూర్చుంటాడు)

... ... ... ...

లేడీడాక్టరు : ఏమండి! ఎప్పుడొచ్చారు!...

మూర్తి : ఎట్లా వుందండి!...

లేడీడాక్టరు : (పెద్దగా నవ్వుతూ) ఎట్లా వుంటుంది, క్రమంగా కోలుకుంటుంది.

మూర్తి : స్పృహ వచ్చిందా!

లేడీడాక్టరు : ఆ! వచ్చినట్టే!...

మూర్తి : (ఆశ్చర్యంగా) ! ఆ!

లేడీ డాక్టరు: మీరెందుకు భయపడతారు: ఇలాంటి తల్లుల్ని ఎట్లా చూసుకోవాలో మాకు తెలీదా ఎంతో ఆవేదనగా చెప్పారుట! మా బాధ్యత మేము నిర్వర్తించుకుంటాము. మీరు మాత్రం ధైర్యం వుండండి అంతే. ఆమె గార్ని చూడంగానే, ముందర మీరు ఆపురు మన్నారంటే మళ్లీ మొదటికి వస్తుంది, ఆమె గారికి ధైర్యం చెప్పాలి.

మూర్తి : (డాక్టరు వంక నిశ్చేష్టుడయి చూస్తూ నిలబడి పోయాడు)

లేడీ డాక్టరు : కూర్చొండి. అట్లా నిలబడి పోయారే, నేనుపిలుస్తా లెండి, అప్పుడు వద్దురు గాని లోపలకి.

మూర్తి : డాక్టరుగారు, మీతో ఓమాట. మీరేమి అనుకోవద్దు, నన్ను మీరేమన్నాయిష్టమే, కాని ఒక్కరహస్యం, జయకు ఈ విషయం తెలుస్తే జీవిస్తుందనే నమ్మకం నాకు లేదు మీరుఎన్నైనాఅనండి జయను బతికించాలసినబాధ్యత మీది! ఇంతకంటె నేనేమి చెప్పలేను.

లేడీ డాక్టరు ; మొహం చిట్లిస్తూ, మూర్తివంక క్షణం చూసి) ఏమిటీ యింత యిదిగా చెపుతున్నారు, నిజమా పిల్లలంటే అంత ప్రాణం,

మూర్తి : ( ఆదుర్దాగా ) : నిజం మమ్మాటికి నిజం. నేను యింత యిదవుతున్నానంటే, నేను భయపడి కాదు జయ ఏమౌతుందో అనే ఆదుర్దాతో అంతకంటె ఏంలేదు, నాకు చాలా సంతోషంగావుంది, మీరు నన్ను అర్థం చేసుకున్నానుకుంటాను, నాప్రాణం ఎంతో హాయిగా వుంది, ఇంకా నేనుమీకేమీ చెప్పక్కర్లేదు,

లేడీ డాక్టరు: ( ఆలోచనగా నిలబడిపోయి) మూర్తి వంక వెర్రిగా చూస్తూ, జయనుబ్రతికించాలి. జయ బతుకుతుంది (ధైర్యం గానూ నిశ్చయంగానూ ) జయ జీవిస్తుంది. ఏ భయమూ లేదు మీకు అభయం యిస్తున్నాను.

నిబ్బరంగా లోపలికి వెళ్ళిపోయింది

మూర్తి : (సంతోషంగా మొహం వెడల్పు చేసుకుని, ఆదుర్దాగా ఆ గదివైపుకే చూస్తున్నాడు. ) ( తనలో ) జయకు ప్రమాదం లేదు.

లేడీడాక్టరు లోపల్నుంచి ఎప్పుడు వస్తుందా అని ఆదుర్దాగా ఎదురు చూస్తూ అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు. గోడ గడియారం టిక్కు టిక్కు మంటుంటే వింతగా అటువైపుకే చూస్తూ క్షణ క్షణానికి తన రిస్టువాచీని చూసుకుంటున్నాడు. అలసట పడిపోతున్నాడు మొహం చీటికి మాటికి తుడుచుకుంటు ఆయాసపడిపోతున్నాడు, ఒక్క అంగలో గదిదాకా వెళ్లి మళ్లీ వెనక్కు తగ్గుతున్నాడు.

తలుపు తీసిన చప్పుడయి గభాలున అక్కడే కళ్ళు నిలిపి వేశాడు. లేడీ డాక్టరు వస్తున్నట్లు గమనించాడు. హృదయంలో ఆవేదన, ఆవేశం హెచ్చిపోతోంది. ఆమె వచ్చేసి నిశ్చలంగా నిలబడింది ఆమెను చూసేటప్పటికి, మూర్తి నోటినుంచి మాట పెగలలేదు. నిశ్చేష్టుడయిపోయాడు. ఆమె అటూ ఇటూ తత్తర బిత్తరగా చూసి, చప్పున, మూర్తి దగ్గరకు వచ్చి, లోపలకురమ్మని సంజ్ఞచేసింది. ఇద్దరూయాంత్రికంగా లోపలకు వెళ్ళి కూర్చున్నారు!

లేడీడాక్టరు : ప్రమాణం చెయ్యండి ఎవ్వరికీ చెప్పనని!

మూర్తి : (గాభరాగా తొట్రుపడుతూ) ప్ర...మా...ణ...మా! దేనికి!

లేడీడాక్టరు : చెపుతాగా ముందర ప్రమాణం చెయ్యండి!

మూర్తి : గుటకలువేస్తూ! వెనక్కు తిరిగిచూసి, స్పృహవచ్చిందా! జయ కళ్లు తెరిచిందా!

లేడీడాక్టరు : ఆ! నేనన్న మాటకు సమాధానం చెప్పరే!...

మూర్తి : ఎవ్వరితో చెప్పను! మీరు ఏది చెయ్యమంటే అదిచేస్తా!.. ఏమిటో చెప్పండి!...

లేడీడాక్టరు : ఓ గొప్పింటివాళ్ళమ్మాయి కాలు జారింది. ఊళ్ళో తెలిసిపోతుందని, చదువుకని బయలుదేరి అక్కడయిక్కడ కాలక్షేపం చేస్తూ, నా దగ్గరకు వచ్చింది నన్ను సహాయం చెయ్యమని ప్రార్థించిది. నా దగ్గర వాగ్దానంతీసుకుని ఇక్కడ ఆసుపత్రిలో చేరింది. ఆమెగూడా ఆడపిల్లనే కన్నది. ఆ పిల్ల విషయమై తీసుకోవలసిన జాగ్రత్త నామీద వుంది!...

మూర్తి : ఆశ్చర్యంగానూ, సంతోషంగానూ!.. ఆ!...

లేడీడాక్టరు : అవును! ఈ రహస్యం, నాకూ అమ్మాయికే తప్ప యిక్కడెవరికీ తెలీదు!.. ఇంకా నేను విపులంగా చెప్ప క్కర్లేదనుకుంటాను! (సమాధానం కోసం, మూర్తి కళ్ళలోకి తీక్షణంగా చూసింది)

మూర్తి : (పెద్ద నిట్టూర్పు విడుస్తూ)! ఆ అమ్మాయి ఎవరో మా కోసమే యిక్కడకు వచ్చినట్టుంది.

లేడీడాక్టరు : అట్లాగేవుంది చూడబోతే! ఏమయినాగాని, ఇది ఎవ్వరికీ తెలియకూడదు మీ ఆవేదన చూసి, నేను చేసిన సాహసం, అంతకంటె యేంలేదు నా మాట దక్కించండి! ఇంకా మీరు ఆదుర్దా పడవలసిన పనేమి లేదు జయ కళ్లు తెరవంగానే పక్కలో పాప వుంటుంది అదేగా మీకు కావాలిసింది!...

మూర్తి : నాకు కావలిసింది కాదు. జయకు కావలిసింది?

లేడీడాక్టరు . పోనీ యిద్దరికీ కావలిసింది సరేనా' (నవ్వుతూ) మొత్తంమీద పెద్ద చిక్కు సమస్య యిట్టే పరిష్కార మయిపోయింది (మెల్లిగా) అసలు రహస్యం ఇంకోటి నిజం చెప్పాలంటే, మీ సమస్యకంటె నా సమస్య పెద్దది. ఈ పిల్లను ఏంచేశేటట్టా అని మధనపడి తన్నుకుపోతున్నా. మీరొచ్చి నాకా దారి చూపించారు మెనీమెనీ థాంక్సు'

మూర్తి : నామీద మీరు చూపించిన ఆదరాభిమానాలకు నా జీవిత మంత మీకు కృతజ్ఞునిగా వుంటాను మీరు కేవలం, ఓ పిల్లను మాకివ్వటం కాదు ఇద్దరి ప్రాణాల్ని కుదటబడే టట్లు చేశారు ఆయుర్దాయం యిచ్చి మా జయను బ్రతి కించారు. మీరు ప్రాణదాతలు. మీ ఋణాన్ని ఎట్లా తీర్చు కోవాలో అర్థంకాకుండా వుంది.

లేడీడాక్టరు . ఇప్పుడు చూడండి, జయ ఎట్లా వుంటుందో! మేము యెన్ని మందులిచ్చినా ఆమె త్వరగా కోలుకుంటుందనే నమ్మకం వుండేది కాదు. ఇప్పుడు ఆమె గాఢమైన ప్రేమే ఆమెకు, బలం, ఆరోగ్యం యిస్తాయి! మీరు ఆమెను గురించి ఏమీ దిగులు పడాలిసిన అవసరంలేదు నిశ్చింతగా ఆమెను, పిల్లను యింటికి తీసుకుపోవచ్చు.

(ఆమె లేచి వెళ్ళబోతుంది)

మూర్తి : జయదగ్గరకు వెళుతున్నారా!

లేడీడాక్టరు : ఏం! ఏమన్నా చెప్పమంటారా! మీకు చూడాలని వుందా!

మూర్తి : (వ్యంగ్యంగా నవ్వుతూ)' ఎవరిని?

లేడీడాక్టరు : ఏమో మీకు ఎవరిని చూడాలని వుందో!

మూర్తి : బలే చమత్కారంగా మాట్లాడుతారండి!...

లేడీడాక్టరు అవునుగాని, ఆమెగార్ని సాగనంపి వస్తా!...

మూర్తి : ఎవరిని?

లేడీడాక్టరు · ఆమెనే, మనకు పిల్లనిచ్చిన ఆడపడుచును!

మూర్తి (శరీరం కంపించింది) · ఊ.. జయదగ్గరకు వెళ్ళొచ్చా!

లేడీడాక్టరు : నేను చెపుతానుగా, కాసేపు ఓపికపట్టండి!...

(మూర్తి గదిలో తాపీగా కూర్చుని వింతగా ఆలోచించు కుంటున్నాడు) అటూ ఇటూ కళ్ళుతిప్పుతూ చూస్తున్నాడు తాను గది తలుపు ప్రక్కన కుర్చీలో కూర్చుని, తన శరీరం యితరులకు కనబడకండా, తాను మాత్రం, ఒరకంటితో అటూ ఇటూ చూస్తు న్నాడు ఎదురుగా గదిదగ్గర చప్పుడయినట్టు శబ్దం అయింది. చప్పున రెండు కళ్ళు అటు కేంద్రీకరించాడు.

లేడీడాక్టరు మెల్లిగా ఒక పడుచు అమ్మాయితో సహా సన్నగా మాట్లాడుతుంది ఆమె బిత్తరుగా అటూఇటూచూస్తూ, అడుగు తీసి అడుగు లేస్తూ, మెల్లి మెల్లిగా ఆ అమ్మాయి నడుస్తోంది వెళ్ళిపోతున్న ఆ అమ్మాయిని, విచారంగాచూస్తూ, లేడీడాక్టరు నిలబడిపోయింది

మూర్తి . (పెద్దగా ఆయాసపడుతూ, గభాలునలేచి, వెళుతున్న ఆ అమ్మాయిని తలుపుచాటునుంచి చూస్తూ) మెల్లిగా, సునీత! సునీత అని తనలో రెండుసార్లు అనుకున్నాడు కట్టెలాగ నిలబడిపోయాడు గభాలున కళ్లు మూసుకున్నాడు శరీరం కంపించింది. చప్పున కుర్చీలో కూలబడ్డాడు ఆ చప్పుడుకు లేడీడాక్టరు చకచక వచ్చింది.

లేడీడాక్టరు ఏమండీ!... ఏమిటి?...

మూర్తి (కళ్లుతెరిచి) ఏమీలేదు!

లేడీడాక్టరు ఏమిటి అట్లావున్నారు? మొహమంతా ఎర్రబడి పోయింది! ఏమయిందేమిటి!...

మూర్తి (గజగజ వణుకుతూ) పంపించేశారా ఆ అమ్మాయిని.

లేడీడాక్టరు ఆ! ఇప్పుడే అసలు మీకు చూపిద్దా మనుకున్నా కూడా, ఆమె యిష్టపడలేదు. ఆమె మొహం యెవ్వరూ చూడకూడదన్నది అతి రహస్యంగా వుంచమంది

మూర్తి మీకు అభ్యంతరం లేకపోతే, నేనో ప్రశ్న అడుగుతాను చెపుతారా!

లేడీడాక్టరు ఎందుకు అంత అనుమానం!

మూర్తి ఏమీలేదు! ఆమె పేరేమిటి!

లేడీడాక్టరు ఇంత గ్రంధం జరిగిన తర్వాత, ఆమెపేరు చెప్పితే తప్పేముందిలెండి, సునీత!

మూ_ . (మొహాన రెండు చేతులు కప్పుకుని): కొంచెం పెద్ద గానే నాపిల్ల చచ్చిపోలేదు. నా కూతురు బతికేవుంది, నా కూతురు బతికేవుంది. అనుకుంటూ జయవున్న గది వైపుకు అమాంతం పరుగెత్తాడు

లేడీడాక్టరు . చిత్తరుపోతూ దిగాలపడి చూస్తూ నిలబడిపోయింది.

(తెరపడుతుంది)

# సవరలు-మత జాత్యాది విశేషాలు

శ్రీ జి. వి. రామమూర్తి

"మనము ఎప్పుడూ చూడని భగవంతునికి రూపం ఎలా కల్పించగలము?" అంటాడు సవరవాడు. ఇతర ఆదిమవాసులలో లేనట్టే సవరలలో కూడా విగ్రహాలను పూజించే అలవాటు లేదు. ఆచారమూ లేదు కాని భగవంతుడు అంటూఉన్నాడని వారికి పూర్తి నమ్మకముంది. ప్రపంచాన్ని సృష్టించినవాడు "గడేబోజన్" అని అంటారు. ప్రపంచ సృష్టికర్తయిన 'గడేబోజన్'న్ను 'లంకన్' అనికూడా అంటారు. 'లంకన్' అంటే సూర్యుడు, 'లంక'నుకు అసలు అర్థం 'ఎత్తు' అని. సూర్యుడు ఆకాశంలో ఎత్తున కనిపిస్తాడుగనుక సూర్యుడ్నికూడా 'లంకన్' అంటారు. "గడేబోజన్ను" పూజించేటప్పుడు గోడమీద సూర్యుని చిత్రాన్నిగీస్తారు. సూర్యుడు అందరకు ప్రత్యక్ష దైవమేగదా? ఇతర కొండజాతులవారు కూడా సూర్యుడ్ని పూజిస్తున్నారు.

ప్రపంచంలోని ప్రాణికోటికి యీ 'లంక' ప్రాణం పోస్తున్నాడని సవరల నమ్మకం. నిజంగా అంతేకదా? సూర్యుడు ఉండకపోతే ప్రపంచమే ఉండదు.

"దేవుడా! మాకు తినడానికి తిండిని ప్రసాదించు" అని దేవుడ్ని ప్రార్థించమంటే సవరవాడు నవ్వుతాడు, "నాకు ఏహానీ రాకుండాఉండాలని నేను నా దేవతలకు ఉవారం పెట్టాను. నా పనిని నేను చేశాను. నేను దేవుడ్ని ప్రార్థించినంత మాత్రాన నాకు కావలసినవన్నీ వస్తాయా? నేనుకష్టపడి చెమట ఓడ్చి సంపాదించుకోవాలి గాని." అంటాడు సవరవాడు

సవరల మతము ఏమిటో మనము సరిగ్గా నిర్ణయించి చెప్పడం కష్టము. వారి మతాచారాలు, యితర ఆచారాలు ఏమిటో తెలుసుకొనడం కూడా కష్టమే. వారి నిత్య ఆచార వ్యవహారాలు మతముతోనే కాక యింకా అనేకమైన వాటితో సంబంధించి ఉంటాయి.

వారికి కనబడకుండా వారిచుట్టూ అనేక భూతాలు పిశాచాలు తిరిగుతూ ఉంటాయని వారికి చాలగట్టి నమ్మకము ఉంది. ఆభూత పిశాచాలకు వారిమీద కోపంరాకుండా చూసుకోవాలని వారు ప్రయత్నిస్తూ ఉంటారు ఈభూత పిశాచాలను "సోనుము"లని అంటారు సవరలు. ఈ 'సోనుములు' రెండు రకములు.

ప్రతి సవర గ్రామానికి ఒక 'బుయ్యా' ఒక 'గోమాంగ్' అంటూ యిద్దరు గ్రామపెద్దలు ఉన్నారు. 'గొమాంగ్' గ్రామానికి అధికారి, 'బుయ్యా' వారి మతాధికారి. ఇదివరకు గొమాంగో, బుయ్యాలుగా ఉండి చనిపోయినవారంతా భూతాలుగా మారి వారిని కనిపెట్టుకు ఉంటున్నారని సవరలకు నమ్మకము. ఈ భూతాలు ఒక రకము.

రోగాలను తెచ్చిపెట్టే భూతాలు రెండవ రకము. ఈ భూతాలేకాక "కిత్తుంగు"లనే దేవతలుకూడా ఉన్నారట. గ్రామములో ఉండే వారంతా కలిసి భూతాలకు పిశాచాలకు బలులు యిచ్చి పూజించేటప్పుడు ఈ కిత్తుంగులను, పితృదేవతలను కూడా పూజిస్తారు. ఈ పూజలను మత పెద్దయిన 'బుయ్యా' చేయిస్తాడు.

చనిపోయిన బుయ్యా, గొమాంగ్‌లు చాలామంది ఉంటారు గదా! వారందర్నీ పేరు, పేరున తృప్తిపరచడమన్నది వారికి పెద్ద సమస్యకాదు. సాధారణంగా సవరల పేర్లు వారాల పేర్లకు సంబంధించి ఉంటాయి గనుక వారాలపేర్లతో పూజలు జరిపిస్తాడు బుయ్యా. ఈ పూజలకు గ్రామస్తుల తరపున బుయ్యానే చేయాలి. ఇంకెవరూ చేయకూడదు. వారి పితృదేవతలను తృప్తిపరచడానికి చేసే పండుగలలో ముఖ్యమైనది 'గూఅర్' పండుగ.

సవరలు పూజించే దేవతల సంఖ్య ముఖ్యంగా 72. ఇందులో మొగ, ఆడ భూతాలుకూడా ఉన్నాయి. కొన్ని పండు

గలలో కొన్ని భూతాలను మరికొన్ని పండుగలలో యితర భూతాలను పూజిస్తూ ఉంటారు ఈ భూతాలలో కొన్ని పంటలకు సంబంధించినవి, కొన్ని పండుగలకు సంబంధించినవి ఉన్నాయి. వానలు లేకపోతే వేరే యితర భూతాల్ని పూజిస్తారు

సవర పల్లెలకు చేరువనుండే కొండలమీద 'కిత్తుంగు' భూతాలు ఉంటాయట సోమముల తృప్తి కొరకు వీరు చేసే పూజలు సక్రమంగా జరుగుతున్నాయో లేదో అని ఈ భూతాలు కనిపెట్టి చూస్తూ ఉంటాయట ఏమైనా లోపాలు జరుగుతే యీ కిత్తుంగు భూతాలకు కోపం ఎచ్చి రోగాలనో, కరువునో తెచ్చి పెడతాయని సవరలు భయపడతారు

ఏ సంవత్సరములో పండిన పంటను ఆ సంవత్సరములోనే తినాలనే నియమము సవరలలో ఉన్నది. అందుకని, ఎక్కువగా పండినా ఆ పంట ముందు సంవత్సరానికి పనికిరాదని ఎక్కువగా దేన్నీ పండించరు. మిగిలినా దాచుకోరు అందువలన సవరలకు కరువు బాధ వస్తూ ఉంటుంది కరువు వచ్చిందంటే 'కిత్తుంగు' లకు కోపం వచ్చిందని, శాంతి కోసం పండుగ చేస్తారు

ఈ కిత్తుంగులలో "రామా. భీమా" అనే పేర్లు గలవారు యిద్దరున్నారు. మన రామాయణములోని రాముడు, భారతములోని భీముడు వీరికి ఎలా దేవతలయ్యారో చెప్పలేము ఇండూరురాజా, గుర్బాడా రాజా, గులుసు రాజా. సోడంగా రాజా, దరమ్మ రాజా అని రాజుల పేరిట కొందరు దేవతలున్నారు వీరు. పూర్వం సవరలను జయించి. పరిపాలించిన రాజులు అయుండవచ్చును

## జాతి బేధములు

ఇతర మతాల వారిలో ఉన్నట్టే సవరలలో కూడా జాతి బేధాలు ఉన్నాయి వీరిలో సుమారు 25 జాతులవారు ఉన్నారు వీరిలో ఎక్కువ మంది "జాతి సవరలు". "జాతి"అన్న పదము సవరలే ఉపయోగిస్తారు. జాతి సవరలంటే అసలయిన సవరలని గాని, మేలిజాతి సవరలనిగాని మనము అనుకోవచ్చును

ఇతర సవరజాతులవారి కన్నా అధికులమని, వారి భాషను, మతమును, ఆచార వ్యవహారములను అలవాట్లను చెడగొట్టకుండా నిలబెడుతున్నట్టు యీ జాతిసవరలు గొప్పగా చెప్పుకుంటారు. వీరు ఎనుబోతు మాంసాన్ని తింటారే గాని గొడ్డు మాంసమును తినరు. "ఆవు, ఎద్దు మాంసం తినేవారికన్నా, మేము పైజాతి వారము" అని వీరు అంటారు.

సవరదేశమునకు చేరువుగా ఉన్న మన నాగరకుల సంపర్కం కలిగిన సవరలు కొంతమంది ఉన్నారు వీరు "బిమ్మ బొబ్బిలి. కాపు. కుడుంబ, టెక్కలి" మొదలయిన వారు "శుద్ధ సవర"లని మరి కొందరు ఉన్నారు. వీరికి నాగరికులయిన ఓఢ్రుల, తెలుగువారి సంపర్కము ఎక్కువగా ఉన్నది హిందువుల ఆచార వ్యవహారాలను వీరుఎక్కువగా పాటిస్తారు వీరు ఆవు మాంసము, ఎద్దు మాంసము, పోతు మాంసము తినరు. వీరికి నాగరకత అలవడింది అందువల్ల జాతి సవరలకన్నా గొప్పవారమని చెప్పకుంటారు స్వజాతి భాషను ఆచార వ్యవహారాలను, మతమును చెడగొట్టిన "జాతి చెడిన" సవరలని వీరిని మన్యాలలో ఉండే సవరలు నీచంగా చూస్తారు. అందువలన వీళ్ళకు, వాళ్ళకు పంక్తి భోజనాలు లేవు

ఆర్సిన్' సవరలని ఒక జాతివారు ఉన్నారు 'ఆర్సిన్' అంటే బాబూన్ కోతి అని సవర భాషలో అర్థము కోతి పేరిట యీ జాతివారికి పేరు ఎందుకు వచ్చిందో సరిగ్గా వారే చెప్పలేకుండా ఉన్నారు. ఈ జాతివారు ఒకప్పుడు కోతులను ఎక్కువగా తినేవారు అందుకని ఈపేరు వారికి వచ్చిందని కొందరుఅంటారు. కోతులకు తోకలు వేలాడు తున్నట్టు వీరి గోచీల చివరలు వెనక వేలాడుతూ ఉంటాయని యితరులు ఈ పేరు వీరికి పెట్టారని మరి కొందరు అంటారు

డా గిడుగు వేంకట సీతాపతి గారు ఒకసారి ఈ ఆర్సిన్ సవరలు ఉండే గ్రామానికి వెళ్ళారు అక్కడి వారిని యీ పేరు వారికి ఎందుకు వచ్చిందని అడిగారుట. అందుకు ఒక ముసలి ఆర్సిన్, సవరవాడు " బాబూన్ కోతులు మాకు అన్నదమ్ములు. మాకు చాలా కావసిన వారు. మా నివాసం వారి నివాసం ఒక్కటే అందుకని మాకు యీ పేరు వచ్చింది " అని అన్నాడట హాస్యంగా, " అయితే మీరు కోతులను పూజించరేం? అని సీతాపతిగారు హాస్యధోరణిలోనే అడిగారుట " వాటిని మేము పూజించక పోయినా మా ఉదర పూజకు వాటిని ఉపయోగిస్తాము అన్నాడట ఆ సవరవాడు.

ఈ ఆర్సిన్ జాతి సవరలకు మాత్రమే బట్టలు నేయడం తెలుసు.

"జాదు సవరలనే" వారు దూరపు మన్యాలలో ఉంటున్నారు. జాతి సవరల కన్నా వీరు వీరి పూర్వ ఆచార వ్యవహారాలను చాలా జాగ్రత్తగా పోషిస్తున్నట్టు వీరు చెప్పుకుంటారు.

సవర భాషలో 'కిండల్' అంటే బుట్ట. బుట్టలు అల్లి జీవించే సవరలను 'కిండల్' సవరలని, కుండలను చేసే సవరలను 'కుంబి' సవరలని, లోహపు పనులను చేసే వారిని 'లాంగ్' 'లారా' గొంటారా సవరలని వాళ్ల వాళ్ల వృత్తులను బట్టి వారి జాతులకు పేర్లు వచ్చాయి.

'బాసెంగ్' సవరలని ఒక జాతివారు ఉన్నారు. ఈ సవరలు సవరదేశమునకు దక్షిణముగా పల్లపు ప్రదేశాలలో ఉంటున్నారు. వీరు మనవారితో కలసి తిరగడం వల్ల వీరికి యీ పేరు వచ్చింది. 'బాసెంగ్' అంటే పల్లపు ప్రదేశమని సవరభాషలో అర్థము.

కాపు సవరలని యింకొక తెగవారున్నారు. తెలుగువారిని సవరవాళ్లు 'కాపు'లని అంటారు చెక్కాలి పట్నానికి చేరువనున్న సవరలను 'చెక్కాలి' సవరలని అంటారు. ఈ రెండు తెగల వారికి తెలుగువారి సంపర్కం ఎక్కువ. వీరు తెలుగుదేశానికి చాలా చేరువలో వున్నారు. వీరిలో కొంతమంది పర్లాకిమిడి, చెక్కాలి యింకా యితర గ్రామాలలోను, పట్నాలలోను స్థిరనివాసం ఏర్పరచుకుని, సవరభాషను మరచిపోయి తెలుగునే మాట్లాడుతున్నారు. ఇంటిపేరుకూడా పెట్టుకుంటున్నారు.

శుద్ధ సవరలకు మహేంద్రగిరికి చేరువలోనున్న ఓఢ్రులతో ఎక్కువ సంపర్కంకలిగి, సవర ఆచార వ్యవహారాలను పూర్తిగా విడిచిపెట్టకపోయినా ఓఢ్రుల పూజావిధాలను పాటిస్తున్నారు. హిందువుల సంపర్కం కలిగిన సవరలు పంది మాంసాన్ని కూడా తినరు ఏఏ జంతుమాంసాన్ని తినరో దానినిబట్టి వారివారి జాతులలో హెచ్చు తగ్గులు ఏర్పడినాయి. పైజాతివారు క్రిందిజాతివారు ముట్టుకున్న అన్నం తినరు, నీళ్లుకూడా త్రాగరు.

క్రిస్టియన్ సొసైటీల వారు మన్యాలలో కూడా వారి మత ప్రచారాన్ని సాగించి కొన్ని గ్రామాల సవరలను వారి క్రైస్తవ మతంలో చేర్చుకున్నారు. క్రైస్తవ మతాన్ని స్వీకరించేవారు గ్రామానికి ఒకరు ఇద్దరు ఉండరు. చేరితే గ్రామ మొత్తంమీద అందరూ చేరతారు. లేకపోతే ఎవరూ చేరరు.

క్రైస్తవ మతం పుచ్చుకున్న సవరలను యితర సవరలు దూరంగానే ఉంచుతారు, పంక్తి భోజనాలు ఉండవు కాని వేడుకలలోను, ఉత్సవాలలోను కలిసి మెలిసి తిరుగుతారు.

## గ్రామపరిపాలన

గ్రామానికి అధికారి 'గొమాంగ్'. గొమాంగ్ అంటే సవర భాషలో గొప్పవాడని అర్థము. గొమాంగుకు సహాయము చేసేవాడు 'బుయ్యా'. ఇతడు గొమాంగ్‌కు పరిపాలనా విధానంలో సహాయం చేయడమే కాక, గ్రామానికి మత విషయాలలో పెద్దరికం వహిస్తాడు. ఈ యిద్దరి హోదాలను ప్రభుత్వంవారు మన్నించి వారి, వారి పనులను చేయడానికి ఒప్పుకున్నారు. సుమారు 150 సంవత్సరాలకు పూర్వం యీ సవరలు స్వతంత్రులు తర్వాత బ్రిటిష్ ప్రభుత్వం వీరిని లోబరుచుకుంది. అయినా వీరి పాత సంప్రదాయాల ప్రకారమే నేటికి వీరి గ్రామ పరిపాలన జరుగుతున్నది. ఒక గ్రామములోనున్న సవరలందరూ పైని చెప్పిన ఆ గ్రామ అధికారులకు లొంగి ఉంటారు

ఈ గొమాంగ్, బుయ్యాలకు అధికారం వంశపారపర్యంగా వస్తున్నది, మనవారికి కరణీకం వస్తున్నట్లు. సాధారణంగా పెద్ద కొడుకే అధికారంలోకి వస్తాడు. వాడు ఒకవేళ చేతకాని వాడయితే తర్వాతవాడికి ఆ అధికారం వస్తుంది. ఇటువంటి విషయాలను గ్రామ పెద్దలు నిర్ణయిస్తూ ఉంటారు.

బుయ్యా అధికారంలోకి వచ్చేవాడికి తనహక్కే కాక పండుగలు, పూజలు చేయించే శక్తికూడా ఉండాలి. ఈ శక్తిలేని వాడికి హక్కు మాత్రమే ఉంటే వాడు పేరుకు మాత్రం అధికారంలో ఉండి పూజలు, పండుగలు తనతరపున యింకో బుయ్యా చేత చేయించే అధికారంకూడా ఉంది. ఒకగ్రామంలో బుయ్యాలన బడే బుయ్యావంశంవారు అనేకమంది ఉంటే ఉండవచ్చు. కాని అధికారంలో బుయ్యా ఒక్కడే ఉంటాడు. వాడిని ''సాడిబుయ్యా'' అంటారు. 'సాడిబుయ్యా' అంటే ఏమిటో యిక్కడ వివరించి చెప్పాలి.

ఏజెన్సీలో గవర్నరు ప్రతినిధిగా జిల్లా కలెక్టరు సంవత్సరానికి ఒకసారి సవరపల్లెకు కేంద్రంగాఉండే ఒక పెద్దపల్లెలో ఒక పెద్ద సభను ఏర్పరచి అక్కడికి అన్నిగ్రామాల సవరలను, వారిలో ముఖ్యంగా బుయ్యాలను, గోమాంగ్‌లను రావలసినదని ముందుగా బిసోయుల ద్వారా కబురు పంపుతాడు. బిసోయుల ప్రభుత్వ ప్రతినిధులుగా ఒక్కొక్క సవరమండలానికి ఒక్కొక్కడు ఉంటాడు. ఆ వార్షిక సభలలో వారసత్వంగల బుయ్యాలకు గొమాంగ్‌లకు 'సాడీ' అను పేరను కొత్తబట్టలను యిస్తారు.

సాడీబుయ్యా తరపున పూజలు, పండుగలు చేయించే బుయ్యాను 'పుర్–పుర్ బుయ్యా' అంటారు. 'పుర్–పుర్' అంటే

పండుగలు పూజలు, కర్మలు, చనిపోయినవారి ఆత్మలను పిలిచి మాట్లాడించడం మొదలయిన కార్యకలాపం అని అర్థం.

బుయ్యాలు, గొమాంగ్‌లు కాక గ్రామములో ఉన్న యితర సవరలను పరజాలంటారు. పరజాలంటే ప్రజలని అర్థం.

పరజాలకన్నా పై యిద్దరు హోదాలో గొప్పవారు గనుక 'బుయ్యా, గొమాంగ్' జాతులవారు పరజాలతో పెళ్ళి సంబంధాలు పెట్టుకోరు. తమలోతామె వియ్యమొందుతారు. కాని యిటీవల పరజాలలోని ఆడపిల్లల్ని పై జాతులవారి అబ్బాయిలకు యిచ్చి పెళ్లి చేయడం జరుగుతూ ఉన్నది అయినా వారి ఆడపిల్లల్ని పరజా అబ్బాయిలకు యివ్వరు.

ఈ పై మూడు జాతులవారికి వేర్వేరు శ్మశాన వాటికలు ఉంటాయి.

## పెళ్లిళ్లు

అనాది నుండి ఆదిమవాసులయిన ఈ సవరలలో కూడా పెళ్లి చేయడం అంటూ ఉంది. ప్రపంచంలో అనేక యితర తెగల వారు భావిస్తున్నట్టే సవరలు కూడా పెళ్లిచాలా ప్రవిత్ర మైనదని భావిస్తారు. వారి మతాచారాలను పాటిస్తూ పెళ్లిళ్లు చేసి విందులూ వినోదాలు చేసుకుంటారు.

రజస్వల అయిన తర్వాత పెళ్లి చేయడం, బాల్య వివాహాలు చేయడం రెండూ కూడా యీ నాటికీ వారిలో ఆచారమే. మన్యాల లో ఉండే సవరలు సాధారణముగా పెద్ద పిల్ల అయిన తర్వాతనే ఆడపిల్లకు పెళ్లి చేస్తారు. హిందువుతో పరిచయం ఉన్న సవరల లోనే బాల్య వివాహాలు చేయడం కలదు. సవరల పురాణ కథలను బట్టీ, వాళ్ల అనువాయితులనుబట్టి చూస్తే బాల్య వివాహాలు వారిలో లేనట్టె కనబడుతుంది.

తమ కొడుకులకు తగిన పిల్లలను చూసి పెళ్లి చేయడం తల్లి తండ్రుల విధి. కొడుకులు చిన్నవాళ్లు అయితే తల్లి దండ్రులే సంబంధాలు చూస్తారు. యువకుడైతే తగిన పిల్లను వాడే చూసు కుంటాడు. తను నిశ్చయించుకున్న పిల్లను తన తల్లి తండ్రులు కాదనరనే నమ్మకం తనకుంటే వాళ్లకు తెలియ జేస్తాడు. తర్వాత తంతు అంతా వాళ్లే చూసుకుంటారు. అటువంటి నమ్మకం లేక పోతే తను నిశ్చయించుకున్న పిల్లను తీసుకుపోయి వేరే కాపుర ముంటాడు. తర్వాత తప్పని సరిగా వాళ్లిద్దరకు పెళ్లి జరుగుతుంది.

సవరలలో రాక్షస వివాహం అంటే బలవంతముగా పిల్లను తీసుకు పోయి పెళ్లి చేసుకొనడం ఒకప్పుడు ఆచారంగా ఉండేదని కొందరంటారు. ఆడ పిల్లవారికి యివ్వవలసిన కానుకలు యివ్వ లేని వాడు, తనకు నచ్చిన పిల్లను బలవంతాన తీసుకు పోతాడు. ఆపిల్లకు వాడునచ్చితే వాడితో కూడ ఉంటుంది. లేకపోతే తిరిగి తన యింటికి పారిపోతుంది. ఈ విధంగా మూడుసార్లు వాడు తీసుకువెళ్తాడు. అప్పటికి ఆ పిల్లవాడితో ఉండకపోతే విడిచి పెట్టే స్తాడు. ఈ ఆచారం కోయవారిలో కూడా ఉంది. మనపురాణాలలో చెప్పే యీ రాక్షస వివాహం యీ సవరల ఆచారమే అయుండ వచ్చును.

తాను వలచిన పిల్లను తల్లితండ్రులు అంగీకరించ నప్పుడూ, ఆడపిల్ల వారికి యివ్వవలసినది యివ్వలేనప్పుడూ సవరయువకుడు పిల్లను ఎత్తుకుపోయి పెళ్లి చేసుకొనడం జరుగుతూ ఉంటుంది. అయినా ఆడపిల్లవారు అంతటితో ఊరు కొనరు. వారికి రావలసి నది యివ్వమని పెళ్లి కొడుకును అడుగుతారు. వాడు ఇవ్వకపోతే అది నేరం కింద వస్తుంది. వాడు ఇచ్చేస్తే మరినేరం ఉండదు. కొంతకాలం వరకూ యీ నూతన దంపతులు ఎవరికీ కనబడ కుండా ఎక్కడో ఉంటే తర్వాత పెళ్లికొడుకు ఎవరికీ ఏమీ ఇవ్వ నవసరము లేదు. బలవంతముగా పిల్లని ఎత్తుకుని పోయి పెళ్లి చేసు కొనడము సాహస కృత్యముగానే సవరలు చెప్పుకుంటారు. గాని సాధారణముగా చేసుకున్న పెళ్ళికన్నా తక్కువగానేచూస్తారు.

యువతీ యువకులు పెళ్ళిచెసుకునేముందు కొన్నాళ్లుఒకర్ని ఒకరు ప్రేమించు కొనడం జరూగుతుంది. ఒకర్ని ఒకరు కలుసు కొన డానికి, ఒకరి ప్రేమను ఒకరితొ చెప్పుకొన డనికి వాళ్లకు చాలా అవకాశాలు ఉన్నాయి. వీటివంటి వారైన ముండా కోదు జాతుల వారిలో ఒక ఏర్పాటు ఉంది. పెళ్లికాని యువకులకు ఒక ఇల్లు యువతులకు ఒక ఇల్లు ఉంటాయి. వాళ్లూ, వీళ్లూ ఎవరికి నచ్చినవార్ని వారూ ఎన్నుకుంటూ ఉంటారు. కాని యిటువంటి ఏర్పాటు గాని ఆచారం గాని సవరలలో లేదు. అందుకు ఒక కారణమున్నది. ఒక్కొక్క కుటుంబము వారు ఒక్కొక్కచోట యిండ్లు కట్టుకునుటచేత వారునివసించె పల్లె అంతా ఒకే కుటుంబమునకు చెందిన వారిదిగానే పరిణమిస్తుంది. అందు చేత ఒక గ్రామములో ఉండే సవరలు అందరూ ఒకతండ్రి వంశపు పిల్లలనే భావం సవరలలో ఉన్నది. అందువలన ఒక తరం యువతీయువకులు సోదరిసోదరులు కనుక వాళ్లలోవాళ్లలో

పెళ్లి చేసుకోకూడదు. మనలో సగోత్రము వారు పెళ్లి చేసుకో కూడదన్న నియమము వంటిది యిది.

వేర్వేరు గ్రామములలోని యువతీ యువకులు తరచుగా కొండలమీదడవులలో రహస్యంగా కలుసుకుని మాట్లాడుకొనే అవకాశాలు ఉన్నవి. కర్రలూ మొదలయినవి పట్నాలకు, పల్లెలకు తీసుకొనిపోయి అమ్ముకొని తిరిగి యింటికి వస్తున్నప్పుడు ఈ యువతీ యువకులు సరదాగా నవ్వుతూ కేరుతూ వస్తారు. అటువంటి సమయములలో ఒకరితో ఒకరు హాస్యాలు ఆడుతూ పరిచయము చేసుకొని ప్రేమించుకొనడము జరుగుతుంది.

పెళ్ళికాకముందే యువతీ యువకులు ఒకరితో ఒకరు కలియడం సవరలలో పెద్ద తప్పుకాదు. ఒకసారి ఒక అమ్మాయిని ఒకడు కలిశాడంటే ఆ అమ్మాయిని వాడు తప్పక పెళ్ళి చేసుకుంటాడు. ఒకవేళ కన్నతండ్రి పుట్టిన వాడ్ని ఆదరించకపోతే వాడికి తండ్రి ఆస్తిమీద హక్కు ఉండదు. అయినా యితరులు ఆ పిల్లవాడిని నీచంగా చూడరు.

ఏ జాతికి చెందిన సవరలు ఆ జాతివారినే పెళ్ళి చేసుకొనవలెనన్న నియమము వారిలో ఉంది. ఒకే జాతికి చెందినవారే అయినా ఒకే ప్రాంతమువారు అయుండవలెనన్న నియమము వారిలో ఉంది. శ్రీకాకుళం జిల్లా ఏజెన్సీకి చెందిన సవరలు వారి జాతికి చెందిన వారే అయినా గంజాం జిల్లా ఏజెన్సీకి చెందిన వారితో పెళ్ళిళ్ళు తలపెట్టరు. గవర్నమెంటు ప్రతినిధి అయిన ఒక బిసోయి అధికారంలో ఉన్న ఒక ముఠా సవరలు యింకొక బిసోయి అధికారంలో ఉన్న సవరలతో పెళ్ళి సంబంధాలు పెట్టుకోరు. ఒరిస్సా రాష్ట్రమేర్పడిన తర్వాత ఒక మైలు దూరంలో నున్న రెండు సవర గ్రామాలు వేరువేరు పాలనలోకి వచ్చాయి. అంతకు ముందు ఆ గ్రామాల మధ్య పెళ్ళి సంబంధాలు ఉండేవి. కాని తరవాత మానుకున్నారు వారు.

ఏ వావివరుసలు ఉన్నవారుఅయినా పెళ్ళిచేసుకొనవచ్చును, కొన కూడదు అన్న నిర్ణయం యీ సవరలలో లేదు. ఇతర గ్రాములోని పిల్ల అయుండవలెను అనే నియమము ఉండడము వలన వావివరుసలప్రసక్తివారిలోకలుగదు ముండా,ఖొందు జాతుల వారిలో రక్త సంబంధాలను బట్టి వావి వరుసలు ఏర్పడినవి. గంజాం జిల్లా, శ్రీకాకుళం జిల్లాలలో సవరలలో వావి వరుసల ప్రసక్తి లేదు గాని ఛట్టిస్‌ఘర్, సంబల్‌పూర్ ప్రాంతాలలోని సవరలలో వావి వరుసలు ఏర్పడినాయి. గంజాం జిల్లా, శ్రీకాకుళం జిల్లాల సవరలలో ఒకే గ్రామములోనివారు అన్నా చెల్లెళ్ళతో సమానమని ఆడవారు, మగవారుకూడ భావించడం సంప్రదాయ సిద్ధంగా వస్తున్నది. ఈ సంప్రదాయాన్ని దూరపు మన్యాలలో ఉన్న జాదు సవరలు నేటికీ గట్టిగా పాటిస్తున్నారు మొన్నమొన్నటివరకు యితరప్రాంతాలవారు కూడా కట్టుదిట్టంగానే ఉండేవారట. కాని యిటీవల ఈ కట్టుదిట్టం సడలిపోతున్నది. పై గ్రామంనుండి వారి గ్రామానికి వలసవచ్చి నివాసం ఏర్పరచుకున్న వారిపిల్లలను వీరు చేసుకొనడం మొదలు పెట్టారు. అందుకు తగిన కారణం లేకపోలేదు. ఒక గ్రామంలోని వారు యింకొక గ్రామము వచ్చినంతమాత్రాన ఒకే వంశంవారు కాలేరుగదా? వేర్వేరు పితృవంశంవారి సంతతులు సోదరీసోదరులు కాలేరుగదా? అయినా అలా ఒకే గ్రామంలోని యువతీ యువకులు పెళ్లి చేసుకుంటే అది సంప్రదాయ విరుద్ధమని పెళ్లికొడుక్కు జరిమానా వేస్తారు. ఒకపోతును గాని, మేకనుగాని, పందినిగాని, దేవతలకు బలిగా యివ్వాలి పెళ్లికొడుకు. గ్రామస్థులందరకు కల్లు సారాయి యివ్వాలి.

ఒక గ్రామంవారు యింకో గ్రామానికి వలస పోవడం యిప్పుడు ఎక్కువగా జరుగుతూ ఉండటంచేత ఒకే గ్రామంలోని వారు పెళ్లిళ్లు తలపెట్టితే ఊరిపెద్దల అనుమతి పొందాలన్న నియమము యిప్పుడు ఏర్పడింది. ఎవరెవరికి పెళ్లిళ్లు జరుగవచ్చునో, ఎవరెవరికి జరుగకూడదో నిర్ణయించడానికి వారిలోవారు కొన్ని కట్టుదిట్టాలు ఏర్పరచుకుంటున్నారు. ఒకే గ్రామములో ఉన్న గోమాంగ్,బుయ్యాల కుటుంబాల వారితోనే సంబంధాలు ఏర్పరచుకొనవలెను. కొత్తకొత్త కట్టుదిట్టాలు ఏర్పడినా అవికూడా సడలిపోతున్నవి. పెళ్లికొడుకు పెద్దలు నిర్ణయించిన ప్రకారము జరిమానాలు చెల్లిస్తూనే ఉన్నారు.



# నివాళి

శ్రీ బులుసు-జీ-ప్రకాష్

స్వంతలాభము కొంతమానుమని
తోడివారికి తోడు పడుమని
పరుల కలిమికి పొర్లవద్దని
ఐకమత్యమె నాకమగునని
నీతి చెప్పిన కవియతికి
నా నమోవాకములు!

ప్రతి మనిషిలోనూ దేవుడుండగ
ప్రతిమ జూచీ మ్రొక్కు-టేలని
ప్రత్యణువునందూ దైవరూపము
ప్రత్యక్ష మగును చూచుకొనుమని
నీతి గరపిన కవియతికి
నా నమోవాకములు!

కన్న కూతురు చిన్నపూర్ణను
ముసలివానీ మెడకు గట్టితె
విందు ప్రాణాల్ మండగలవని
మెచ్చుతునకగ పూర్ణగాథలో
హెచ్చరించిన కవియతికి
నా నమోవాకములు!

ఇతర కన్యల వెతల బెట్టక
రాజసంతో రాజునంటూ
మోజుపడితే మోసమే సుమ
పరస్త్రీలను చెరప బోకని
నీతి చెప్పిన కవియతికి
నా నమోవాకములు!

మాలలంటూ వేరు కులములు
కలవనుట కడు తెలివిలేమియె!
మలిన వృత్తులు మాలలౌదుర?
మలిన చిత్తులె మాలవారని
నిర్ణయించిన ప్రపూర్ణునకు
ప్రణుతి సహస్రములు!

కుండలోని ఉప్పు కుండనే తినునట్లు
నీవు తిన్నకూడు నిన్నె తినును
"అన్న" మన్న మాట కర్థమే అంతరా!
జనను తాంతరంగ! వినుర రంగ!

—"కృష్ణశతశతి"

# రాష్ట్ర వ్యాప్తంగా ప్రణాళికా వారోత్సవాలు

పంచవర్ష ప్రణాళికల ప్రచారానికై ప్రతి సంవత్సరం ప్రణాళికా వారోత్సవాలను జరుపుతున్నారు. ప్రణాళిక ఆదర్శాలను ప్రజల తక్షణ అవసరాలతో సమన్వయపరిచి చూపించి ప్రణాళిక పట్ల వ్యక్తిగతంగానూ, సామూహికంగానూ ప్రజోత్సాహాన్ని పెంపొందించటం ఈ ఉత్సవాల లక్ష్యం.

ఈ ఏడాది ఈ ఉత్సవాలు 1961 నవంబరు 1వ తేదీ నుంచి 1961 డిశంబరు 7వ తేదీ వరకు వివిధ జిల్లాలలో దిగువ కార్యక్రమం ప్రకారం జరిగాయి. (1) హైద్రాబాదు, నిజామాబాదు, మెదక్, నల్గొండ జిల్లాలు— నవంబరు 1వ తేదీనుంచి 7వ తేదీ వరకు. (2) వరంగల్, కరీంనగర్, ఆదిలాబాదు, ఖమ్మం— నవంబరు 8 నుంచి 14. (3) మహబూబ్‌నగరం, కర్నూలు, అనంతపురం, కడప— నవంబరు 16 నుంచి 22. (4) చిత్తూరు, నెల్లూరు, గుంటూరు, కృష్ణ— నవంబరు 23 నుంచి 29. (5) పశ్చిమగోదావరి తూర్పుగోదావరి విశాఖపట్నం, శ్రీకాకుళం— నవంబరు 30 నుంచి డిశంబరు 7.

ముఖ్యమంత్రి శ్రీ దామోదరం సంజీవయ్య నవంబరు మొదటి తేదీన రాష్ట్ర రాజధానిలో ప్రణాళికా వారోత్సవాలకు ప్రారంభోత్సవం చేశారు. అదేరోజున ఆంధ్రప్రదేశ్ అవతరణ అయిదవ వార్షికోత్సవం, పంచాయతీరాజ్య ద్వితీయ వార్షికోత్సవాలు కూడా జరిగాయి ప్రణాళికా, సమాచార శాఖల మంత్రి శ్రీపిడతల రంగారెడ్డి అధ్యక్షత వహించారు.

ఈ సందర్భంలో రాష్ట్ర సమాచార శాఖ నిర్మించిన "స్వాతంత్ర్య వికాసం" అనే డాక్యుమెంటరీ చిత్రాన్ని ప్రదర్శించారు. ఇది ఆనాటి కార్యక్రమ ముఖ్యాంశం. ప్రజాస్వామిక వికేంద్రీకరణ పథకం నిర్వహణ ఈ చిత్రంలో చిత్రీకరించబడింది

వచ్చే ఆరు మాసాల్లో ఆదర్శ గ్రామంగా అభివృద్ధి పరచటానికై రాష్ట్రమంత్రులు తమకు ఇష్టమైన ఒక్కొక్క గ్రామాన్ని ఎన్నుకోటం ఆ నాటి కార్యక్రమంలో మరో నూతనాంశం.

జిల్లా ప్రాంతాలలో ఈ ఉత్సవాలకు సంబంధించిన ముఖ్య వార్తలు దిగువ ఇవ్వబడినాయి:

అనంతపురం

1961 నవంబరు 17వ తేదీన అనంతపురంలో జిల్లాకలెక్టరు ప్రణాళికా వారోత్సవాన్ని ప్రారంభించారు. ప్రణాళికా సందేశాన్ని దేశమంతటా గ్రామ గ్రామంలోనూ, వాడ వాడలోనూ ప్రజలకు అందజేయవలసిన అగత్యాన్ని ఆయన ఆ సందర్భంలో నొక్కి చెప్పారు.

ప్రభుత్వ ఆర్ట్సు కళాశాలలో ప్రణాళికపై గోష్ఠి జరిగింది. ప్రణాళికా గోష్ఠివారు సమాచారశాఖ జిల్లా విభాగం సహకారంతో కళాశాలలో ప్రదర్శనాన్ని ఏర్పాటు చేశారు.

గుంటూరు

ప్రభుత్వ కళాశాలలో జరిగిన ప్రణాళికోత్సవాలకు అధ్యక్షత వహిస్తూ, ప్రణాళికా లక్ష్యాల సాధనకై తీవ్రంగా పరిశ్రమించవలసిందిగా జిల్లా కలెక్టరు ప్రజలకు విజ్ఞప్తి చేశారు. స్వయంకృషి ద్వారానూ, పంచాయతీసమితి సహకారంతోనూ తమ గ్రామాలను అభివృద్ధి చేసుకోటానికి ప్రజలు దీక్షాసక్తులతో ముందుకు వస్తున్నారని పరిషత్తు అధ్యక్షులు శ్రీ ఎం. నాగేశ్వరరావు అన్నారు. ఈ సందర్భంగా కళాశాల, ఉన్నత పాఠశాలల విద్యార్థులకు జరిగిన వక్తృత్వ పోటీలలో గెలుపొందిన వారికి బహుమతులు పంచిపెట్టారు. ఎక్కువ మార్కులు పొందినందుకు పంగం జాగర్లమూడి, దాచేపల్లి జిల్లా పరిషత్తు ఉన్నత పాఠశాలలకు రోలింగ్ షీల్డులు బహూకరించారు

నూజివీడు

బ్లాకు అంతటా నవంబరు 23 నుంచి 29 వరకు ప్రణాళికా సప్తాహం జరిగింది. బ్లాకు కేంద్రంలో ఎలిమెంటరీ పాఠశాల విద్యార్థులకు ఆటల పోటీలు జరిగాయి. ఉన్నత పాఠశాల,

మాధ్యమిక పాఠశాలల విద్యార్థులకు వక్తృత్వ పోటీలు కూడా జరిగాయి. వివిధ పోటీలలో గెలుపొందిన వారికి సుమారు 186 బహుమతులు పంచిపెట్టారు

**లయోలా కళాశాలలో ప్రణాళికా సదస్సు**

ఆంధ్ర లయోలా కళాశాల ప్రణాళికా గోష్ఠి అధ్వర్యంలో ప్రణాళికా సప్తాహం సందర్భంగా నవంబరు 2 వ తేదీన తృతీయ ప్రణాళికపై గోష్ఠి జరిగింది. మొదటి రెండు ప్రణాళికలు సాధించిన విజయాలనూ, తృతీయప్రణాళికా లక్ష్యాలనూ గురించి విద్యార్థులు వ్యాసాలు చదివారు.

**మహబూబ్‌నగరం**

1961 నవంబరు 16 నుంచి మూడు రోజులపాటు ప్రణాళికా వారోత్సవాలు జరిగాయి. శాసనమండలి సభ్యులు, జిల్లాపరిషత్తు అధ్యక్షులు అయిన శ్రీ కె. రామచంద్రారెడ్డి ప్రారంభోత్సవం చేశారు. ప్రతి కుటుంబానికీ ఒక ప్రణాళికను రూపొందించుకొన వలసిన అవసరాన్ని ఆయన నొక్కి చెప్పారు. గత రెండు ప్రణాళికలలోనూ జరిగిన అభివృద్ధిని పేర్కొంటూ ప్రణాళికకు పూర్వం జిల్లాలో నాలుగు ఉన్నత పాఠశాలలు మాత్రమే ఉండగా ఈనాడు 106 ఉన్నతపాఠశాలలు, 2 పాలీటెక్నిక్‌లు, ఒక ఆర్ట్స్, సైన్స్ కళాశాల ఏర్పడినవని అన్నారు.

**నల్గొండ**

జిల్లాలో నవంబరు 1వ తేదీనుంచి ప్రణాళికా వారోత్సవాలు భారీ ఎత్తున జరిగాయి. జిల్లా కేంద్రంలో మూడు రోజులపాటు ఉత్సవాలను నిర్వహించారు. నవంబరు మొదటితేదీన జిల్లాకలెక్టరు ద్వితీయ ప్రణాళికా కాలంలో జిల్లాలో జరిగిన అభివృద్ధిని గురించి వివరిస్తూ మూసీ, వేములూరు, భీమనపల్లి ప్రాజెక్టులు ఈ కాలంలోనే పూర్తయ్యాయన్నారు. 22 గ్రామాలకు విద్యుత్ సౌకర్యాలను విస్తరింపజేయడానికి లక్ష్యంగా పెట్టుకొనగా 61 గ్రామాలకు ఈ సదుపాయాలను కలుగజేయటం జరిగింది మూసీ ప్రాజెక్టు క్రింద 15,000 ఎకరాలను అభివృద్ధి చేయడమైనది.

ప్రణాళికా సప్తాహం సందర్భంలో ఏర్పాటుచేసిన ప్రదర్శనాన్ని 20,000 మంది సందర్శించారు

**శ్రీకాకుళం**

జిల్లా కలెక్టరు నవంబరు 30వ తేదీన ఉత్సవాలను ప్రారంభించారు డిశంబరు మొదటి తేదీన పాఠశాలలు, కళాశాలలు ఉత్సవాలను నిర్వహించారు. రెండవ తేదీన ప్రజా సహకార దినం జరిపారు.

**వరంగలు**

జిల్లా కలెక్టరు నవంబరు 9వ తేదీన వరంగల్‌లో ప్రణాళికా సప్తాహాన్ని ప్రారంభించారు ప్రణాళికకు విస్తృతంగా ప్రచారం ఇవ్వవలసిన అవసరాన్ని ఆయన వివరించారు ప్రజల్లో ప్రణాళికా చైతన్యం కల్గించడమే ప్రణాళికా వారోత్సవాల ధ్యేయమని ఆయన అన్నారు శాసన సభ్యులు, జిల్లాపరిషత్తు అధ్యక్షులు అయిన శ్రీ ఇ. వెంకటరామయ్య మాట్లాడుతూ, అభివృద్ధి ప్రణాళికలను గురించి తెలుసుకోటానికీ, ప్రణాళికా విజయాలను గ్రహించటానికీ ఈ సప్తాహం తోడ్పడ గలుగుతుందని అన్నారు.

**ఏలూరు**

సి. ఆర్. రెడ్డి కళాశాలలో డిశంబరు 1 వ తేదీన కళాశాల విద్యార్థులకు వ్యాసరచన, వక్తృత్వ పోటీలు జరిగాయి. ప్రణాళికా ప్రాముఖ్యతపై కళాశాల తరగతులలో ప్రసంగాలు జరిగాయి. చర్చలలో అధ్యాపకులు, విద్యార్థులు పాల్గొన్నారు



# సంక్రాంతిలక్ష్మి

శ్రీ శనగన నరసింహస్వామి

హేమంతము, మధువేళా
సామంతము, తుహిన బిందు సంలసదవనీ
సీమంతము, శైత్యజయ
శ్రీమంతము వచ్చె సకల జీవిప్రియమై.

కుంతలవీధి కందుఱము క్రొవ్విరిబంతులు సౌరభోర్మికా
సంతతి వీచుచుంబవన సారణి నింప, హిమావ గుంతనా
క్రాంతతనూ విలాస విసరమ్ములు చిమ్ముచు నేగుదెంచె హే
మంతము, మెట్టినిల్లు చను మానిని వోలె నమందయానయై.

దహనుండిప్పుడు బంధువై ముదము సంధానించె, చంద్రుంబలెన్
ప్రహితుండయ్యెను భాస్కరుండు, ద్వీపటీ వారంబపారంబుగా
బహుమానంబును బొందె, నుష్ణకర సంభారైక సంపాదనా
సహితంబయ్యె వడంకె లోకము, మహాశైత్యారి సంభీతమై.

మంచుమల మీది శైత్యము నించుకొన్న
పవనములు వీచె దక్షిణాపథము నందు;
పంచబాణము లావల పాఱవైచి
చెఱకు విల్లందు కొనియెను చిత్తభవుడు.

హాయనమునకు భూషణ ప్రాయమైన
శీతకాలోదయమునందు క్షేత్రలక్ష్మి

శాలిముఖలోక మోహన సస్యసుఫల
సంతతుల నెత్తి పచ్చిబాలెంత యయ్యె.

స్వేదజలంబు తోడి మొలిపించిన సస్యము హేమవల్లరీ
సోదరమయ్యె నేడనుచు జొక్కుచు నూర్చి, స్వగేహిపీకటా
క్షోదర వీక్షణామృతము లానుచు, వీనుల తన్మృదూక్తులం
జేదుచు, గాదె బోసిరి కృషీవలులెల్లెడ శాలిధాన్యముల్.

బారులుగట్టి మింట నసివారుగ నేగు ఖగంబు లొక్కకే
దారసమీప ఖల్యగని ధారుణికిండిగి గింజ గింజగా
కేరుచు సంగ్రహించి యెలుగింపగ; తత్సముదంచితస్వర
శ్రీరమ మాణలై జనపచేల తలెత్తిరి కాపు చేడియల్.

శాంతి లభించె దేశమున సౌఖ్యము నిండెను సంతతక్షుధా
చింతనులైన పేదలకు చిత్తము లించుక నేదదేరెన
న్నంత పథిస్థయాచక సహస్రము చూపుల ద్రాగ వచ్చె సం
క్రాంతి, సుగీతవేషణ ధురంధరుడై హరిదాసు కొల్వగన్.

భుజమ్ముపై నాగేలు పూని వారణరీతి
చనునాడు బలరామచారుమూర్తి;
కోలకేలంగొని కుప్పనూర్పుల యందు
బంతి త్రిమ్మరునాడు పాలికాపు:
పంటకళ్లంబులో బత్రాజు నుతులకు
గ్రాస మిచ్చిన నాడు కర్ణరాజు:
నిజతపఃఫల ధాన్యనిధులు దేశార్థము
ధారవోసిననాడు తబిసి తేడు;

పుత్ర పౌత్రాభివృద్ధితో పొదలువాడు
కర్షకుడు, తృప్తమూర్తి, ప్రహర్షణుండు
స్వాగతము పల్కుచుండగ సంక్రమించె
కాంత హేమంతమందు సంక్రాంతిలక్ష్మి.

ముసలివానికి మీసములు త్రిప్పగల వీర
చారిత్రములు పాడు జంగమయ్య;
జడము లందును భక్తిపొడమి పొంగగ హరి
గానమ్ము సేయు సాతానిదాసు:
పసరంబునకు నాటపసదెల్పు సన్నాయి
విద్దెనేర్చిన గంగిరెద్దువాడు:
విషసర్పమును రసవివశంబుగా రమ్య
నాగస్వరము బట్టు భోగిజీవి:

గడప గడపకు తామెయ్యై కానిపించి
యెచటి కేగిన తామెయ్యై యెదురు వచ్చి,
రర్థిజనముల పాలిటి కాంధ్ర వనరు
హాళు లెల్లరు శ్రీవిశాలాక్షులైరి.

తొలికోడి కూసిన దుప్పటి తలయెత్తి
కనుగొన రాత్రి సగంబు మిగిలె,
మఱల నిద్రింపగా మాటికి చీటికి
పలురకంబుల పీడకలలు కలచె,
మలికోడి కూసిన మంచమ్ము దిగబోవ
కసి తీర చలి యంగకములు కొఱికె,
భోగిమంటల చుట్టు జాగార మొనరింప
తత్కాల శీతబాధలు శమించె.

వెఱచి బీరెండ కోసమై పఱువు లిడిన
నచ్చటచ్చట వేలపు నట్లుదోచె
నచ్చసీతు ప్రవేశించి మచ్చరించు
భోగి నాడిట్లు వేగెను వేగు బోక.

మనసిభవుండు భోగిచలిమంటల చుట్టును పుష్పచాపశిం
జిని రవళించుచుందిరిగె సిద్ధమనో రథుడై, వియోగినీ
జనములు దీర్ఘయామినుల జార్చిన లోచన బాష్పవారి వీ
చెను పవనంబనంగ మెఱసెం దృణలగ్న తుషార బిందువుల్

అరుణ సరోరుహాక్షి సమదారుణ దృష్టులు, పుండరీక సుం
దరధవళాయతాక్షి తెలినవ్వుల చూపులు, మేచకోత్పల
స్ఫురదురునేత్ర నీలిజిగి చూడ్కులు గూడి త్రివర్ణ శోభలం
గురియుచు నున్నముగ్గు లవిగో! భవనాంగణ శుభ్రసీమలన్.

ప్రతిగృహాంగణమందు ప్రతిఫలించెను రంగ
వల్లికా వల్లరీ తల్లజములు,
వీధి వీధుల కాంతి వీచెను గొబ్బిళ్ల
సిగలనై తుఱిమిన చిన్నిపువ్వు.
లాబాలగోపాల మవధరించిన నూత
నాంబరంబుల డంబరంబు మీఱె,
పిండి వంటల తావి పేర్మి యెల్లరకును
నాసాపుటద్వ యీ గ్రాసమయ్యె.

క్రొత్త యల్లుండ్ర రాకల గుత్తగొన్న
శ్వశురగృహముల బొడసూపె జవ్వనమ్ము.
నిత్య సంసార యాత్రావినిద్రమూర్తు
లైన గృహమేధులకు సుఖమబ్బె గొంత.

బావయు మఱదలు మాటికి
గావించు పరిహాసంపు కమ్మని నవ్వుం
బూవుల నెత్తావులు శ్వశు
రావాసము నిండి స్వర్గమని పించెనహో!

క్రొత్త వరిగింజ మేతతో క్రొవ్వుకొన్న.
కోడిపుంజులు కొక్కొరో కో యటంచు
కాలుదువ్వి ప్రాణిద్యూత కదనమందు
కూసె సంక్రాంతి దినమున గుతపవేళ

దక్షిణాదిగ్ మృగాక్షిని దగ్గఱించి
మూడు ఋతువులు పాలించి ముదమునించి,
ఉత్తరాశా విశాలాక్షి నుద్వహింప
బోయె సూర్యుడు దక్షిణ నాయకుండు. * *

ఆంధ్ర ప్రదేశ్

# పంచాయతీరాజ్య పురోగమనం

## శ్రమదానం ద్వారా రీడింగ్ రూమ్ నిర్మాణ

కొండపి పంచాయతీ సమితిలోని కె. బిట్రగుంట యువక మండలి ఆధ్వర్యాన పూర్తిగా శ్రమదానం ద్వారా రీడింగ్ రూమ్ నిర్మాణం జరుగుతున్నది. నిర్మాణం పూర్తి కావచ్చింది వ్యయం అంచనా రూ. 2,000లు.

## రోడ్డు మరమ్మతులో గ్రామస్థుల స్వయంకృషి

ఖుదావంద్‌పూర్ నిజామాబాదు జిల్లా ఆర్మూరు బ్లాకులోని ఒక చిన్న గ్రామం. ఆ గ్రామ ప్రజల నిశ్చిత కృషి ఫలితంగా దాని స్వరూపమే పూర్తిగా మారిపోయింది వారు ఏడురోజులపాటు నిరంతరం పనిచేసి గ్రామ రోడ్లన్నిటినీ మరమ్మతు చేశారు. ప్రతి రోజూ సగటున 350 మంది పనిలో పాల్గొన్నారు.

## రామభద్రాపురం సమితి

శ్రీకాకుళంజిల్లా రామభద్రాపురం పంచాయతీసమితి రాక పోకలు, రవాణా సౌకర్యాల అభివృద్ధికి రూ. 1,22,000లనూ, నాల్గవ వంతు విరాళం ప్రాతిపదికపై పాఠశాల భవనాల నిర్మాణానికి మరో రూ. 49,000ల మొత్తాన్నీ మంజూరు చేసింది.

## సామూహిక వినోద కార్యక్రమాలు

పశ్చిమ గోదావరి జిల్లా ఆకివీడు పంచాయతీ సమితి 1961 అక్టోబరు నెలలో 17 సామూహిక వినోద కార్యక్రమాలను నిర్వహించింది.

## ఎరువు గుంటలు

మహబూబ్‌నగరం జిల్లా జడ్చర్ల సమితిలోని బూరుగుపల్లి, నిజలాపూర్ గ్రామాల రైతులు 1961 అక్టోబరు మాసంలో 278 ఎరువు గుంటలు త్రవ్వారు.

## తాలూకా ఆటల పోటీలు

నిజామాబాదు జిల్లా బాన్సువాడలో నవంబరు 26వ తేదీ నుంచి మూడు రోజులపాటు తాలూకా ఆటల పోటీలు జరిగాయి. సమితి ప్రాంతంలోని యువజనక్లబ్బులు, పాఠశాలలకుచెందిన 80 జట్టులు పోటీలలో పాల్గొన్నాయి. వీటి నిర్వహణకు సమితి ప్రజల నుంచి రూ 2,000ల మొత్తం సేకరించారు.

## శ్రమదానం ద్వారా ఆనకట్ట నిర్మాణం

సత్యనారాయణపురం ఖమ్మం జిల్లా మధిర సమితిలోని భూదాన గ్రామం. ఇటీవల ఈ గ్రామ ప్రజలు గ్రామ కాలువకు అడ్డంగా చిన్న ఆనకట్ట నిర్మించారు. ఈ పనిని పూర్తిగా శ్రమదానం ద్వారా నిర్వహించారు. దీనివల్ల 50 ఎకరాల భూమికి నీరు లభిస్తుంది.

## జిల్లా పశు ప్రదర్శనం

1961 నవంబరు నెలలో చేవెళ్ళలో హైదరాబాదు జిల్లా పశు ప్రదర్శనం జరిగింది. సుమారు 800 పశువులను ప్రదర్శించారు బ్లాకు ప్రజలు నగదు రూపంలో రు 300ల మొత్తాన్ని విరాళంగా ఇచ్చారు. అయిదుగురు ప్రముఖులు రూ. 500లు విలువ చేసే రోలింగ్ షీల్డులు బహూకరించారు.



# అవతరించని "నవల"

శ్రీ డి. రామలింగం

కీ॥ శే॥ గురజాడ అప్పారావుగారి అమృతలేఖిని నుండి తెలుగు పాఠకులకు లభించకుండా పోయింది నవల మాత్రమే. గొప్ప రచయిత లందరివలెనే అప్పారావుగారూ అనేక సాహితీ రూపాలలో తమ సృజనాత్మక ప్రతిభను ప్రదర్శించారు. ఛందోబద్ధమైన పద్యాలు రచించారు. గేయాలు వ్రాశారు. ఆధునిక రూపంలో నాటకాలు, కథానికలు వ్రాశారు. పరిశోధనవ్యాసాలు, సాహిత్య విమర్శలు రచించారు. కాని నవల మాత్రం వ్రాయలేదు. ఒకవేళ వ్రాసినా వారి అముద్రిత రచనలుకొన్ని పోయినట్లే అదికూడా పోయిందేమో! తెలియదు.

సాహితీ రూపాలలో నవలకుగల ప్రాచుర్యాన్ని, ప్రాబల్యాన్ని అప్పారావుగారు గ్రహించినట్లు అనేక ఆధారముల వల్ల మనకు తెలియవస్తున్నది. తామూ నవలలువ్రాసి ప్రచురించాలని ఆయన అనుకున్నారు. అందుకు ప్రణాళికకూడా సిద్ధంచేసుకున్నట్లు తెలుస్తూ వుంది. చారిత్రకములు, సాంఘికములైన నవలలు వ్రాయాలని వారి సంకల్పం. వ్రాతామని వారువేసుకున్న సాహిత్య ప్రణాళికలో "ఆధునిక జీవితమును అభివర్ణిస్తూ ఇంగ్లీషున నవలా రచన" అనివారు తమడైరీలో వ్రాసుకున్నారు. ఆంగ్లమున వారు వ్రాసిన ఈ నవలా ప్రణాళిక లభించినదని వారిరచనల సంకలనము చేసిన శ్రీ అవసరాల సూర్యారావు గారు తెలిపి వున్నారు.

అప్పారావు గారు బెంగుళూరులో ఒకానొక ఆంధ్ర ప్రముఖునితో సంభాషిస్తున్న సందర్భంలో "తెలుగులో కొన్ని చారిత్రక నాటకాలను, నవలలను వ్రాయ తలపెట్టాను. అందు కోసం ఎట్టి విప్రతి పత్తిలేని దక్షిణభారత చరిత్రనాకు అవసరం. సరియైన చారిత్రకఇతివృత్తం పథకమును నా నాటకాలలో నవలల్లో స్వీకరించాలని నా తలంపు" అని అన్నారు. కాని ఆ ఆంధ్ర ప్రముఖుడు కబుర్లతో కాలక్షేపం చేశాడుగాని గురజాడ వారడిగిన రికార్డులు లభింప జేయనేలేదుట!

దీనిని బట్టి అప్పారావు గారికి చారిత్రక నవలారచనపై దృష్టి వున్నట్లు విశదమవుతున్నది. అందుకు కొన్ని కారణాలు కూడా వున్నవి. ఆయన స్వయంగా చరిత్ర పరిశోధకులు. ఎన్నో శాసనాలు పరిశీలించారు. చారిత్రక ఘట్టాలను కనుగొన్నారు. సృజనాత్మక ప్రతిభగల రచయిత అట్టి ఘట్టాలను సద్వినియోగం చేయాలని ఉవ్విళ్ళూరుతాడు. దీనికితోడు అప్పారావుగారు దేశంలో వెలువడుతూవున్న చారిత్రక నవలలను, విదేశాలలో సర్ వాల్టర్ స్కాట్ మున్నగు రచయితలు వ్రాసిన వాటిని విమర్శనాదృష్టితో చదివారు. ముఖ్యంగా విజ్ఞాన చంద్రికా గ్రంథమండలివారు. ప్రచు

రించిన చారిత్రక నవలలను ఆయన ప్రతిపేరా, ప్రతివాక్యం నిశితదృష్టితో పరిశీలించారు. చారిత్రక నవలలు కదా అని చెప్పి ఆనాటి రచయితలు వాస్తవాలను విస్మరించి అలా స్వైర్య విహారం చేయడం ఆయనకు బొత్తిగా నచ్చలేదు. అప్పారావు గారు "మన చారిత్రక నవలలన్నీ యించుమించు ఇలాంటివే. ఈ నవలలు వ్రాసినవారిలో కొంతమందికి చారిత్రక నవలారచనకు కావలసిన విషయ పరిజ్ఞానంలేదు ఇంగ్లీషు సాహిత్యంతో వీరికి సంపర్కంలేదు. నవలల్లో వర్ణించిన చారిత్రక విషయాలు దేశంలో యెప్పుడూ జరగనివి." అన్నారు. అసలు ఆనాటి రచయితలకు చారిత్రక నవలారచనపై అంత మోజు ఎందుకో వారికి అర్థంకాలేదు. ఆధునిక సమాజంలోని సమస్యను ఇతివృత్తంగా తీసుకొని సాహిత్యరీతిలో దానిని మన రచయితలు చక్కగా ఎందుకు ఒప్పించలేరా అని ఆయన తరచు అనుకునేవారు కనుకనే ఒకసందర్భంలో "తెలుగు నవలా రచయితకు వర్తమాన కాలం తెరవరాని తాళంవేసిన ఒక గ్రంథం వంటి దాయె!" అన్నారు.

మన రచయితలు ఆంగ్లనవలల్లోని కథలకు అనుసరణములు వ్రాస్తూ అసంగతి ఎక్కడా ఒప్పుకోక పోవడం అప్పారావుగారికి బాధకలిగించింది. పోనీ అవైనా సరిగా వ్రాశారా అంటే ఆంగ్ల రచయితలకు గల కళావైదుష్యం వీరిలో యేకోశానా కన్పించదు. తెలుగు నవలారచయితలు మీదోస్టయిలరునూ బంకించంద్రుణ్ణి అనుసరించడం ఒక అంటువ్యాధిలా వ్యాపించిందని గురజాడ విమర్శించారు.

ప్రాచ్య పాశ్చాత్య నవలా సాహిత్యాన్ని గురజాడ సాకల్యంగా పరిశీలించారు జార్జి ఇలియట్‌ను గూర్చి, నావల్ ఎలిమెంట్ లిటరేచర్ గూర్చి వారు చదివినట్లు ఒకచోట వుంది. జార్జి ఇలియట్ జుగుప్సతో వివాహమనే భావాన్ని త్రోసిపుచ్చిన సంగతిని వారు ఒక విమర్శ సందర్భంగా ప్రస్తావించారు. అవ్ డాస్ రచించిన ఫ్రెసీవ్స్ అనే నవల చదివి "కథలో చెప్పిందే చెప్పడం.. మానసిక తత్వ నిరూపణ, విశ్లేషణ యేమీసహజంగా లేదు. ప్రేమించనా మానినా అనే వితర్కం విసుగుపుట్టించేట్టు సాగింది." అనుకున్నారు. వి యస్ ఆర్. గారు తన భార్యనుగూర్చి కథాత్మకరం అనే గ్రంథాన్ని, మరివొక నవలనూ రచించిన సంగతి గురజాడ వారికి తెలుసు. కందుకూరి వీరేశలింగం పంతులుగారి 'రాజశేఖర చరిత్ర' చదివిన పిమ్మట "ఇది గోల్డు స్మిత్ 'వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డు' అనేనవలకు అనుసరణ. ఇది బహుళ ప్రచారం పొందిన నవల. వీరేశలింగముగారి అనుసరణ చక్కగా వుంది" అని గురజాడ అభిప్రాయపడ్డారు. ఒకమారు బెంగుళూరు సెంట్రల్ కాలేజీలో ఇంగ్లీషు ప్రొఫెసర్ టెయిట్ గారితో సమకాలిక సాహిత్యం విషయం చర్చకు రాగా గ్రీకు, రోమన్ గ్రంథపఠనం వల్ల రినేజాన్స్ దినములలో యూరుపు ఖండంలోని దేశాలలో స్వదేశీయ సారస్వతవిజృంభణము ఒక్కమారు ప్రతిభావంతమైనది కదా, అట్లే ఆంగ్లేయుల ప్రసిద్ధ సారస్వత ప్రచారం వలన, విద్యా ప్రభావంవలన మనదేశభాషలలో చెప్పుకోదగ్గ ఫలితమేమీ కానరాకపోవడం వింతగాలేదా అని గురజాడ ప్రశ్నించారు. దాని మీదట వారిద్దరికీ (మళయాళ భాషలో వెలువడ్డ ఒక నవలను గూర్చి) చర్చ జరిగింది. అందులో "నవలా శైలిలోను, వస్తు నిర్వహణలోను యేమైనా సొగసువున్నదా? కళా చాతుర్యము వుట్టి పడుతున్నదా?" అని అప్పారావుగారు ప్రశ్నించారు. ఈ విధంగా యే సాహిత్యకునితో చర్చవచ్చినా ఆయన ఆయా భాషలలో నవల యే స్థితిలోవుంది అన్న విషయం తెలుసుకొన ఉత్సహించేవారు. తాము ఒక్కమంచి నవలవ్రాసి ఇదిగో ఈ నవల చూడండి ఎలావుందో అని దేశీయులతో అనవలెనన్న కోర్కె ఆయనకు బాగావుండేది. ఆయన వ్రాసిన కన్యాశుల్కం నాటకం మరీ పెద్దగా వుండడం చూచి అందులో అనేక అంకాలు యథార్థంగా కళ్ళకుకట్టినట్లు వుండడం గమనించి అదొక నవల కాదుగదా అని ఆరోజులలో కొందరు అనుకునేవారట. ప్రసిద్ధ విమర్శకులు పురాణం సూరిశాస్త్రిగారు కన్యాశుల్కంగూర్చి తమ అభిప్రాయం వ్రాస్తూ "చూడడానికి పెద్ద నవలవలె వుంటుందిగాని ఆడవచ్చేసరికి అనేకపోకడలు!" అని వ్రాశారు.

అప్పారావుగారే కనుక నవల వ్రాసి వుంటే అది చిరస్మరణీయమైన గ్రంథంగా వుండిపోయేది. అది ఒక వేళ చారిత్రక నవల అయినట్లయితే అనౌచిత్యాలకూ, అవాస్తవాలకూ దూరంగా వుండేది ఇంగ్లండులో సర్ వాల్టెర్‌స్కాట్ బెంగాలులో బంకిం చంద్రుడు, ఆంధ్రలో హిందూ మహాయుగ నవలాకారులు వారికి తెలిసో తెలియకో చేసిన పొరపాట్లను గురజాడ మెలకువగా తప్పించుకొని వుండేవారు. ఆ నవలవల్ల ఆ కాలపు చరితకే మెరుగు వచ్చేది. ఇక వారు సాంఘిక నవలే వ్రాసి వున్నట్లయితే సమకాలిక ఆంధ్ర సాంఘికజీవితం దానికి ప్రాతిపదికగా వుండేది. ఆజీవితం లోని వ్యక్తులు అందులో ప్రత్యక్ష మయ్యేవారు. సమాజానికి కనువిప్పు కలిగించి గుండెబాదుకో వలసినటువంటి సంఘటనలు సన్నివేశాలు అందులో ఉండేవి. బాల్జాక్ వలె గురజాడ కూడా నిర్భయంగా అసభ్యమూ, అప్రాచ్యమూ, అవ్యక్తములనబడే మన జీవితాలలోని తెరమరుగులు, కుంభకోణాలు, భాగోతాలు, తంతులు నాటకాలు, అంతర్నాటకాలకు కావ్యరూపమిచ్చి, తాము మడికట్టుకున్నామని చెప్పుకునే పెద్దమనుషుల చేతకూడా చదివించి వుండేవారు. అంతేకాదు టాల్‌స్టాయివలె ఆ పాత్రల జీవితాలకూ సాంఘిక పరిణామానికీ సంబంధమేమిటో విశదం చేసివుండేవారు. వాస్తవికత, భావనాబలం, కళ అన్నీ మేళకలయిక జెంది అది తెలుగు నవలా సాహిత్యానికే మణిదీపం వలె శాశ్వతంగా ప్రకాశించేది. ఆ అదృష్టానికి నోచుకోలేదు మనం మరి. * *

శ్రీ ఎం. శ్రీరామకృష్ణారావు, ధవళేశ్వరం, రాజమండ్రి తాలూకా.

ప్రశ్న: 204 రాజమండ్రి కాగితం మిల్లు అభివృద్ధి కార్యక్రమం క్రింద, ధవళేశ్వరం ప్రక్కనున్న కొండమీద ఇంకొక కాగితం మిల్లు కట్టుటకు ప్లానులు వేసినారు? ఆ కాగితంమిల్లు కార్యక్రమం నిజమా? వట్టిదా?

**సమాధానం ;** రాజమండ్రిలోని ఆంధ్ర కాగితం మిల్లు విస్తరణకు సంబంధించిన పథకాన్ని రెండవ పంచవర్ష ప్రణాళికలో చేర్చటం జరిగింది. ఈ పథకాన్ని మూడవ ప్రణాళికలో కూడా అమలుపరుస్తున్నారు. ఈ పథకం అంచనా వ్యయం రూ. 6 కోట్లు.

మిల్లుకొరకు ధవళేశ్వరం వద్ద నివేశన స్థలాన్ని ఎన్నిక చేశారు. భవన నిర్మాణ కార్యక్రమం త్వరలో ఆరంభ మవుతుంది. విస్తరణ పథకానికి అవసరమైన యంత్రసామగ్రి, ఇతర పరికరాల సరఫరాకై రాష్ట్ర ప్రభుత్వం గత అక్టోబరు 19వ తేదీన పారిస్‌లోని ఎంపసెల్ అండ్ కంపెనీ అనే సంస్థతో ఒప్పందంకుదుర్చుకుంది. యంత్ర పరికరాలు తదితర వస్తువుల సరఫరాఆరంభమైంది. 1962 సంవత్సరం మధ్యభాగం నాటికి వీటిని పూర్తిగా సరఫరా చేయటం జరుగుతుంది. భవన నిర్మాణం పూర్తై, యంత్రాలను అమర్చటం ముగిసి, అవసరమైన పరీక్షలన్నీ జరిగిన తరువాత 1963వ సంవత్సరం మధ్యభాగం నాటికి బహుశా కొత్త మిల్లులు ఉత్పత్తి ప్రారంభిస్తాయి.

# ప్రశ్నోత్తరావళి

శ్రీ పి. గోపాల కృష్ణమూర్తి, సిద్దీపేట, మెదక్ జిల్లా.

ప్రశ్న : 205 మన రాష్ట్రములోని ప్రభుత్వ కళాశాలలలో యు.జి.సి. స్కేలును ఎప్పటినుంచి అమలుపరిచెదరు? ఆ స్కేలు ఏ విధమ్ముగా ఉండును?

తెలంగాణాలో ప్రభుత్వమువారు స్వాధీనము చేసికొన్న కళాశాలల పూర్తి విలీనీకరణము (Regularisation) ఎప్పటిలోగా పూర్తియగును?

**సమా :** విశ్వవిద్యాలయ గ్రాంట్ల సంఘం సిఫార్సు చేసిన స్కేళ్ళను 1961 మార్చి 1వ తేదీ నుంచి అమలుపరచటానికి నిశ్చయించటం జరిగింది. ఈ స్కేళ్ళ వివరాలను ప్రభుత్వం పరిశీలిస్తున్నది.

తెలంగాణా ప్రాంతంలో ఇప్పటివరకు ఆరు ఎయిడెడ్ కళాశాలలను ప్రభుత్వం స్వాధీనం చేసుకున్నది. ఈ అన్ని కళాశాలల్లోనూ పనిచేస్తున్న సిబ్బంది సర్వీసులను ప్రభుత్వ సర్వీసుల్లో కలిపివేయటానికి కొంతకాలం పట్టవచ్చు.

శ్రీ కె. అప్పారావు, అనకాపల్లి, విశాఖపట్నం జిల్లా.

ప్రశ్న : 206 మన రాష్ట్ర ప్రభుత్వంవారు వికలాంగుల కొరకు హైదరాబాదులో ఒక ప్రత్యేక ఎంప్లాయ్‌మెంట్ ఎక్ఛేంజీని తెరుస్తున్నారా? తెలుప గోరెదను?

**సమా :** వికలాంగుల కొరకు స్థాపించదలచిన ప్రత్యేక ఉద్యోగ సాధక కేంద్రాన్ని భారత ప్రభుత్వ నుంచి ఆమోదం లభించిన తరువాత, రాష్ట్ర ప్రభుత్వం మంజూరు చేసిన పిమ్మట 1961–62 వ ఆర్థిక సంవత్సరంలో ఎప్పుడైనా హైద్రాబాదులోనెలకొల్పటంజరుగుతుంది.

రాష్ట్రంలోని ఏక్ఛేంజీలలో పేర్లు నమోదు చేయించుకున్న వికలాంగులకు ఈ ఎక్ఛేంజి సహాయకారి కాగలుగుతుంది. రాష్ట్రస్థాయిలో సహాయక చర్యలను సమన్వయపరచడానికి ఇది రాష్ట్రం ఎక్ఛేంజిగా పరిగణించబడుతుంది. ప్రస్తుతంవికలాంగులు తమ పేర్లను అన్ని ఏక్ఛేంజీలలోను రిజిస్టరు చేసుకోటం జరుగుతున్నది. ఒకేషనల్‌గైడెన్స్ సెక్షనుద్వారా వారికి సహాయం అందజేస్తున్నారు.

శ్రీ కె. వెంకటరామరెడ్డి, పైసంపల్లి (పోస్టు) (వయా) ఎర్రగుంట్ల, కడపజిల్లా.

ప్రశ్న: 207 స్టెయిన్‌లెస్‌స్టీల్ పాత్రలు తయారుచేయు ఒక చిన్నతరహా పరిశ్రమను నేను కడపలో స్థాపించదలచుకున్నాను. కాన మీరు నాకు ఆ పరిశ్రమ విషయమై కావలసిన సమాచారము, కావలసిన పెట్టుబడి, యంత్రములు, సాంకేతిక సహాయము మరి ఇంకేది అవసరమో ఆ విషయములు దయయుంచి వివరంగా తెల్పెదరని ఆశిస్తున్నాను.

సమా : ముడి సరుకు లభించటంలేదు కాబట్టి మీరు మరేదైనా పరిశ్రమను ప్రారంభించవచ్చు. ముడి సరుకుగా ఇత్తడి, రాగి మొదలైన ఖనిజముల అవసరమైన పరిశ్రమలను ప్రారంభించ వద్దని ప్రజలకు పత్రికా ప్రకటనద్వారా విజ్ఞప్తి చేయటంకూడా జరిగింది.

శ్రీ కె. కూర్మానందస్వామి, చిన్న బరతం వీధి,
శ్రీకాకుళం

ప్రశ్న : 208 శ్రీకాకుళం డి. ఎస్. పి. కార్యాలయాన్నిఎప్పుడు ప్రారంభిస్తారు?

సమా : పోలీసు సూపరింటెండెంటు కార్యస్థానాన్ని శ్రీకాకుళంకు మార్చటానికై సూపరింటెండెంటుకూ ఆయన సిబ్బందికి అవసరమైన ఆఫీసు, గృహవసతుల కొరకు అన్వేషణ జరుగుతున్నది.

శ్రీ జి. లక్ష్మీనారాయణశర్మ, మీర్ ఖంపేట,
ఇబ్రహింపట్నం తాలూకా, హైదరాబాదు జిల్లా

ప్రశ్న :209(అ) హెచ్.ఎస్.సి ప్యాసై 1958 నవంబరు మొదటి తేదీతరువాత నియమించబడిన ఉపాధ్యాయులకు రూ.30/-ల వేతనము ఇస్తున్నారు. 1961 ఏప్రిల్ మొదటి తేదీనుంచి రూ.35-ఇస్తున్నారు. మరి హెచ్.ఎస్.సి.ప్యాసై ఎల్. డి. సి.కి రూ 50/-ల వేతనమిస్తున్నారు. ఇద్దరి అర్హత ఒకటే. ప్రభుత్వము ఈ తేడాను సరిచేయ దలచినదా?

(ఆ) 1958 నవంబరు 1వ తేదీ తరువాత నియమించబడినవారికి పించను సౌకర్యములు పొందటానికి అర్హత వున్నదా?

సమా : హెచ్.ఎస్ సి. పరీక్షలో ఉత్తీర్ణులై శిక్షణ పొందని అభ్యర్థులు 1958 నవంబరు 1వ తేదీ తరువాత ఉపాధ్యాయులుగా నియమించబడినవారు రూ. 30-60ల స్కేలునూ, 1961 ఏప్రిల్ 1వ తేదీనుంచి రూ.35-60ల స్కేలును పొందటానికి అర్హులు. పై ఉపాధ్యాయులకు రూ. 50-120ల స్కేలును వర్తింపజేసే ప్రతిపాదన లేదు. హెచ్.ఎస్.సి. ప్యాసై, శిక్షణ పొందిన ఉపాధ్యాయుల కొరకు ఈ స్కేలు (రు 50-120) ఉద్దేశించబడినది. గుమాస్తాలుగా నియమించబడిన హెచ్.ఎస్.సి. అభ్యర్థులు రూ. 50-120ల స్కేలు పొందటానికి అర్హులు.

1958 నవంబరు మొదటి తేదీన జీతపుస్కేళ్ళ సవరింపు జరిగింది. ఆ తేదీన పెన్షను పద్ధతిలో మార్పు జరగలేదు. 1958 నవంబరు మొదటి తేదీ తరువాత నియమించబడిన ఉపాధ్యాయులకు ఆంధ్రప్రదేశ్ నియమావళి వర్తిస్తుంది. 1961 ఏప్రిల్ మొదటి తేదీనుంచి సవరించబడిన పెన్షను నిబంధనలు అమల్లోనికి వచ్చాయి. ఆంధ్రప్రదేశ్ నియమావళిని కానీ లేదా సవరించబడిన పెన్షను నిబంధనలను కాని తమ ఇష్టానుసారం ఎన్నుకోటానికి ఉద్యోగులకు అవకాశం వుంది.

శ్రీ పి. బి. రాజు, రాకోడు, విజయనగరం.

ప్రశ్న : 210 నిర్బంధ విద్యావిధానమును అమలు జరుపుటకు గాను 1960అగష్టునెలలో ఉపాధ్యాయులుతీసిన గణనప్రకారం1-7-54 నుంచి 1-9-55 వరకు విశాఖ జిల్లాలో పుట్టిన వారు, విజయనగరం తాలూకాలో పుట్టినవారు, ఆంధ్రదేశములో పుట్టినవారు ఎందరు తేలిరి? నిర్బంధ ప్రాథమిక విద్యా పథకం క్రింద వీరందరికీ విద్య గరపటానికి అదనంగా ఎంతమంది ఉపాధ్యాయులను నియమించవలసి వుంటుంది?

సమా : విశాఖపట్నం జిల్లాలో 1-7-1954 లగాయతు 1-9-1955 వరకు మొత్తం 53606 మంది శిశువులు జన్మించారు. (అ) విజయనగరం మునిసిపాలిటీలో 1-7-54 నుంచి 1-9-55 వరకు 2416 మంది పిల్లలు జననమొందారు. (ఇ) ఏజెన్సీ ప్రాంతాలు మినహా ఆంధ్రప్రదేశ్ మొత్తంలో 1954 జూలై మొదటితేదీ లగాయతు 1955 సెప్టెంబరు మొదటి తేదీవరకు మొత్తం 12,85,281 మంది శిశువులు జన్మించారు.

(ఈ) నిర్బంధ విద్యాపథకాన్ని అమలు పరిచిన ఫలితంగా ప్రభుత్వం 1961-62వ సంవత్సరంలో ప్రాథమిక పాఠశాలల్లో అదనంగా 3,300 ఉపాధ్యాయోద్యోగాలను మంజూరు చేసింది.

విద్యా సంబంధమైన వ్యవహారాల నిమిత్తమై శ్రీకాకుళంలోని కొన్ని తాలూకాలతో విశాఖపట్నంజిల్లా, విశాఖపట్నం, విజయనగరం అనే రెండు జిల్లా విభాగాల క్రింద విభజింప బడినది. కాబట్టి విశాఖపట్నం రెవెన్యూజిల్లాకు సంబంధించిన పూర్తి వివరాలు తెలపటం సాధ్యంకాదు. కనుక విశాఖపట్నం విద్యా జిల్లాకు సంబంధించిన వివరాలు మాత్రమే తెలియజేయబడినవి. విజయనగరం తాలూకా విషయంలో కూడా ఇంతే. అధికార వికేంద్రీకరణ తరువాత జిల్లా బ్లాకులు, మునిసిపాలిటీల క్రింద విభజింపబడి పాఠశాలలు వాటి అధీనంలో పుంచబడ్డాయి కాబట్టి నిర్బంధ ప్రాథమిక విద్యాపథకం బ్లాకులు, మునిసిపాలిటీలలో అమలుపరచబడినది. అందుచేత ఈ వివరాలు తాలూకా వారీగా కాక బ్లాకు

వారీగా, మునిసిపాలిటీవారీగా లభిస్తున్నాయి. కనుక విజయనగరం మునిసిపాలిటీకి సంబంధించిన వివరాలు ఇవ్వబడినవి.

శ్రీ ఆర్. శ్రీరామమూర్తి, పార్వతీపురం,
శ్రీకాకుళం జిల్లా.

ప్రశ్న : 211 పార్వతీపురం జిల్లా పరిషత్తు ఉన్నత పాఠశాలలో ఏడవ ఫారంను ఎప్పుడు తెరుస్తారు. ప్రభుత్వం ఈ పాఠశాలకు ఎంత గ్రాంటు ఇస్తుంది?

సమా : శ్రీకాకుళం జిల్లా పార్వతీపురం జిల్లా పరిషత్తు ఉన్నత పాఠశాల, 1961–62 వ సంవత్సరంలో హయ్యర్ సెకండరీ పాఠశాలగా పై గ్రేడుకు పెంచబడినది. ఈ సంవత్సరం, 9 వ తరగతి నుంచి హయ్యర్ సెకండరీ స్కూల్ సెలబస్ అమలు పరచబడుతుంది. కాబట్టి ఈ పాఠశాలలో 1964–65 వ సంవత్సరంలో 12 వ తరగతి లేదా ఏడవ ఫారం తెరవబడుతుంది పాఠశాలను పైగ్రేడుకు పెంచటానికి ప్రభుత్వం ఎంతగ్రాంటు చెల్లించాలి అనే విషయం పరిశీలనలో వుంది.

శ్రీ కె. సత్యనారాయణ మూర్తి, పాలకొల్లు,
పశ్చిమ గోదావరిజిల్లా.

ప్రశ్న : 212 ప్రభుత్వము హిందీ ప్రచారమునకు ఏదైనా పథకము తయారుచేసినదా? 1962–63 వ సంవత్సరమునుండి హైస్కూళ్లలో హిందీకి 3 పీరీడ్లు కేటాయించుట నిజమేనా? ఎలిమెంటరీ పాఠశాలలలో హిందీని ప్రవేశపెట్టే విషయం పరిశీలనలో వున్నదా?

సమా : హిందీ ప్రచారానికై ప్రభుత్వం ఒక పథకాన్ని సిద్ధం చేసింది. సెకండరీ పాఠశాలల్లో హిందీకై ప్రస్తుతం అమల్లో వున్నట్టు రెండు పీరీడ్లకు బదులు మూడుపీరీడ్లను కేటాయించే విషయం పరిశీలనలోవుంది. తుది నిర్ణయం ఇంకా జరుగవలసి వుంది.

రాష్ట్రంలోని వివిధ ప్రైవేటు సంస్థలచే నిర్వహించబడే హిందీ ఉపాధ్యాయుల 'శిక్షణ కోర్సులన్నింటికీ కలిపి ఒకే పాఠ్యప్రణాళికను ప్రవేశ పెట్టటానికి తలపెట్టబడినది. 1961–62 వ సంవత్సరం నుంచే ప్రభుత్వ పరీక్షల కమీషనరు సమిష్టి పరీక్షను నిర్వహించవలసి వుంది. అయితే అది 1962–63 వ సంవత్సరంవరకు వాయిదా వేయబడింది.

సమీకృత ఎలిమెంటరీ విద్యా పాఠ్యప్రణాళిక 7సంవత్సరాల కోర్సు ననుసరించి, 1962–63 వ సంవత్సరం లగాయతు ఎలిమెంటరీ పాఠశాలల్లో నాల్గవతరగతి నుంచి హిందీ కోర్సు ప్రారంభించబడుతుంది.

శ్రీ ఎ. నారాయణరెడ్డి, నిజామాబాదు.

ప్రశ్న : 213 ఇంధల్‌వాయి, ధర్‌పల్లి రోడ్డు ఆపివేయబడుటకు గల కారణమేమి? ఎప్పుడు పూర్తి గావించబడుతుంది?

సమా : ఒక కారణమేమిటంటే ఈ పనిని కంట్రాక్టరు సకాలంలో పూర్తి చెయ్యలేక పొయ్యాడు. మరో కారణమేమంటే సి. పి. పథకం 1958 మార్చి 31 వ తేదీనుంచి నిలిపివేయబడినది. అందువల్ల ఈ పని పూర్తి కాలేదు. ఇప్పుడు జిల్లా పరిషత్తులు ఏర్పడ్డాయి కాబట్టి ఈ పనిని జిల్లాపరిషత్తు చేపట్టి పూర్తి చేయవలసి వుంది.

---

అండలున్నవనుచు కొండ నెక్కగబోకు

అండలూడ బ్రతుకు బండలౌచు

కొండ మీదినుండి కుప్పగా కూలురా!

జననుతాంతరంగ! వినుర! రంగ!

—"కృష్ణశతశతి"

# సంగ్రహ ప్రకటనలు

## ఓటర్ల తుది జాబితాలు

300 శాసన సభా నియోజక వర్గాలకు సంబంధించిన ఓటర్ల జాబితాలన్నింటినీ, 1961వ సం. లో జరిగిన జాబితాల వార్షిక పునః పరిశీలన సందర్భంలో అవసరమైన చేర్పులూ, మార్పులు చేసిన తరువాత అంతిమంగా ప్రకటించి అమల్లోనికి తేవటం జరిగింది, ఇప్పుడివి తాజా జాబితాలుగా పరిగణింబడతాయి, 1962 వ సంవత్సరములో జరిగే సాధారణ ఎన్నికలకు ఈ జాబితాలనే ఉపయోగిస్తారు. ముసాయిదా జాబితాలను పరిశీలించి అవసరమైతే క్లెయిమలు, అభ్యంతరాలు తెలుపటానికి ప్రజలకు తగు అవకాశం కల్పించడం ద్వారా ఓటర్ల జాబితాలను వీలైనంత వరకు సరైనవిగా తయారు చేయటానికి పూర్తిశ్రద్ధ తీసుకున్నారు. అయితే కొన్ని సందర్భాలలో స్వల్పమైన మార్పులు ఇంకా కొన్ని అవసరం కావచ్చు. కాబట్టి వచ్చే సాధారణ ఎన్నికలలో తమ ఓటు హక్కును వినియో చు కోటానికి వీలుగా 1961 వ సం. ఓటర్లు జాబితాలను పరిశీలించి వాటిలో తమ పేర్లూ, ఇతర అంశాలు సక్రమంగా వున్నదీ, లేనిదీ నిర్ధారణ చేసుకోవలసిందిగా ప్రజలకు విజ్ఞప్తి చేయడం జరుగుతున్నది. ఓటరుగా నమోదు కావటానికి అర్హత కలిగివుండి యీ జాబితాలలో పేర్లులేని వ్యక్తులు, తక్షణమే ఓటర్ల జాబితాలో తమ పేర్లుచేర్పించుకో వలసిందిగా కోరడమవుతున్నది.ఇందుకొరకు అనుసరించాల్సిన విధానాలను ప్రజలు గ్రహించడానికి దిగువ వివరించడమైనది. ఓటర్ల జాబితాలో పేరు చేర్పించుకోటానికి గానీ లేదా ఏదైనా అంశం విషయంలో మార్పుకొరకు కాని పెట్టుకునేదరఖాస్తును సందర్భాన్నిబట్టి 1960 ఓటర్ల నమోదు నియమావళికి అనుబంధపరచిన 6వ నెంబరు ఫారంపై కానీ లేదా 8వ నెంబరు ఫారంపై కాని వ్రాసి తమకు సంబంధించిన ఓటర్ల నమోదు అధికారి -(రెవిన్యూ డివిజినల్ ఆఫీసరు-) కి రెండు ప్రతులుగా దాఖలు ఛేయాలి. దరఖాస్తు ఫారంపై 50 నయాపైసల నాన్ జుడీషియల్ స్టాంపు అంటించాలి. లేదా స్టాంపు ముద్రించిన కాగితాన్నైనా ఉపయోగించవచ్చు. ఆరవ నెంబరు, ఎనిమిదవ నెంబరు ఫారాల ముద్రిత ప్రతులు ఓటర్ల నమోదు అధికారి కార్యాలయంలో అమ్మకానికి లభిస్తాయి. చేతితో వ్రాసిన, సైక్లోస్టయిలు చేసిన టైపుచేసిన లేదా ప్రైవేటుగా ముద్రించిన ఫారాలను కూడా ఉపయోగించవచ్చు. అయితే అవి నిర్ణీత ఫారాలననుసరించి వుండాలి.

నామినేషన్లు దాఖలు చేసేందుకు ప్రకటన వెలువడిన తర్వాత– (బహుశా 1962 జనవరి 13 వ తేదీ–) అటువంటి దరఖాస్తులను హైదాబాదులోని ఎన్నికల ప్రధాన అధికారికి రెండు ప్రతులలో పంపాలి. దరఖాస్తులపై రూ. 3 ల విలువగల నాన్ జూడీషియల్ స్టాంపులను అంటించాలి. ఈ దరఖాస్తులను ఓటర్ల నమోదు అధికారులకు పంపరాదు. పేరు నమోదునకు అక్షేపణలు తెల్పుకునేందుకు వీలుగా, దరఖాస్తులు అందగానే ఒక ప్రతిని ఆఫీసులోని నోటీసు బోర్డుపై అంటిస్తారు. ప్రకటించిన తేదీనుండి ఏడు రోజులలో తమ ఆక్షేపణలను ఆయనకు అందజేయాలి, పేర్ల నమోదుకు ఆక్షేపణ తెల్పుకునే యీ వారంరోజుల చట్టబద్ధమైన వ్యవధియెట్టి పరిస్థితులలోను మార్చబడదు. ఈ వారం రోజుల వ్యవధిలో ఆక్షేపణలను తెల్పనివారి పేర్లను ఓటర్ల పట్టికలలో చెర్చుకుంటారని ప్రజలు భావించరాదని విజ్ఞప్తి. ఓటర్ల నమోదు అధికారిగానీ ఎన్నికల ప్రధాన అధికారి గానీ దరఖాస్తుదారు పేరు నమోదు అర్హతలకు సంతృప్తి చెందాలి. దానికై వారు అవసరమైతే తగిన విచారణ చెయాలి. 1962 జనవరి, ఫిబ్రవరి నెలలలో ఓటర్ల నమోదు అధికారులు, యితర రెవిన్యూ అధికారులు పోలింగ్ కార్యక్రమాలలో నిమగ్నులై ఉంటారు కాబట్టి,

యీ కాలంలో పేర్లనమోదుకు తీరికదొరకదు. అర్హతగల వ్యక్తులు సరి అయిన కాలంలోనే తమ పేరు నమోదునకై దరఖాస్తులు వెంటనే పంపాలని వారి ఆసక్తిని గోరి యీ విజ్ఞప్తి చేయడమైనది.

## తెలంగాణేతర ఉద్యోగులు

తెలంగాణేతరులైన 3,000 మంది ఉద్యోగులను తక్షణమే ఉద్యోగాలలో నుంచి తొలిగించవలసిందిగా ప్రభుత్వం వివిధ శాఖాధిపతులకు ఉత్తర్వులు జారీచేసిందనీ, ఈ విధంగా ఉద్యోగాలు కోల్పోయేవారిలో సుమారు నూటికి 90 వంతుల మంది పదిసంవత్సరాల నుంచి పని చేస్తున్నవారున్నారనీ కొన్ని పత్రికలలో వచ్చిన వార్తలను ఖండిస్తూ ప్రభుత్వం ఒక పత్రికా ప్రకటన విడుదల చేసింది. ముల్కీ అభ్యర్థులకు కేటాయించిన ఉద్యోగాలలో పనిచేస్తున్న తెలంగాణేతర ఉద్యోగులను రిజర్వేషను నిబంధనల ప్రకారం, ముల్కీ అభ్యర్థులు లభించగానే తొలగించటానికి మాత్రమే ఆదేశాలుపంపబడనవని ప్రభుత్వం ఆ ప్రకటనలో వివరించింది. 1961 మధ్యభాగానికి ముల్కీలకు రిజర్వుచేయబడిన వివిధ ఉద్యోగాలలో పనిచేస్తున్న తెలంగాణేతర ఉద్యోగులు 1010 మంది వున్నారు. వీరిలో అధికసంఖ్యాకులు అత్యవసర నిబంధనల క్రింద తాత్కాలికంగా నియమించబడిన వారు వీరి సర్వీసు 2 సంవత్సరాలకు మించిలేదు. 1956 అక్టోబరు 31వ తేదీన ఉద్యోగాలలో వున్నవారందరకీ రక్షణ ఇవ్వబడింది. కాబట్టి ఈ ఆదేశాలు వర్తించే వారిలో 5 సంవత్సరాలకంటే ఎక్కువ సర్వీసు వున్నవారులేరు. అంతే కాకుం వారిని ఉద్యోగాలలో నుంచి తొలగించటానికి కూడా ఆదేశాలు ఇవ్వబడలేదు. వారిని ఆంధ్రప్రాంతానికి బదిలీ చేయటం ద్వారా ఆఖాళీలలో తెలంగాణా అభ్యర్థులను నియమించటానికి మాత్రమే ఉత్తర్వులు చేయబడినవి. వివిధశాఖాధిపతులు అనేక సందర్భాలలో ముల్కీలుకాని అభ్యర్థులను ఆంధ్రప్రాంతంలోని ఆయా ఉద్యోగాలకు మార్చకలిగినట్టు కూడా తెలియ వచ్చింది. చట్టనిబంధనలను అమలు పరచటంలో ఒకప్రాంతం ప్రయోజనాలను మరొక ప్రాంతం ప్రయోజనాలకై పమ్ము చేయటం జరగలేదని కూడా ప్రభుత్వం స్పష్టం చేయదలచింది.

## ప్రాంతీయ సైనికులకు బహుమతులు

ప్రాంతీయ సైనికులకు ప్రతిసంవత్సరం దిగువవిధంగా బహుమతులు యివ్వటానికిగాను, ప్రతి ఏటా రు. 500 లమొత్తాన్ని హైద్రాబాదులోని 117 వ. ఇన్ఫెంటరీ సైనికదళం (టి ఎ.) కమాండింగ్ అధికారికి అప్పగించటానికి ప్రభుత్వం ఆదేశించింది:

అన్ని విధాలా ఉత్తమశిక్షణ పొందినసైనికునికి ఒకటి.

అన్నిటిలో మంచి చురుకుదదనం చూపిన సైనికునికి ఒకటి.

సరిగా గురిచూచి కాల్చిన సైనికునికి ఒకటి.

ఉత్తమ సైనికున్ని ఎన్నుకునే అధికారం కమాండింగ్ అధికారికి ఇచ్చారు.

## దుకాణాల చట్ట నిబంధనల మినహాయింపులు

1951వ సం పు ఆంధ్రప్రదేశ్ (తెలంగాణా ప్రాంతం) దుకాణాలు, వ్యాపార సంస్థల చట్ట నిబంధనల క్రింద, హైద్రాబాదులో జరిగే పారిశ్రామిక ప్రదర్శనంలోని దుకాణాలకు 1962 జనవరి మొదటి తేదీ లగాయతు ఫిబ్రవరి 10వ తేదీ వరకు 41 రోజులపాటు ఈ చట్టం 7, 9, 10, 11, 13, 14, 15, 16వ సెక్షనుల నిబంధనల వర్తింపును దిగువ షరతులకు లోబడి ప్రభుత్వం మినహాయించింది:

ఆ షరతులు ఇవి : ఈ దుకాణాలలో పనిచేసే ఉద్యోగులు రోజుకు 8 గంటలకంటె ఎక్కువ సమయం పనిచేయవలసి వస్తే, ఈ చట్టం 26వ సెక్షను ప్రకారం మామూలు జీతపురేటుకంటే $1\frac{1}{2}$ రెట్లు ఓవర్‌టైమ్ వేతనం చెల్లించాలి.

(2) ఈ కాలంలో ఎన్ని వారాంతపు సెలవులలో పనిచేస్తే అన్ని రోజులు వారికి తరువాత సెలవు ఇవ్వాలి

## ప్రజాఋణ కార్యాలయం

ఇప్పుడు హైద్రాబాదులో ఉన్న ప్రజాఋణ కార్యాలయం, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారి అన్ని ఋణాలకు సంబంధించిన విషయాలను చూచే విధంగా, సర్వహంగులుగల ప్రజా ఋణ కార్యాలయంగా 1961 డిసెంబరు 18వ తేదీ నుండి పని ప్రారంభించింది. రిజర్వు బ్యాంకు ఆఫ్ ఇండియా నిర్ణయం ప్రకారం యీ మార్పు చేశారు. భారత ప్రభుత్వం, ఇతర రాష్ట్ర ప్రభుత్వాలకు సంబంధించిన స్థానిక ప్రజా ఋణ కార్యక్రమాలను కూడా యీ కార్యాలయమే నిర్వహిస్తుంది. ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం, భారత ప్రభుత్వ, యితర రాష్ట్ర ప్రభుత్వాల ఋణాల సెక్యూరిటీలు గలవారు, వడ్డీ చెల్లింపులు, పునరుద్ధరణ వగైరాలకు హైద్రాబాదు, సుల్తాన్ బజారులో ఆంధ్ర బ్యాంకులో ఉన్న రిజర్వు బ్యాంకు ఆఫ్ ఇండియా ప్రజాఋణ కార్యాలయంతో సంప్రదించవచ్చు.

## హోదాల మార్పు

హైద్రాబాదు ప్రజారోగ్య శాఖ సూ రింటెండింగ్ ఇంజనీరు

హోదాను 'ప్రజారోగ్య ఇంజనీరింగు' తూర్పు సర్కిలు సూపరింటెండింగ్ ఇంజనీరుగానూ, హైద్రాబాదు ఇన్వెషిగేషన్, డిజైన్సు సూపరింటెండింగ్ ఇంజనీరు హోదాను 'ప్రజారోగ్య ఇంజనీరింగ్' పశ్చిమ సర్కిలు సూపరింటెండింగ్ ఇంజనీరుగానూ మార్చటానికి ప్రభుత్వం ఉత్తర్వులు జారీచేసింది.

## మలేరియా నిరోధక విభాగాలు

నిజామాబాదు, నిర్మల్, వరంగలులలోని మలేరియా నిరోధక విభాగాలు 1961 అక్టోబరు 1వ తేదీ నుంచి మరో మూడు నెలల పాటు అంటే 1961 డిశంబరు 31వ తేదీ వరకు పని చేయడానికి ప్రభుత్వం ఉత్తరువు ఇచ్చింది.

## పారిశ్రామిక సంబంధాల సంఘం

ప్రారంభంలో వస్త్రం, చక్కెర పరిశ్రమలలో పారిశ్రామిక సంబంధాల సంఘాలను నెలకొల్పాలని ప్రభుత్వం నిర్ణయించింది. త్రివిధ సభ్యులుగల యీ సంఘాలకు కార్మికశాఖ కమీషనరు అధ్యక్షులుగాను, కార్మికశాఖలోని సహాయ కార్యదర్శులలో ఒకరు యీ సంఘం కార్యదర్శిగాను వ్యవహరిస్తారు. యజమానుల ప్రతినిధులు పనివారల ప్రతినిధులు సమాన సంఖ్యలో ఉంటారు ప్రతి వారినుండి ముగ్గురికన్నా తక్కువ కాకుండా 5గురి కన్నా యెక్కువకాకుండా సభ్యులు ఉంటారు. యజమానుల సంఘాలు, పనివారల సంఘాలు యీ ప్రతినిధులను యెన్నుకుంటాయి. రెండు నెలలకు ఒకసారిగానీ అవసరమైతే యెక్కువ తడవలుగాని యీ సంఘం సమావేశాలు [illegible]తుంది. పరిశ్రమకు సంబంధించిన సాధారణ పరిస్థితులను, ఉదాహరణకు పనివారల ఉద్యోగ పరిస్థితులు, పరిశ్రమలవారిగా స్థాయీ ఉత్తర్వుల నియమావళిని రూపొందించుట, వేతనం, బోనసు, పనిపరిమాణం, సమ్మె, లాకౌట్లకు దారితీసే యితర ప్రత్యేక సమస్యలు. ఒకసభ్యుడు తెచ్చిన సమస్యను చర్చించుట (దీనిని యిద్దరుసభ్యులు బలపర్చాలి). యజమాని లేక పనివారలకు సంబంధించి యేదైనా సమస్య చర్చకు వచ్చినప్పుడు ఆ సంఘంలో వీరి ప్రతినిధి యెవరూ సభ్యుడుగా లేకపోతే వారినే సమావేశానికి ఆహ్వానిస్తారు. సంఘం నిర్ణయాలను సభ్యులందరూ పాటించాలి. పరిశ్రమల సమస్యలు సంఘం పరిశీలనలో ఉన్న కాలంలో పారిశ్రామికంగా ప్రశాంతిని నెలకొల్పాలి.

## వయః పరిమితి మినహాయింపు

1962 మార్చిలో జరిగే స్కూల్ ఫైనల్ పరీక్షకు హాజరయ్యే అభ్యర్థులకు అర్హమైన సందర్భాలలో వయః పరిమితుల మినహాయింపును మంజూరుచేసే అధికారం విద్యాశాఖాధికార్లకు ప్రభుత్వం ఇచ్చింది.

## జి. సి. రేకుల సరఫరా

కంట్రోలు సరుకుల డైరెక్టరు దిగువవిధంగా ప్రకటిస్తున్నారు:

ఇంటి కప్పులు, కారుషెడ్డులు, చిన్న గుడిసెలకు రేకులు వెసుకోదలచినవారు చాలామంది రేకులకై అభ్యర్థిస్తున్నకారణంగా 15 రేకులకన్నా తక్కువ అవసరమున్న వారికి వాటి సరఫరాకై మునిసిపల్ అనుమతి, అనుమతించిన ప్లానులేకుండా రాయితీ ఇచ్చారు.

ఈ రాయితీలు అక్రమ చర్యలకు దారితీస్తున్నాయని 6నెలల అనుభవం తెల్పుతున్నది. జి. సి. రేకుల రాష్ట్ర కోటాను యీ మధ్యనే చాలావరకు తగ్గించారు అందువల్ల లోగా యిచ్చిన పై రాయితీని ఇప్పుడు ఉపసంహరించుకోవాలని నిశ్చయించారు.

కావున ఇకముందు జి. సి. రేకులు కావలసినవారు సంఖ్యతో నిమిత్తం లేకుండా, మంజూరు అయిన ప్లానును, మునిసిపల్ అనుమతిని తీసుకొని దరఖాస్తులు పంపాలి.

## మంత్రుల కార్ల వాడకం

అధికారిక వినియోగానికై మంత్రులకు సరఫరా చేయబడిన ప్రభుత్వ కార్లను యెన్నికల కాలంలో దిగువ సూత్రాలను అనుసరించి వాడుటకు మంత్రులు స్వచ్ఛందంగా నిర్ణయించుకున్నారని ప్రభుత్వం ప్రకటించ వల్సింది

1. రాజధానిలో ఉన్నప్పుడు కేవలం అధికారిక కార్యక్రమాలకు గృహ సంబంధమైన పనులకు మాత్రమే ప్రభుత్వ కార్లను ఉపయోగిస్తారు.

2. 1962 జనవరి 16వతేదీ నుండి 1962 ఫిబ్రవరి నెలాఖరు వరకు జిల్లాల్లో పర్యటించటానికి ప్రభుత్వం కేటాయించిన కార్లను మంత్రులు ఉపయోగించరు. అధికారిక కార్యక్రమాలకు మాత్రమే ప్రభుత్వకార్లను వినియోగిస్తారు. యీ కాలంలో జరిపిన పర్యటనలకు డి. ఎ. గానీ ప్రయాణ భత్యంగానీ పుచ్చుకోరు. అధికార కార్యక్రమాలకు స్వంత ఉపయోగానికి మంత్రులు కార్లను వినియో

గించినప్పుడు దానికి అయ్యే ఖర్చులను యెప్పుడు కూడా వారే భరించుకుంటారు.

## ఎన్నికల పిటిషన్‌పై విచారణ

నెల్లూరు సహకార భూమి తనఖా బ్యాంకు విషయంలో అందిన ఎన్నికల పిటిషను గురించి విచారణ జరుపడానికి, సాధారణ పరిపాలన శాఖ కార్యదర్శి శ్రీ సయ్యదలీ, ఐ. ఏ. ఎస్ ను విచారణాధికారిగా ప్రభుత్వం నియమించింది.

1961 జూన్ 30 వ, తేదీన నెల్లూరులో జరిగిన నెల్లూరు సహకార భూమి తనఖా బ్యాంకు సర్వ సభ్యసభ్యసమావేశం జరిగిన క్రమం, నిజస్థితిని గురించి ఒక వాటాదారు పెట్టిన పిటిషనుపై హైకోరుతీర్పునిస్తూ, ప్రభుత్వ కార్యదర్శులలో ఒకరిని విచారణాధికారిగా ప్రభుత్వం నియమించాలని సూచించడంవల్ల యీ నియామకం జరిగింది.



ఎండేనిండే — యేళ్లను కోళ్లను

కత్తి కటారులు — కలిగిన వ్యక్తిని

కోరలు గోళ్లూ — కూడిన మృగాన్ని

అహంకారులగు — అధికారులను

మాటను తప్పే — తోటి మనుష్యుల

ఆటంబాంబులు — అమరినవారిని

నమ్మకొంటివా — దుమ్మైపోతావ్!

— "ప్రజానీతి"

# సాహిత్యము ధర్మపథ నిర్దేశము

శ్రీ టి. మధుసూదనరావు

సాహిత్యమునకు ధర్మపథ నిర్దేశ మపేక్షణీయమా? రససందీప్తమైన సాహిత్య ప్రపంచంలో నైతిక, ధార్మిక విలువలకు గల స్థానమేమి? ప్రపంచ మహాకవులు ధర్మోపదేశమునకు స్థానమొసంగిరా? అవినీతిని, మానవ జాతి కళ్యాణమునకు భంగకరములగు అధార్మికములను సాహిత్య ప్రతిపాదితములు కావచ్చునా? ఈవిధమైన ప్రశ్నలు ప్రపంచ విమర్శకులను చిరకాలమునుండియు వేధించుచున్నవి. భారతదేశములో నీ విషయమై పెక్కు అభిప్రాయ భేదములు లేవు. పాశ్చాత్య దేశములో నీ విషయము బహుధా చర్చింప బడినది. ఒక సిద్ధాంతమును చేయుటకు పూర్వము పూర్వ విమర్శకుల అభిప్రాయములను చర్చించుట భారతీయమైన వాదపద్ధతి లక్షణము. జల్పమునకుగాని వితండమునకుగాని విమర్శన లోకములో తావులేదు. మొట్టమొదట ఈ విషయమై పాశ్చాత్యుల అభిప్రాయములను తదుపరి భారతీయాలంకారికుల అభిప్రాయములను చర్చించి యొక అభిప్రాయమునకు వచ్చుటయే ప్రస్తుత కర్తవ్యము.

ఈ విషయమై పాశ్చాత్యులలో పరస్పర వ్యతిరేకములైన రెండు సిద్ధాంతములున్నవి. మొదటిది ప్రస్థానము-

1. సాహిత్యములో ధర్మపథ నిర్దేశముండి తీరవలయును. అవినీతినికాని అధర్మమును గాని కవి ప్రతిపాదించరాదు.

2. "కళ కళకౌనమే" ఆనందమే కళలకు పరమావధి. లోకధర్మమునకు శిల్ప ధర్మమునకు సంబంధము లేదు. ధర్మాధర్మ విచారము కవికి నిరపేక్షము.

మొట్టమొదట "కళ కళకోసమే" అను వాదము పరిశీలించుదము. ఈ వాదము సిద్ధాంతముగ ప్రచారములోనికి వచ్చినది 19వ శతాబ్దములోనే. ఇది ఫ్రాన్సు దేశములో పుట్టి అతి త్వరితముగ మిగిలిన పాశ్చాత్య ప్రపంచములో ప్రచారమయినది. ఈ సిద్ధాంతము స్పష్టముగ ప్రతిపాదించిన వాడు 'గైటర్'. ఈతని మతములో కళ నీతికి విరుద్ధమైనది. అది అవినీతిని ప్రతిపాదించును. అతని వాద స్వభావ మీ క్రింది వాక్యములలో స్పష్టముగ గోచరించును.

" A town interests me merely for its buildings. Let the inhabitants be utterly vile and the town a hunt of Crime, what does that signify to me so long as I am not assasisinate while looking at the buildings"

"సౌందర్యమయమై అంబరచుంబిత సౌధ మయమైన నగరము నాకు వీనుల విందొనగును. ఆ నగరమందలి జనులు అవినీతి పరులు పశుతుల్యులు కావచ్చును. ఆ నగరమొక కసాయివాని కొట్టము కావచ్చును. ఆ విషయముతో నాకేమి సంబంధము? నేను హత్య చేయబడునంత వరకు సౌధ సౌందర్యమును తిలకింతును"

జీవితమునకు సౌందర్య వస్తు దర్శనమే పరమార్ధముకాదు ఆ వస్తు దర్శనమువలన మనలో కలుగు సంస్కారమునుబట్టి దాని విలువ నిర్ణయించవలయును. అతి లోక సౌందర్యవతియైన నర్తకి శిల్పమొకటి దిగంబరముగ "నడి రోడ్డు"లో ప్రతిష్ఠించిన తద్గత సౌందర్య ఆస్వాదనమునకు మునుపు జుగుప్స ఏవ కలుగును. కాగా ఇది స్థాపత్య విషయము. సాహిత్యములో దీనిని సమన్వయించుటకు వీలు లేదు. సాహిత్యమునకు భావము హృదయము. భాష కాదు. మధుర మంజుల సమాస కుసుమ సమాహారము పవిత్ర భావ మండిత మయినప్పుడే కావ్యమగును. కావ్య సౌందర్యము కేవల భాషలో లేదు కనుక ఈ వాదము పరాస్తము.

ఆంగ్లదేశములో ఈ సౌం[illegible] వాదమును ప్రచారము చేసిన వారిలో మొదటివాడు స్విన్ బరన. కాని వాల్టర్ పేటర్ ఈ సిద్ధాంతమును బహుళముగ ప్రచారము చేసినాడు. ఆస్కార్ వైల్డు పేటర్ తర్వాత పేర్కొన దగిన విమర్శకుడు.

"There is no such thing as moral or immoral book, Books are well written or badly written; that is all''

"అవినీతిని ప్రతిపాదించు గ్రంథమని కాని నీతిని ప్రతిపాదించు గ్రంథమని కాని లేదు. రమణీయముగ రచింపబడినది. అరమణీయముగ రచింపబడినది అని మాత్రమే చూడవలయును "

కావ్యమునకు కావ్యత్వము నొసగునది రమణీయము, రసానంద జనకము అయిన రచనా విధానమే అనుటలో విప్రతిపత్తి లేదు. కేవల నీతి ప్రతిపాదింప బడినంత మాత్రమున అది కావ్యము కాజాలదు. అది యే నీతి శాస్త్రమో యగును. రచనా రమణీయముతో బాటు ధర్మపథ నిర్దేశము చేసిన కవులే ప్రపంచములో మహాకవి స్థానమును పొందిరి నీతి ప్రశక్తి లేకపోయినను కావ్యము కావ్యమే అగును. అవినీతిని ప్రచారము చేసిన వాడెవడును ఎప్పుడును మహాకవి కాలేదు రచనా సౌందర్యమునకు నీత్యుపదేశము గంభీరము తెచ్చును. ఇతడే మరొక చోట "All Art is useless" అనినాడు. అనగా కళకు ప్రయోజనము లేదనుట. రచన సౌందర్యమునకు మించిన కేవల ప్రచారము కావ్య కన్య కోమలత్వమునే చెడగొట్టును. కాని ధర్మము కావ్యములో వ్యంగముగ ప్రదర్శించుట మహాకవుల లక్షణము. ఒకానొక ప్రయోజనము నాశించియే వాల్మీకి వ్యాస కాళిదాసాదులు గ్రంథములను వ్రాసిరి. వారుద్దేశింపక పోయినను ఆ కావ్యగతములైన అనేక మహా ధర్మములు మానవులకు జీవిత మార్గమును సూచించినవి. కళకు ప్రయోజనమే లేదనుట అసంగతము.

ఈ వాదము పందొమ్మిదవ శతాబ్దము తుది భాగములో చల్లారినది. ఈ కాలములో తీవవాది జార్జిమూర్ పండితుడు. అసలు అవినీతియే కావ్యశోభనినుమడింప జేయునని ఈయన వాదము. ఈ సిద్ధాంతము నిరుపపత్తికము పరిహాసాస్పదము కనుక సమాధానాపేక్షితము కాదు.

కళ ప్రయోజనసాపేక్షము. కవి ఉదాత్తమైన జీవిత విధానమును ప్రతిపాదించవలయును. కవిప్రవక్త ఏవిధమైన అధార్మిక భావములకు సాహిత్య ప్రపంచంలో తావులేదు. దుర్నీతిని బోధించు వాడు కవి కాడు. అసలు ఏవిధమైన ధర్మపథ నిర్దేశము లేక పోయిన ఆ కావ్యము తుచ్ఛము. ఈదృశమైన అభిప్రాయముగల సిద్ధాంతము పరమ ప్రాచీనమైనది. ప్రయోజన సాపేక్షమైన సాహిత్యము ప్రాక్తనమైనది. దిసమొలతో తిరుగుచు అపరిపక్వ ఫలములను తినుచు తిరిగిన ప్రాక్తన మానవుడు ఆనందాతిరేకముతో వేసిన 'కేక' కూడా ఆనంద నిర్భరమను ప్రయోజనము నుద్దేశించినదే కదా. పని భారమును విస్మరించుటకే జానపదుల జానపద గేయములుద్భవించినవి.

సాహిత్యమును తన Republic నుండి బహిష్కరించిన ప్లేటో పండితుండు ఒక విధముగ సాహిత్యము ధర్మమును నిర్దేశింపవలయునని అంగీకరించినాడు. కళ అనుకరణ మాత్రము. ఈ ప్రకృతి భగవంతుని సృష్టికనుకరణము. కవి ఆ ప్రకృతిని అనుకరించును కనుక సాహిత్యము వాస్తవికతకు రెండంతసులలో దూరము. కవి ఒక యున్మాది. సాహిత్య మొక ఉన్మాదుల ఉన్మత్త ప్రలాపము. అని ప్లేటో సిద్ధాంతము. కాని భగవంతునికి స్తోత్ర

ప్రాయములైన కావ్యములను నిషేధించలేదు. దీనిని బట్టి సాహిత్యము ధర్మోపదేశ మండితము కావలయునని అంగీకరించినట్లు మనము అభిప్రాయమునకు రావచ్చును.

ప్లేటో పండితుని ఛాత్రుడు, సుప్రసిద్ధ గ్రీకు సాహిత్య విమర్శకుడు తత్త్వవేత్త అయిన అరిష్టోటిలు విషాదాంత నాటకములో ఉత్తమ ప్రకృతి గలవాడు నాయకుడుగ చిత్రింప బడవలయుననియు ఇతివృత్తముదాత్తముగ నుండవలయుననియు నొక్కివక్కాణించినాడు. సాహిత్యము, ఆనంద జనకత్వముతో బాటు ధర్మబోధ కూడ చేసినయెడల పఠితల నుత్తమ సంస్కారులుగ చేయునని సిద్ధపండితుని యభిప్రాయము.

జగత్ప్రసిద్ధ విమర్శకుడు Mahew Arnold అభిప్రాయమిది:

"A Poetry of revolt against moral ideas is a Poetry of revolt against life. A Poetry of indifference towards moradeas is a Poetry of indifference towards life."

" నైతిక భావములపై విప్లవ ధ్వజమెత్తుట యనగా జీవితముపై విప్లవధ్వజమెత్తుటయే. నైతిక భావముల యెడ ఉదాసీనత చూపుట యనగా జీవితము యెడ ఉదాసీనత చూపుటయే"

మానవుడు సామాజికజీవి. సమాజము కొన్ని అధిగమింపరాని నైతిక భావములచేత చుట్టుకొని యుండును. మానవ సంస్కారము అట్టి నైతికభావములచేత మలచ బడును. వాటినిమానవుడు అధిగమించలేడు. అట్టి నైతిక భావముల సమాహార స్వరూపమే జీవితము. సోదరిని కామభావముతో చూచుట దుష్టము. ఈ భావము మానవుడు జన్మించిన దాది వానిచుట్టును అలముకొని యుండును. వానిలో జవ్వనము పొడ సూపినపుడు వానికిసోదరిపై కామేచ్ఛయె కలుగదు ఇది సామాజికమైన నైతిక భావములకు గల బలము, ఏతాదృశములైన నైతిక భావములపై విప్లవధ్వజమెత్తుట జీవితముపై వైప్లవ్య శంఖము పూరించుటయే. అది సాహిత్యము చేయనే చేయకూడదు. ఈపండితుని అభిప్రాయ మాలోచనామృతము.

"No Poem ever makes me respect its author, which does not in any way convey the truth of philosophy." towell.

"ఏమాత్రము తాత్త్విక సత్యమును ప్రతి పాదింపని ఏ పద్యమైనను తత్కర్త యెడనాకు గౌరవ భావము గలిగింపదు. "

ఈ పండితుని వాదము తీవ్రము, కావ్యము రమణీయగుణ శోభితమై రసానంద జనక మైనపుడు అది ధర్మబోధ చేయకపోయినను గ్రాహ్యమే. కేవల ధర్మ ప్రతిపాదనయే కావ్యమునకు కావ్యత్వము చేకూర్ప జాలదు. నీతిని ధర్మమును బోధింపక పోయినను అవినీతిని అధర్మమును మాత్రము బోధింపరాదు. కవితా గుణము లేశ మాత్రములేక ధర్మోపన్యాసములతో కూడియుండిన అది యే ధర్మశాస్త్ర మోఅగును కాని కావ్యముకాజాలదు. విజ్ఞానేశ్వరీయము కావ్యముకాదు,

"No man has ever been a great poet without being at the same time a profound philosopher"

–Coleredge-

"ఉత్తమ తాత్త్వికుడుకాని ఏమానవుడు ఉత్తమకవి కాజాలడు"

ప్రత్యక్ష దృశ్య మానమగు సృష్టినె చిత్రినిగురించి ప్రతి కవియు తన స్వకీయ మైన బుద్ధితో భావనచేయును. అయాభావములు తమ తమ కావ్యములలో ప్రతిబింబింపక మానవు. భారత దేశములో తాత్త్వికుడు కాని కవి యుండుట అరుదు,

'Other things being equal, the work of art which is own way says more about the universe will be better than the work of art which says less" 'Huntley'

"కావ్యమునకు సంబంధించిన యితరగుణములు సమాన స్థాయిలో నున్నప్పుడు తన "విలక్షణ" మార్గమున ధర్మ బోధ నధికముగ జేయువాడు అల్పముగ జేయువాని కంటె నిశ్చయముగ అధికుడు. ఈ వాక్యములలో Other things–భావము, భాష వస్తువు–చిత్రీకరణ మొదలయిన కావ్యగుణములు. ఈ కావ్యగుణ సంచయము సమానముగనున్న రెండు కావ్యములలో ధర్మపథ నిర్దేశ మధికముగనున్న కావ్య మల్పముగ నున్న కావ్యముకంటె అధికతమము. 'in his own way' అనగా రమణీయార్థ ప్రతిపాదకముగ అని భావము. కావ్య సుభగత్వము భ్రష్టము కాకుండ ధర్మపథ నిర్దేశముండవలయునని పర్యవసానము.

రష్యా దేశపు మహాకవి Tolstory సాహిత్యములో ధర్మపథ నిర్దేశావశ్యకతను నిరూపించినాడు. సాహిత్యముయొక్క విలువ అది యొసంగెడు ఆనందములో లేదు, ఆహారముయొక్క విలువ అది మన శరీరమున కొసంగు ఆరోగ్యమును బట్టి నిర్ణయించ బడును కాని అది జిహ్వ కొసగు రుచినిబట్టి కాదు. అట్లే సాహిత్యము మనలను ఉత్తమశీలురుగను ఉదాత్త సంస్కారులుగను

చేయుటలో దాని విలువ కట్టవలయును. కేవల ఐంద్రియ సుఖోప్ప రసలను నాట్యమాడినంత మాత్రమున అది సాహిత్యము కాజాలదు. "నైతిక సౌందర్యము కళా సౌందర్యమునకు భిన్నము కాదు."

"Artistic beauty is not different from moral beauty"

"Good art is never produced for its own sake. It is too difficult to be worth the effort"

సత్కళ తనకొఱకే సృష్టింప బడదు. తత్ప్రయోజనము చెప్పుట సులభమును కాదు. అని 'షా' అభిప్రాయము. ఇది కళకళ కోసమే అనువాదమును పారాస్తము చేయుచున్నది.

ఇంతవఱకు "కళకు ప్రయోజనసాపేక్షము కళప్రయోజన నిరపేక్షము" అను రెండు ప్రసిద్ధ పాశ్చాత్య వాదములను పరిశీలించి యుంటిమి. కళప్రయోజన సాపేక్షము, అది ధర్మపథ నిర్దేశ సంకలితము కావలయును అనువాదమునకుపపత్తులు బలీయములు 'కళకళకోసమే' అనుసిద్ధాంతమును ప్రచారముచేసిన పండితులు 'కళనీతికి ధర్మమునకు సంబంధంలేని ఒక సౌందర్యలోకమని భావించినారు. వాదతీవ్రతలో అవినీతినే కళ ప్రతిపాదింప వలయునని సిద్ధాంతము చేయుటవఱకు పోయినది. కళ 'నీతికి విరుద్ధమను అభిప్రాయమును ప్రకటించిన పండితులెందఱో కలరు. ఒకప్పుడు నీతిసూత్రములు మౌఢ్యము లైనప్పుడు వానిని వ్యతిరేకించుటలో వర్ధమున్నది కొన్ని లౌకిక నీతులకు కాలదోషము పట్టినప్పుడు వానిని అనుసరించి తీరవలయునని ఏ విమర్శకుడును వాదనచేయడు అసలు నీతియే దుష్టమనియు తత్ప్రతిపాదన కావ్యములో ననావశ్యకమని వాదించుట పరిహాసాస్పదము. అట్లే సాహిత్యములో ధర్మోపదేశముండియే తీరవలయుననుట ధర్మపథ నిర్దేశములేని కావ్యము కావ్యమేకాదనుట కూడ తీవ్ర వాదమే.

ఇక ఈ విషయముపై భారతీయ విమర్శకుల అభిప్రాయములను పరిశీలించుదము. భారతీయులు అత్యంత ప్రాక్తనకాలము నుండియు ఆధ్యాత్మికతాభావసంపన్నులు. భారతీయ కళలు ఆధ్యాత్మిక భావములనే చాటును. కళోపాసన ఒక ఆరాధన విశేషముగ మోక్షప్రాప్తికొరకు సాధనముగ భారతీయ కళాకారులు భావించియుండిరి, ఈ భావమే వ్యాసప్రారంభమున నుల్లేఖింపబడిన శ్లోకము చెప్పుచున్నది. ఇక భారతీయ విమర్శకుల అభిప్రాయములను చర్చించుదము.

మన కుపలభ్యమానములగుచున్న భారతీయాలంకార శాస్త్రములలో మొట్టమొదటిది భరతముని ప్రణీతమైన నాట్య శాస్త్రము దీని కలంకార శాస్త్రమని ప్రసిద్ధి లేకపోయినను ఒక విధముగ దీనిని అలంకార శాస్త్రముగ సంభావింపవచ్చును. అలంకారశాస్త్రములనగనే కేవల మలంకారలక్షణములుండుననను భ్రాంతిఒకటి సామాన్య లోకమున ప్రచారములోనున్నది. కావ్యాత్మ కావ్యనిర్వచనము రసస్వరూపము, నాటక లక్షణములు అలంకార నిర్వచనములు మొదలగు కావ్యస్వరూప సంబంధమైన కూలంకష విషయనిలయములే అలంకార శాస్త్రములు తత్కర్తలు. మహా విమర్శకులు. భారతీయ సాహిత్యహృదయమవగతము కావలయునని అలంకార శాస్త్ర పరిజ్ఞాన మత్యంత్యము అపేక్షితము. సరి. నాట్యశాస్త్రము కేవలనాట్యమును గురించియే చెప్పదు. తత్గత విషయములు సర్వకళాపరములు, ఈ నాట్య శాస్త్రము క్రీ. శ. 100–200 మధ్యకాలంలో రచింపబడి యుండవచ్చునని పండితుల అభిప్రాయము.

క్రోధ మద మాత్సర్యములు లోకములో పెచ్చుపెరిగి అధర్మము తాండవము చేయుచున్న కాలములో ప్రజలను స్వధర్మ నిరతులను గావించుటకు నాట్యమావిర్భవించినది, ఇట నాట్య మనగా దృశ్యకావ్యమైన రూపకమును గ్రహింపవలయును. దేవతల ప్రార్థన మంగీకరించి చతుర్ముఖుండీ నాట్యవేదమును నిర్మించెను. ఆ నాట్యస్వరూప మిట్లని పితామహునిచే నిర్మితమైనది.

"ధర్మ్యమర్థ్యం యశస్యంచసోపదేశ్యంస సంగ్రహమ్
భవిష్యతశ్చలోకస్యసర్వకర్మాను దర్శకమ్
సర్వశాస్త్రార్థ సంపన్నం సర్వశిల్ప శిల్పప్రవర్తకమ్
నాట్యాఖ్యాం పంచమం వేదం సేతిహాసం కరోమ్యం
హమ్"

"ధర్మ ప్రతిపాదకమును, చతుర్విధ పురుషార్థ సాధకమును, యశస్కరమును, ఉపదేశ్య సహితమును, సమ్యక్జ్ఞానప్రదమును ముందుతరములవారికి సత్కర్మ మార్గమును ప్రదర్శించునదియును సర్వశాస్త్రార్థ సంపన్నమును, సర్వశిల్ప ప్రవర్తకమును, ఇతిహాసహితమును, అగునట్లుగా నాట్యము, అను వేదమును నిర్మింతును" (పోణంగి శ్రీరామ అప్పారావుగారి అనువాదము) ధర్మ ప్రతిష్ఠాపన కెంత ప్రాధాన్యము నొసంగినాడో భరతుని ఈ వాక్యములను బట్టి స్పష్టమగుచున్నది.

"ధర్మ్యం యశస్యమాయుష్యం హితం బుద్ధి వివర్ధనమ్

లోకోప దేశజననం నాట్యంలోకే భవిష్యతి"

ఆయువును, ధర్మమును, యశస్సును, బుద్ధివికాసమును నాట్యము కలిగించును. ఇట్లు ధర్మోపదేశ ప్రాముఖ్యమును చెప్పినంత మాత్రమున అది యే నాట్యమునకు పరమార్థమని భావము కాదు. రసానందజన కత్వమె ప్రధానము "క్రీడనీయకమిచ్ఛామో దృశ్యం శ్రవ్యంచ యద్భవేత్" అని దేవతల ప్రార్థన. సుఖ దుఃఖ సమన్వితములైన లోక స్వభావము అంగాద్యభినయోపేతమైనప్పుడే అది నాట్యమని పించుకొనును. ఏదో చేతులు త్రిప్పుతూ ధర్మోపన్యాసము చేసినయెడల అది నాట్యముకాదు సదాచారముల నుపదేశించి జనులకు హితమును చేకూర్చుటకే నాటకాది సాహిత్య ప్రక్రియలను మునులవతరింప జేసిరి అని ఆనంద వర్ధన భగవానులు—

"సదాచారోప దేశరూపః నిబంధనాహి నాటకాది గోష్ఠీ వినేయజనహితార్థమేవమని భిరవతారితా"

భరతుని పిమ్మట పేర్కొన దగిన విమర్శకుడు భామహుడు. క్రీ. శ. 500—700 ప్రాంతమువాడు. కావ్యాలంకార మితని గ్రంథనామము. కావ్యమునకలంకారములే ఆత్మయని సిద్ధాంతము చేసిన స్వతంత్ర సిద్ధాంతవేత్త.

"ధర్మార్థ కామమోక్షే షువైచక్షణ్యం కళాసుచ కరోతి కీర్తిం ప్రీతించ సాధుకావ్యని షేవణమ్" పురుషార్థ ప్రతిపాదనమునకెంత ప్రాధాన్య మొసంగినాడో 'ప్రీతించ' అను వాక్కుతో ఆనందమునకంత ప్రాధాన్య మొసంగినాడు. ధర్మ ప్రతిపాదన వైపు మొగ్గు చూపినాడు.

ప్రత్యేకముగ నాటక లక్షణమునకు మాత్రమే పరిమితమైన దశరూపకమను శాస్త్రమును ధనుంజయుడు రచించెను. పదియవ శతాబ్దంలో జీవించి యుండెను—అతడు—

"ఆనందనిష్యందిషు రూపకేషు
వ్యుత్పత్తి మాత్రంఫలవ ల్పబుద్ధిః
యోఽపి ఇతిహాసాదివదాహసాధుః
తస్మైనమః స్వాదుపరాఙ్మఖాయ"

రూపకము వలన కేవల వ్యుత్పత్తిని ఫలితముగ కోరరాదు అట్టిది కోరువారి దాహము తీర్చుకొనుటకు ఇతిహాసముల నాశ్రయించ వచ్చును. స్వాదు పరాఙ్మఖులైన అట్టివారికొక నమస్కారము. ఇది భామహునకు సమాధానము వలెనున్నది. కాని ధనంజయుడుకూడా తనరూపక లక్షణ సందర్భములో నాయకుడుత్తమ గుణ సంపన్నుడు కావలయునని సిద్ధాంతము చేసినవాడే.

నాట్యశాస్త్రమునకు ఆనంద వర్ధనుల ధ్వన్యాలోకమునకు వ్యాఖ్యలు వ్రాసిన అభినవగుప్త సహృదయ భగవానులు—

"చతుర్వర్గ వ్యుత్పత్తే రపిచానంద ఏవ పార్యం తింకం ఫలమ్" అనుషంగిక ఫలము ధర్మోపదేశమే కాని ప్రధానఫలమానందమని సిద్ధాంతము చేసినారు.

మమ్మటుడు కావ్య ప్రకాశికయను గ్రంధమును రచించెను. పదునొకండవ శతాబ్దము తుదిభాగమున జీవించియుండెను—వీరు—

"సకల ప్రయోజన మౌళిభూతమ్
సమనంతరమేవ రసాస్వాదన సముద్భూతమ్
విగళిత వేద్యాంత రమానందమ్"
అని ప్రధాన ప్రయోజన మానందమని అభిప్రాయపడినారు

తర్వాత ప్రసిద్ధులైన ఆలంకారికులలో సాహిత్యదర్పణకర్త విశ్వనాథుడొకడు. క్రీ. శ. పదునాల్గవ శతాబ్దివాడు.

"చతుర్వర్గ ఫలప్రాప్తిః
సుఖాదల్ప ధియామపి
కావ్యాదేనయతస్తేన
తత్స్వరూపం నిరూప్యతి"

అల్పమైన బుద్ధిగలవారలకు పురుషార్థ సాధనోపకరణమగు కావ్యస్వరూపమును నిరూపించెదను.

భారతీయ విమర్శకుల అభిప్రాయములో కేవలము కళ ప్రయోజన నిరపేక్షమనిన వారులేరు. ఈ విషయమే ఆసిద్ధాంతమునకు సార్వజనీనత లేదని చాటి చెప్పిచెప్పుచున్నది. ధర్మపథ నిర్దేశమునుండితీరవలయునని చెప్పుచూ అది రసానంద జనకత్వశక్తయై యుండవలయుననియే భారతీయ విమర్శకులాదేశించిరి. ఆనందమునుండియే బ్రహ్మముద్భవించినది. సర్వభూతములు ఆనందమునుండియే జన్మించినవి, ఆనందములోనే జీవించును, ఆనందములోనే లయమగును. కావ్యానంద పరువశుడై వాసుత్తమ సంస్కారియై తద్వారమున మోక్షప్రాప్తి పొందగలడని భారతీయ విశ్వాసము. భారతీయ సాహిత్యము సర్వము పాఠకుని పరమాత్మోన్ముఖునిచేయుటయే ఆదర్శముగ గలిగినది. "అపారే కావ్యసంసారే కవిరేవ ప్రజాపతిః" అని కవిని బ్రహ్మతుల్యునిగపూజించిరి, జనులను తన శక్తిచే వీతరాగు

లను జేయగలదు. లోకమును శృంగారమయము చేయగలదు. కవి ఋషి లోకధర్మమును తనలో అవిష్కరింపచేసికొని తన ఆత్మ సంస్కార బలముచే లోకమునకు రసానంద జనకముగ దివ్య సందేశము నిచ్చువాడు ఋషియైనకవి. అంతయేకాని మానవునిలో తుచ్ఛమైన కామవాంఛలేపి మనిషిని పశుతుల్యునిగ చేయువాడు కవి కాడు. పరిణామోన్ముఖము. ధర్మబద్ధముగాని శృంగారభావము వర్జనీయము.

ఇట్లనుటచే కావ్య ప్రపంచములో దుష్టపాత్రలకు స్థానమీయ రాదనికాదు. తన్నిర్వహణము ధర్మశిఖరముల నధిరోహించవల యునని మాత్రమే యుద్దేశ్యము. పరాదారాపహరణము పాపము నరక హేతువు అని చెప్పుటకే సీతాపహరణమును గూర్చి చెప్ప బడినది. భాతృ, పితృ, పత్నీ ధర్మముల కొక మహావ్యాఖ్యానము రామాయణ మహాకావ్యము. పదవీ వ్యామోహము, పరోత్కర్షన సహింపలేకపోవుట దురాలోచన మొదలగునవి దుష్టములని చెప్పుటయే దుర్యోధన పాత్రపతనమును వర్ణించుట. ఈ విధముగ నిర్వహణమును బట్టి కావ్యపఠనమువలన మనకుగలుగు సంస్కారమును బట్టి కావ్యవిలువను గ్రహించవచ్చును. పరమ సాధ్విసీతను పతితగ సృష్టించుట ధర్మవిరుద్ధము. తనను పెంచి పెద్దచేసిన తండ్రిని హత్యజేసిన కుమారుని జీవితము మూడు పువ్వు లారుకాయలుగ విరాజిల్లినదని చెప్పుట ధర్మవిరుద్ధము. ఇట్టివి కావ్యములో వర్ణింపరాదు. కావ్యాలాపాంశ్చ వర్జమేత్" అను శృతివాక్య మిట్టి అసత్కృతి విషయమే. కావ్య పఠనము వలన సహృదయ హృదయము హ్లాదైకమయమై ఒకానొక ఉదాత్త జీవిత పథములో అతని జీవితయాత్ర సాగవలయును. అట్టిదే సత్కావ్యము అతడే మహాకవి ఋషి. ప్రపంచ మహాకవులెవరును అధర్మమును ప్రతిపాదించలేదు.

ధర్మము ఒక విధముగ అలౌకికమైనది. ఈ సృష్టిలోని విషయములను గురించి సృష్టికి మూలమైన పరమేశ్వరునిగురించి మానవ జీవితమును గురించి తాత్త్వికముగ ఆలోచించిన ప్రతి ఆలోచన ధర్మకోటిలో చేరునదే. ధర్మ ప్రతిపాదనమనగ ఏదో మత సిద్ధాంతముల ప్రచారము చేయుట కాదు. ఆత్మ శాశ్వత మైనది. దానికి జరామరణములు లేవు. శీర్ణ వస్త్రముమ విడిచి మరల నూతన వస్త్ర ధారణ చేయునట్లు ఈ శరీరమును విడిచి ఆత్మ మరల రూపమును పొందును అనుట మహాధార్మిక సంబంధమయిన ఆలోచన. ఇట్టివి ధర్మకోటిలో చేరునవి. నీతులు కొన్ని లౌకిక సంబంధములైనవి. పరుల సొమ్ము దొంగిలింప రాదనుట నీతి. మానవ సంఘమునకు కాలక్రమమున వ్యవస్థ చేకూర్చునవి నీతులే. కొన్ని నీతులు కాలక్రమమున మార వచ్చును. ఒక కాలములో పాంచాలిపద్ధతి నీతి. ఇప్పుడుకాదు. అట్లని ధర్మము, నీతి సార్వకాలికము కాదనరాదు. సార్వపాత్రి కము, సార్వకాలికము, సార్వజనీనములు అయిన ధర్మపథ నిర్దే శము సాహిత్యమునకు తేజస్సు నొసంగును. ఆనందమయ లోకములో ధర్మపథ నిర్దేశమొక పూల పందిరి.



# సంక్షేమరాజ్యము

శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి.

ప్రకటితాభ్యుదయమార్గప్రాప్తనిధివోలె
నొకప్రణాళిక పేదలకు లభించి;
భారతీయాత్మ పూర్వప్రాభవం బొప్పఁ
బునరవతరణవిస్ఫూర్తి నొంది;
నవభారతాదర్శసవితృమండలదీప్తి
పర్విన ప్రతిచోట బ్రతుకువెలిఁగిఁ
పదియేండ్ల వెనుక స్వప్నప్రాయ మైనట్టి
యొకయూహ నిజము కాలూని నిలిచి।
జాతిజాతి యెల్లఁ జైతన్య మాత్మలోఁ
గదలి యాద నడుముఁ గట్టి లేచి
యొకమహోద్యమమ్మ నూహించి పూవులు
పఱచు భావిసౌఖ్య పథములందు,

పూతనదీజలంబు పరిపూత మనస్వి తపస్వి తత్వవి
ఖ్యాత వచస్సుధాలహరులందునఁ దేలుచునుండ భారత
క్ష్మాతలి దేశనాయకులు స్థావర జంగమ భుక్తి ముక్తి సం
ధాతలుగాఁగ నొప్పి ప్రమదంబునఁ గూర్చిరి అబ్ధిసంతతిన్.

నీది ప్రణాళిక నీది రాజ్యంబు
లేదు దుఃఖంబింక లే దింక లేమి
గ్రామ పరిపాలనా క్రమము మారంగ
సామాన్యునకు రాజసామ్య మబ్బినది
సాగ దన్యాయంబు సాగ దతృప్తి
ఆగ దీయభివృద్ధి ఆగదు రథము.
నీది ప్రణాళిక నీది రాజ్యంబు
లేదు దుఃఖం బింక లే దింక లేమి.

ఒకక్రొత్తకాల్వ పచ్చికబీళ్లపైఁబారి
సస్యసమృద్ధి విశ్వాస మిచ్చి;
ఒకక్రొత్తచోట విద్యుత్కాంతి పడి దాస్య
తిమిరమ్ము పారినతెరువు తోఁచి;
సమతాసమాజలక్ష్య ప్రాప్తి కనుచూపు
దూరమై, దాదాపు చేరినట్టి
తీరమై; పట్టినదీక్ష సాధించిన
తృప్తితో దేశ ముత్తేజ మంద;
సౌఖ్యదాయి ప్రణాళిక సాగు; నేఁటి
జనుల పథక నిర్మాణ కౌశలముఁ జూచి
జరిగిపోయిన కాల మచ్చెరువు పడఁగ
భావితరములు తనకు నివాళు లిడఁగ

భరతోర్వి పూర్వైభవ
భరితముగా నెంచు సౌఖ్య పరిమళములతో
విరిసిన ప్రణాళికా సు
స్థిరపథ జీవనము తీర్చి దిద్దినయట్లై.



అన్నిరాళ్ళ గుట్టల్లో, వన్నెల రతనాలుంటే
ప్రతియేనుగు తనలోనూ, అతులితముక్తాలుంటే
కనపడియెడి ప్రతి అడవిని, గంధపుచెట్లేఉంటే
యెక్కడపడితే అక్కడె, దక్కుతారు సత్పురుషులు—

—"ప్రజానీతి"

# అభ్యుదయపథంలో "పైన" గ్రామం

"చక్రవర్తి"

పందలపాక ఈనాడు జట్టుమిల్లుకు ప్రసిద్ధి. ఆ ప్రాంతం అంతా పచ్చని పంట భూములు రెండువందల సంవత్సరాలక్రిందట అక్కడ కొంత మెరకవ్యవసాయము మాత్రం జరుగుతూ ఉండేది. చిట్టడవులలో లేళ్లూ జింకలూ తిరుగుతూ ఉండేవి. పందల పాక గ్రామంలో నివసిస్తూ ఉండిన ఒక క్షత్రియ గృహస్థుడు ఒకనాడు జాగిలాన్ని వెంటతీసుకొని గుర్రం మీద వేటకు బయలుదేరాడు. ఒకచోట ఒక కుందేలు ఆ వేట కుక్కను అటకాయించి ముందుకు పోనివ్వలేదు. పౌరుషం గలస్థలం అని ఆయన ఆచోటనే యిల్లు కట్టుకున్నాడు. ఆయన కోసం ఎవరైనా పందలపాకవస్తే రాజుగారు "అపైన" ఉన్నారని అక్కడివారు చెప్పేవారట. క్రమక్రమంగా అక్కడ ఇంకా ఇళ్లులేచాయి. ఒక ఊరు అయింది. అదే ఇప్పటి పైన గ్రామం [కూర్పు: రాజబాబు ; ప్రచురణ: శ్రీ వెంకట సుబ్బరాజా రిక్రియేషన్ యూత్ క్లబ్, పైన గ్రామం, కాకినాడ తాలూకా తూర్పు గోదావరి జిల్లా]

గ్రామంలో రెండు రామమందిరాలూ, వీరభద్రస్వామి ఆలయమూ అమ్మవారిగుడీ ఉన్నాయి పిల్లలులేని స్త్రీలు దోసిలి పట్టితే పూజారి మంత్రాలు చదువుతాడు. చేతిలో ఒక పువ్వు పడుతుంది ఆలా పువ్వు పడితే పిల్లలు పుడతారు. పడకపోతే పుట్టరు. ఇది వీరభద్రాలయంలో కనబడే నిదర్శనమట,

విజయనగర సంస్థానం విలసిల్లిన రోజులలో ఈ గ్రామం నుంచి వెళ్లిన ఒక రాజుగారు దివాను అయ్యారు పెద్దాపురం రాజా వారు వేటకు వచ్చినపుడు ఆయన ఏనుగు చెరువులోని ఊబిలో దిగబడి పోయింది. పైన గ్రామంలోని ఒక క్షత్రియుడు ఏనుగు తొండానికి చెయ్యిఅందిచ్చి పైకిలాగాడు. ఆయనకు ఒక అగ్రహారం లభించింది

1956 వరకూ గ్రామంలో ఎటువంటి అభివృద్ధి కనబడలేదు. ఆనాటినుంచి గ్రామస్థులు సమాజ వికాస కార్యక్రమాన్ని ఉత్సాహంతో అమలు జరుపుకుంటున్నారు. రెండుపాఠశాలలు స్థాపించుకున్నారు ఇందులో ఒకటి హరిజన పేటలో ఉంది. సమితి. పంచాయతీ బోర్డుల డబ్బుతోనూ, ప్రజల విరాళాలతోనూ. మెయిన్ స్కూల్ బిల్డింగ్ తయారయింది. హరిజనపేటలోని స్కూలు కోసం ఒకరు పదిసెంట్ల భూమి విరాళం ఇచ్చారు. ప్రజల నుంచి రూ. 1600 వసూలయ్యాయి.

భజనమండలి. సెట్టిబలిజ రిక్రయేషన్ సెంటర్, వయోజన విద్యాకేంద్రం శ్రీ వెంకట సుబ్బరాజా రిక్రియేషన్ యూత్ క్లబ్ శ్రీ వీరేశ్వర గ్రంథాలయం, పంచాయతీ రీడింగ్ రూమ్, మాతా శిశు సంరక్షణాలయం–ఇవి ఈ గ్రామంలో పని చేస్తున్న సంస్థలు.

వ్యవసాయంలో కొత్త పద్ధతులు అవలంబిస్తున్నారు గొట్టపు బావులు పెట్టించుకున్నారు. ఒక కల్వర్ట్ కట్టించుకున్నారు. ఒక ప్రాథమిక పశు చికిత్సా కేంద్రాన్ని బ్లాకు ఏర్పాటు చేసింది. గ్రామస్థులు ఒక బ్రీడింగ్ బుల్‌ను పోషిస్తున్నారు. పది ఎకరాల విస్తీర్ణం గల చెరువులలో చేపలు పెంచుతున్నారు.

పదిహేను సంవత్సరాల క్రితం ఈ గ్రామంలో వారికి సహకార భావం ఉండేది కాదట, ఒకసారి ఇద్దరు గ్రామస్థుల మధ్య దూడల విషయంలో తగవు వచ్చి వంద ఎకరాల భూమి కోర్టు వ్యవహారంలో హరించి పోయిందట, ఈ నాడు గ్రామస్థులు శ్రీ వీరేశ్వరీ మల్టిపర్పస్ రూరల్ క్రెడిట్ సొసైటీని ఏర్పాటు చేసుకున్నారు, బాంక్ కమ్ గోడౌన్ బిల్డింగ్ కట్టడానికి ప్రజలు 30 సెంట్ల భూమిని విరాళంగా ఇచ్చారు.

పంచాయతీ బోర్డుకు జరిగినరెండు ఎన్నికలలోనూ మెంబర్లు ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు శ్రమదానంతో వీథులలో మట్టి పని చేశారు. గ్రామకంఠంలో ఉన్న అన్ని వీధులనూ. అన్ని సందులకూ కంకరరోడ్డు పడింది. పదఫర్లాంగుల మట్టిరోడ్డు శ్రమదానంతో తయారయింది, మంచినీళ్ల చెరువు బాగుచేయించు కున్నారు. మంచినీళ్లనుయ్యి తవ్వించుకున్నారు మురికి నీరు పోవడానికి ఏర్పాటు చేస్తున్నారు. ఆసుపత్రికోసం రూ 5000 భవనం ఉచితంగా లభించింది విద్యుచ్ఛక్తి వచ్చింది. 25 వీధి దీపాలు పడాయి. ప్రతి గురువారం మార్కెట్ పెట్టడానికి వెయ్యి రూపాయిల స్థలం ప్రజలు సంపాదించారు, బ్రాంచిపోస్టాఫీసు స్థాపించబడింది.

1956 నుంచీ పైనగ్రామం సాధించిన అభ్యుదయాన్ని వివరించే ఈచిన్న పుస్తకం ఉచితంగా లభిస్తుంది. సాధారణంగా ఇలాంటి ప్రచురణలు చదవడానికి అంతరంజకంగా ఉండవు కాని దీనిలో స్థానిక చరిత్ర. స్థల మహాత్యం ఇంకా ఇతర విషయాలకు సంబంధించిన విశేషాలు ముచ్చటగా వర్ణించ బడ్డాయి ఈ కరపత్రంలో గ్రామప్రజల ప్రగతి కాంక్ష కార్యదీక్ష ప్రస్ఫుట మవుతున్నాయి, పైన గ్రామంలో ఈ అయిదేళ్లలో సాధించిన విజయం ప్రశంసాపాత్రం అని అనిపిస్తోంది.



ఉన్నవండలనుచు ఊరకేపొంగకు
అందబాడ బ్రతుకు గండివడుచు
జీవనస్రవంతి ఛిన్నమౌ భిన్నమౌ
జననుతాంతరంగ! వినురరంగ!

—"కృష్ణశతశతి"

# పారిశ్రామిక విశేషాలు

(1961 నవంబరు)

(రాష్ట్రపారిశ్రామిక రంగంలో అనుదినం అభివృద్ధి పథకాలు ప్రవేశపెట్టబడుతున్నాయి. పారిశ్రామికవేత్తలు, ప్రజలు వాటినిగురించి తెలుసుకోటం అవసరం అనేదృష్టితో ముఖ్యపారిశ్రామిక విశేషాలు ఈ శీర్షికక్రింద యివ్వటం జరుగుతున్నది.)

## కేంద్రపథకాలు

### సింథటిక్ డ్రగ్స్ ఫ్యాక్టరీ

సింథటిక్ డ్రగ్స్ ఫ్యాక్టరీ స్థాపనకు ఏర్పాట్లు శీఘ్రగతిని జరుగుతున్నాయి. ఈ ఏర్పాట్లను పరిశీలించి సలహాలనిచ్చే నిమిత్తం ఇటీవల రష్యా నిపుణులు హైదరాబాదుకు వచ్చారు.

### భారీ విద్యుత్పరికరాల కర్మాగారం

భారీ విద్యుత్పరికరాల కర్మాగారానికి స్థలాన్ని సమకూర్చుకొనడం ముగిసింది. రామచంద్రాపురం సమీపంలో ఈ కర్మాగారాన్ని నెలకొల్పుతారు.

### ఉక్కు యంత్రాగారం

ఆంధ్ర ప్రదేశ్‌లో ఉక్కుయంత్రాగారం స్థాపనకు సంబంధించిన ఆర్థిక ప్రయోజనలను పరిశీలించే నిమిత్తం, ఖమ్మంమెట్టు ప్రాంతంలో లభించే ముడి ఇనుము "డాల్మిటిక్" సున్నపురాయి నమూనాలనూ, సింగరేణి బొగ్గు కోల్ సైట్ నమూనాలను ఇటీవల జంషడ్‌పూర్‌లోని నేషనల్ మెటలార్జికల్ లేబొరెటరీలో పరీక్షించారు. ఈ పరీక్షలు ప్రోత్సాహకరమైన ఫలితాల నిచ్చినట్లు తెలుస్తున్నది.

### ప్రైవేటు రంగం

సంవత్సరానికి 15 మిలియన్ గ్యాలనుల పరిశ్రమల "ఆల్కోహాల్"ను ఉత్పత్తి చేయగల ఒక డిస్టిలెరీని విశాఖపట్నంలో స్థాపించటానికి భారత ప్రభుత్వం ఒక ప్రైవేటు సంస్థకు లైసెన్సు మంజూరు చేసింది. ఈ "ఆల్కోహాల్"ను "పోలిస్టెర్న్" ఉత్పత్తికి ఉపయోగిస్తారు. దీనికొరకై ఈ సంస్థకు ఇదివరకే లైసెన్సు మంజూరు చేయటం జరిగింది.

గాజు పనిముట్లు, ప్రత్తిగింజ నూనె మొదలైన వాటి ఉత్పత్తికై రాష్ట్రంలో ప్రైవేటు పారిశ్రామిక వేత్తలకు లైసెన్సులు ఇచ్చారు.

ఎత్తుడు సాధనాలు, తూనిక సాధనాలు, ఎలక్ట్రిక్ మోటార్లు, బాల్ బేరింగులు మొదలైన వాటి ఉత్పత్తికై ప్రైవేటు పరిశ్రమలదార్లు పెట్టుకున్న దరఖాస్తుల విషయంలో రాష్ట్ర ప్రభుత్వం కేంద్రానికి సిఫార్సు చేసింది.

### సహకార రంగంలో చక్కెర పరిశ్రమ

ఆముదాలవలస, చోడవరం, పాలకొల్లు, చిత్తూరులలో సహకార చక్కెర ఫ్యాక్టరీల స్థాపనకు చురుగ్గా ఏర్పాట్లు జరుగుతున్నవి. 1961–62 "క్రషింగ్ సీజను"లో బహుశా ఇవి ఉత్పత్తి ప్రారంభించవచ్చు. ఏటికొప్ప, తుమపాల, తునిల లోని చక్కెర ఫ్యాక్టరీల విస్తరణ కార్యక్రమం అమలు జరుగుతున్నది. 1961–62 "క్రషింగ్ సీజన్" నుంచి బహుశా వీటి ఉత్పత్తి పెరుగుతుంది. 1961–62వ సంవత్సరాంతానికి ఈ యేడు సహకార చక్కెర ఫ్యాక్టరీలు కలిసి రోజుకు 5,850 టన్నుల చెరకును పిండగలుగుతాయి. నిర్మాణంలోనున్న సహకార చక్కెర ఫ్యాక్టరీలకు వఅసరమైన ఋణాలు పొందటానికి హామీ వుండే విషయాన్ని ప్రభుత్వం పరిశీలిస్తున్నది.

నిజామాబాదు జిల్లా జనకం పేటలో సహకార చక్కెర ఫ్యాక్టరీని స్థాపించటానికి ఇప్పుడు భారత ప్రభుత్వం కూడా లైసెన్సు ఇచ్చింది. ఇది రోజుకు 1,000 టన్నుల చెరకును పిండ కలుగుతుంది. 1962–63 క్రషింగ్ సీజనుకు పూర్వమే దీనిని స్థాపించవలసి వుంది.

## నిజాం చక్కెర ఫ్యాక్టరీ

నిజాం చక్కెర ఫ్యాక్టరీ విస్తరణ కార్యక్రమం త్వరిత గతిని అమలు జరుగుతున్నది. వేతనాల బోర్డు సిఫార్సుల ప్రకారం. రోజువారీ వేతనాలు చెల్లించబడే కార్మికులందరికీ కనీస వేతనాలు మంజూరు చేయటానికీ, నిపుణులైన పనివారలకూ ఇతరులకూ రిటెన్షన్ అలెవెన్సు చెల్లించటానికి ఫ్యాక్టరీ నిర్వాహకులు నిశ్చయించారు.

పబ్లిక్ వర్క్సు శాఖా మంత్రి 1961 అక్టోబరు 28వ తేదీన ఈ ఫ్యాక్టరీని సందర్శించారు. పబ్లిక్ వర్క్సు శాఖ (ఇరిగేషన్ విభాగం) చీఫ్ ఇంజనీరు ఫ్యాక్టరీల ఛీఫ్ ఇనస్పెక్టరు ఆ సందర్భంలో మంత్రివెంట వున్నారు.

## సింగరేణి కాలరీస్

కాలరీల ఉత్పత్తి పెరుగుతూవుంది. 1961 అక్టోబరు మాసాంతం వరకు 2,251,803 1 టన్నుల ఉత్పత్తి జరిగ్గా, క్రిందటి సంవత్సరం ఇదే కాలంలో 2,016,963 1 టన్నులు ఉత్పత్తి జరిగింది.

## ప్రాగాటూల్స్ కార్పొరేషన్

కార్పొరేషను జనరల్ మేనేజరు శ్రీ వెంకట్రామన్ 1961 అక్టోబరు 18వ తేదీనుంచి పదవీ విరమణ చేశారు కార్పొరేషను నూతనాధ్యక్షునిగా శ్రీ పి. ఎస్ రావు ఐ సి ఎస్ (రిటైర్డ్) ను భారత ప్రభుత్వం నామినేటు చేసింది.

యంత్ర పరికరాల కర్మాగారం ప్రాజెక్టు నివేదిక సరఫరా విషయంలో ప్రా టూల్స్ వారు గత మార్చి నెలలో పోలండ్ లోని "సెకప్" అనే సంస్థతో ఒప్పందం కుదుర్చుకున్నారు. నివేదికకు తుది స్వరూపం ఇచ్చే విషయంలో చర్చలు జరిపే నిమిత్తం కార్పొరేషను సాంకేతిక సలహాదారునూ, జనరల్ మేనేజరును విదేశాలకు పంపించింది.

## చేతి పరిశ్రమలు

సప్తమ అఖిలభారత చేతి పరిశ్రమల సప్తాహం రాష్ట్రంలో 1961 నవంబరులో జరిగింది లఘు పరిశ్రమలు, ఎక్సైజు శాఖల మంత్రి నవంబరు 20వ తేదీన హైద్రాబాదులోని ప్రభుత్వ చేతి పరిశ్రమలు, కుటీర పరిశ్రమ విక్రయశాలలో సప్తాహనికి ప్రారంభోత్సవం చేశారు రాజధానిలోనే కాకుండా రాష్ట్రంలోని అన్ని ముఖ్య పట్టణాలలోకూడా ఈ సప్తాహం జరిగింది.

న్యూ ఢిల్లీలో 1961 నవంబరులో జరిగిన భారత పారిశ్రామిక ప్రదర్శనంలోని ఆంధ్రప్రదేశ్ మంటపం స్వదేశీయులు విదేశీయులు అయిన ప్రేక్షకులను విశేషంగా ఆకర్షించినది.



ధర్మాధర్మ-న్యాయాన్యాయ- విచక్షణలేకుండా ధనం సంపాదించడమే

జీవితలక్ష్యమైతే ప్రతిఫలంగా తుదకుమిగి లేది అసంతృప్తిమాత్రమే- అబ్రహాంలింకన్

# మందలింపు

శ్రీ కొల్లా శ్రీకృష్ణారావు

[వీరమేడపిలో బొంగరాలాడుచున్న బాలచంద్రునిచే వట్టుతప్పిన బొంగరము వేషాంబయను వైశ్యకాంత కాలి గిలకకుఁదగిలినపుడామె యా బాధకు నలమటించుచు బాలుని మందలించుట.]

ఓరి దౌర్భాగ్యుఁడా! శీలముజ్జగించి
పరువు మర్యాదలను గంగపా లొనర్చి
నిరపరాధను నను(గొట్టి నెగులువెట్టి
మాటలాడవు నీకేమి చేటువచ్చె?

తేరకుఁదేరమేసి పలుతిప్పలఁ ద్రిమ్మరి పండువంటి సం
సారము పాడుసేయ నణు మాత్రము జంకవు గొంకవేమి? యీ
తీరున గాసిసేయఁగలదే యశమున్నది? చించి చెండి ని
న్నూరికి నుత్తరాన నుసురూడ్చిన మాడ్చిన దోసమున్నదే?

పనిపాటేదియు లేమిచేఁ గనులు క్రొవ్వన్నొవ్వు నైరింప నన్
మనమందెవ్వతఁగాఁదలంచితివి? నేమాంచాలనా? వేశ్యనా?
కనువారల్ వినువారలే మనిన సిగ్గా యెగ్గ కిగ్గా డికిన్?
జనిలగ్నమ్మదియేమొ పుట్టిన మొదల్ సాగింతు వీ గంతులన్

అతుల ప్రాభవ వైభవోన్నతికిఁ బ్రోవై నీతికిన్ మూలమై
నీతికింజాలిన పద్మనాయకుల యింటంబుట్టి నీవిట్లు దు
ర్మతివైతే? మగనాంధ్ర గంటి తడిసర్వన్ బిట్టుకొట్టాడవే
బ్రతుకుల్, పాడటి వల్లకాడులయి పోవాయూళ్లు? గర్వోద్ధతా!

ఇదినా గొంతుక గండకత్తెరగుగాదే? మామలే విన్న నో
ర్చెదరా? లోకము నోరు మూయఁగలమా! చీవాట్లిరున్ నైతునా?
ముదితంగొట్టెడు జెట్టివైతివ? బలమ్ముంజూపఁగాంక్షించుచోఁ
బదరాపోరికి రెడ్డినాగమ నెదుర్పన్ బాలవీరాగ్రణీ!

అరివీర సమర తూర్యధ్వాన మాలించి బ్రహ్మన్న కలవర పడ్డనాఁడు
నాగమ్మ సలుపు దుర్ణయము లాకర్ణించి పెద్దన్న పొలికేక పెట్టునాఁడు
నలగామనృపుని మంత్రాంగమ్ము నూహించి కొమ్మన్న బవరమ్ము గోరునాఁడు
నరసింగరాజె సన్నాహమ్ము వీక్షించి మంచన్న రిపులఁ గవ్వించునాఁడు
మూలబలము మాఱుమూఁ కలందును మాడ
నీలగొట్టి పరువులెత్తునాఁడు
పోరి దెసకుఁ బోకపొలఁతులపై దూఁక
బాలచంద్ర! ధర్మపథమె నీకు?

ఒకవంక నాగమ్మ హుంకారముంజేసి నాయనిపైఁ గత్తిదూయుచుండ
ఒకవంక మలిదేవుఁడుక్కిరి బిక్కిరై ముకుబంటి పోరిలో మునుఁగుచుండ
ఒకవంక వెంకు బాహల్లా సముంజూపి కలనిలో నరులనుగ్గాడుచుండ
ఒకవంక రేచెర్ల యువలు మీసలుదువ్వి దురమున మేమని దుముకుచుండ
పిగ్గులగు లేకహెగ్గడి కాఁపువై
యాడికొనుట నీకుఁ బాడి గాదు
భీతిలేక రిపుల వెన్నాడి మున్నాడి
పేరు వాడి విజయభేరి చరుము.

ఆఁడుది గత్తిఁ బూని కలహమ్మొనరింపఁగ ముమ్మరింప వె
న్నాడిన పోటుకాంద్రఁదునుమాడఁగ మీబలఁగమ్ము చిట్టుము
ట్టాడుచు వేగిరింప ననికై యిరువాఁగులు సుత్సహింప నీ
వాడుచుఁబాడు చుండఁదగునా? మగపోడుము లీడఁబోయెనా?

కనుఁగొమ్మా! రణభేరి భాంకృతులు దిక్చక్రమ్ము ఘూర్ణిల్ల మ్రోఁ
గినవాక్కుమ్మడి, బల్లెనాడు హృదయ క్లేశమ్ముతో నావులిం
చె; న జాంఁ మ్ములు పిండిసేయఁగల వజ్జీరుల్ మహా వీరతన్
రణమో? మారణమో? యెఱుంగకటు పోరన్ బొంగరాలాడు దే?

ఆలము దాఁపరింప వెనుకంజను వేయ సమంజసమ్మె? నిం
దాలయమైన దుర్యశమునందఁగ భావ్యమెనీకు? జన్మ జ
న్మాలకు మాసిపోని పలనాటి ప్రతిష్ఠను నిల్పఁబూను మో
శీలము వంశవారిధి నిశీథవ! మాటలు వేయు నేటికిన్.



# ఆంధ్రప్రదేశ్‌లో గుల్హాతీకమిషను పర్యటన

శ్రీ టి. వి. కృష్ణ

శ్రీ ఎన్. డి. గుల్హాతీ అధ్యక్షతన నియమించబడిన కృష్ణా–గోదావరి కమీషను సభ్యులు నవంబరు 6 వ తేదీన ఆంధ్ర ప్రదేశ్ పర్యటన ముగించుకున్నారు వీరు రాష్ట్రంలో పదిరోజుల పాటు పర్యటించారు. కృష్ణ గోదావరి నదులపై ఇరిగేషన్ ప్రాజెక్టులకు సంబంధించి రాష్ట్రావసరాలను గూర్చి తమ పర్యటన సందర్భంలో తెలుసుకున్నారు. శ్రీయుతులు డి. డి. జైని, ఆర్. సి. హూన్‌గారలు కమిషను ఇతరసభ్యులు కృష్ణా, గోదావరి నదులలో లభించగల నీటి పరిమాణాలను అంచనావేసి ఈ నదులు ప్రవహించే రాష్ట్రాలైన ఆంధ్రప్రదేశ్, మైసూర్, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, ఒరిస్సాల అవసరాల ప్రాతిపదికపై ఈ రాష్ట్రాల మధ్య నదీజలాల కేటాయింపు దామాషాను సూచించే నిమిత్తం భారత ప్రభుత్వం ఈ కమిషన్ను నియమించింది.

1951 వ సంవత్సరంలో ప్రణాళికా సంఘంవారు ఏర్పాటు చేసిన ఈ రాష్ట్రాల మంత్రుల సమావేశంలో కృష్ణా గోదావరి నదీజలాలను పొందడానికి హక్కుగల ఈ అయిదు రాష్ట్రాల మధ్య జలాల పంపిణీ విషయంలో ఒక ఒడంబడిక కుదిరిందనే విషయాన్ని ఈ సందర్భంలో ప్రస్తావించటం అవసరం. అప్పుడు యూనియన్ సరఫరా, ఉత్పత్తి శాఖల మంత్రిగావున్న శ్రీ ఎన్. వి. గాడ్గిల్ కూడా ఆ సమావేశానికి హాజరయ్యారు. ఈ ఒడంబడిక పూర్తిగా 25 సంవత్సరాలపాటు అమలు జరగవలసివుంది. ఒడంబడికను పునఃపరిశీలించటంలేదా సవరించడం ఈ గడువుతరువాతనే కాని జరగడానికి వీలులేదు. 1951 ఒడంబడిక ఆధారంగా ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం రూ. 120 కోట్లు ఖర్చయ్యే నాగార్జునసాగర్ ప్రాజెక్టు రూ. 20 కోట్లు వ్యయమయ్యే తుంగభద్ర ఎగువ కాలువ ప్రాజెక్టు మొదలైనవాటికి కేంద్ర జలవిద్యుత్ సంఘంనుంచీ, ప్రణాళికాసంఘంనుంచీ భారత ప్రభుత్వంనుంచీ ఆమోదం పొందింది ఆదిలాబాదు జిల్లాలలో పోచంపాడు ప్రాజెక్టుకు కర్నూలు జిల్లాలలో శ్రీశైలం ప్రాజెక్టుకు సంబంధించి రాష్ట్రప్రభుత్వం చేసిన ప్రతిపాదనలు ప్రణాళికా సంఘం ముందున్నాయి వాటికి ఆమోదం లభించవలసి వుంది.

తొలుత మద్రాసుకు కేటాయించబడి, ఆంధ్ర రాష్ట్రావతరణ ఫలితంగా ఇప్పుడు ఆంధ్రకు కేటాయించబడిన తుంగభద్ర జలాలను ఆంధ్ర మైసూరు రాష్ట్రాలమధ్య తిరిగి కేటాయించే విషయంలో ఈ ఉభయ రాష్ట్రాలమంత్రుల మధ్య చర్చలు జరిగి ఒడంబడిక కుదిరింది భాషాప్రయుక్త రాష్ట్రాల నిర్మాణంఫలితంగా పూర్వ హైద్రాబాదు రాష్ట్రంనుండి కొన్ని మైసూరు, మహారాష్ట్ర

లకు మారటంవల్లనేమి, బొంబాయి, మైసూరు రాష్ట్రాలనుండి కొన్ని భాగాలు బదిలీ కావటంవల్లనేమి లోగడచేసిన నదీజలాల కేటాయింపును పునః పరిశీలించవలసిన అవసరం లేదు. కేంద్ర జల–విద్యుత్ కమిషను వారు ఈ విషయాన్ని క్షుణ్ణంగా పరిశీలించి న్యాయబద్ధమైన దామాషాపద్ధతిని సూచించారు. దీనిని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చాలావరకు అంగీకరించింది.

కాని దురదృష్టవశాత్తు, మహారాష్ట్ర మైసూరు మొదలైన కొన్ని పొరుగు రాష్ట్రాలు, 1951 ఒడంబడికను రద్దుపరిచి, వివిధ రాష్ట్రాలచే కృష్ణా, గోదావరి నదీజలాల వినియోగానికి సంబంధించిన అంశాన్ని పునః పరిశీలింపించి ఈ జలాలను పైరాష్ట్రాలమధ్య తిరిగి కేటాయించాలనే కోర్కెను వెల్లడించాయి. కాని ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం అప్పటి రాష్ట్రప్రభుత్వాలు ఒప్పందం కుదుర్చుకున్న ప్రకారం ఈ ఒడంబడిక పూర్తిగా 25 సంవత్సరాలు అమలు జరిగి తీరాలని చెప్పి పై వాదాన్ని నిరాకరించింది. మహారాష్ట్ర, మైసూరు ప్రభుత్వాలు లేవనెత్తిన వివాదాన్ని, అంతర్రాష్ట్రీయ సమావేశాన్ని ఏర్పాటు చేయటంద్వారా పరిష్కరించటానికి యూనియన్ ఇరిగేషన్ విద్యుత్ మంత్రిత్వశాఖ ప్రయత్నించింది. కాని మహారాష్ట్ర, మైసూరు ప్రతినిధులు 1951 ఒడంబడికను రద్దు పరచాలని పట్టుపట్టినందునా, ఆంధ్రప్రదేశ్ ప్రతినిధులు ఈ వాదాన్ని ప్రతిఘటించినందున ఈ అంతర్రాష్ట్రీయ సమావేశం ఫలించలేదు.

ఈ పరిస్థితుల దృష్ట్యాభారత ప్రభుత్వం కృష్ణా–గోదావరి కమిషన్ను నియమించింది. ఇదే గుల్హాతీ కమిషను. ఈ కమిషను విధులలో 1951 ఒడంబడిక పరిశీలన లేకపోయినప్పటికీ, ఆచరణలో ఈ ఒడంబడిక పరిశీలన జరుగవచ్చునేమోనని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, ప్రజలు శంకిస్తున్నారు. వివిధ రాష్ట్రావసరాలను అంచనావేయటానికి కమిషనువారు అనుసరించిన మార్గాలు, 1951 ఒడంబడికపట్ల కమిషను ప్రదర్శిస్తున్న వైఖరి వల్ల అనుమానాలు కలుగుతున్నాయి, కమిషనువారి అభిప్రాయాలను పరిశీలించటం ఈ వ్యాసం ఉద్దేశంకాదు. ఆంధ్రప్రదేశ్‌లో కమిషను వారు జరిపిన పర్యటన విశేషాలను, రాజకీయ విభేదాలు మొదలైనవాటితో ప్రమేయం లేకుండా యావదాంధ్ర ప్రజలు ఏకోన్ముఖంగా కమిషనుకు చేసిన విన్నపాలను గురించి సమీక్షించటం మాత్రమే ఈ వ్యాసం ధ్యేయం.

## భీమా ప్రాజెక్టు

గుల్హాతీ కమిషనువారు నవంబరు 28వ తేదీన మహబూబ్ నగరంజిల్లా మక్తల్‌ను సందర్శించారు. ఆంధ్రప్రదేశ్‌లో వారి పర్యటన ఆనాటినుంచే ప్రారంభమైంది. తెలంగాణా ప్రాంతీయ సంఘం అధ్యక్షులు శ్రీ కె. అచ్యుతరెడ్డి నాయకత్వాన అనేక మంది ప్రజలు కమిషనువారికి అక్కడ ఘనస్వాగతమిచ్చారు. భీమా ప్రాజెక్టును తక్షణమే మంజూరుచేసి పని ప్రారంభించ గోరుతూ కమిషనుకు వారు సమస్త వివరాలతో కూడిన విజ్ఞాపనా పత్రం సమర్పించారు. ఈ పథకాన్ననుసరించి, మైసూరురాష్ట్రం గుల్బర్గా జిల్లాలోని బానహట్టి సమీపంలో కృష్ణానదికి అడ్డంగా ఆనకట్ట నిర్మించవలసి వుంటుందని వారు వివరించారు. ఈ ప్రాజెక్టువల్ల ఆంధ్రప్రదేశ్ మహబూబ్‌నగరం జిల్లాలో 3.5 లక్షల ఎకరాలకు లాభించగా మైసూరురాష్ట్ర గుల్బర్గాజిల్లాలో 60,000 ఎకరాల విస్తీర్ణానికి ప్రయోజనం చేకూరకలుగుతుంది. బాగా వెనుకబడిన ప్రాంతాలైన మక్తల్, ఆత్మకూరు, వనపర్తి, మహబూబ్‌నగరం, కొల్లాపూర్, నాగర్ కర్నూలు తాలూకాలకు సేద్యపు నీటివసరు లేనీ లేవనీ, భీమా ప్రాజెక్టు ఒక్కటే ఈ తాలూకాలకు ఆశాజ్యోతి అనీ వారు కమిషనుకు విన్నవించారు.

ఉప్పేర్‌లో గద్వాల, అలంపురం ప్రజలు కమిషనుకు బ్రహ్మాండమైన స్వాగతం ఇచ్చారు. శాసన సభ సభ్యులు శ్రీ కె. సత్యారెడ్డి, శ్రీ పాగాపుల్లారెడ్డి ఇంకా అనేకమంది పంచాయతీ అధ్యక్షులు వినతి పత్రాలు సమర్పించారు. రాజోలిబండ ప్రాజెక్టు హెడ్ వర్క్సును మైసూరునుంచి ఆంధ్రప్రదేశ్‌కు మార్చాలనీ, రాజోలిబండ ఎడమకాలువను అలంపురము గద్వాల తాలూకాల వరకు విస్తృతీకరించాలని వారు విజ్ఞాపన చేశారు. ఈ ప్రాజెక్టు క్రింద సాగయ్యే 93000 ఎకరాల విస్తీర్ణంలో 6010 ఎకరాలు మాత్రం తప్ప మిగిలిన విస్తీర్ణమంతా ఆంధ్రప్రదేశ్‌లోనే వుందనీ ఈ పరిస్థితిదృష్ట్యా ప్రాజెక్టు హెడ్ వర్క్సును ఆంధ్ర ప్రాంతానికి మార్చటం అత్యవసరమనీ ప్రజాప్రతినిధులు వివరించారు.

మైసూరు రాష్ట్రంలో రెండు రోజులు గడిపిన తరువాత గుల్హాతీ కమిషనువారు అక్టోబరు 31వ తేదీనుంచి ఆంధ్రప్రదేశ్‌లో తిరిగి పర్యటన ప్రారంభించారు. ఈ పర్యాయం వారు రాయలసీమ జిల్లాలలో పర్యటించారు. వారు ఉరవకొండ, గుంతకల్లు, ఆలూరు, కర్నూలు, నంద్యాల పట్టణాలను సందర్శించారు. ఈ ప్రదేశాలలో వారికి ప్రజలు కుప్పలు తిప్పలుగా వినతి పత్రాలు సమర్పించారు. తుంగభద్ర దిగువ కాలువను ఆలూరువరకు త్రవ్వాలనీ, కర్నూలు జిల్లా భూములకు లాభించేవిధంగా రాజోలిబండ కుడి కాలువను నిర్మించాలనీ, చాలా చౌకగా నిర్మించుకోటానికి వీలయ్యే శ్రీశైలం

జల విద్యుత్ ప్రాజెక్టును మంజూరు చేయాలనీ, నదీజలాల పంపిణీ పై 1951 సంవత్సరంలో కుదుర్చుకొన్న ఒప్పందాన్ని గౌర వించాలనీ ప్రజానీకం తమ విజ్ఞాపనా పత్రాలలో కోరారు.

## నాగార్జునసాగర్

ఈ కమిషనువారు నెల్లూరుజిల్లా మోపాడ, గుంటూరుజిల్లా వినుకొండ, నర్సారావుపేట, నాగార్జునసాగర్ ప్రాజెక్టుమీదుగా నవంబరు 3వ తేదీన హైదరాబాదుకు చేరుకున్నారు. శ్రీశైలం ప్రాజెక్టు స్థలాన్ని సందర్శించి మల్లికార్జునస్వామినికూడా దర్శనం చేసుకున్నారు. శ్రీశైలంనుంచి విజయపురికి వెళ్ళేవరకు వారికి దారి పొడుపునా, నాగార్జునసాగర్ రెండవ దశ పథకాన్ని తక్షణమే మంజూరు చేయాలనీ, కుడి, ఎడమ కాలువలు రెండిటినీకూడా నీరు పారకలిగేంతవరకూ పొడిగించాలనీ అసంఖ్యాకంగా విన్న పాలుఅందాయి. ఈ అన్ని ప్రదేశాలలోను పార్లమెంటు సభ్యులు, శాసన సభ్యులతో సహా వేలమంది ప్రజలు, నదీజలాల వివాద విషయంలో రాష్ట్రప్రభుత్వం వాదాన్ని తాము సంపూర్ణంగా బల పరుస్తున్నామని కమిషనుకు తెలియజెప్పారు.

ఈ పర్యటన సందర్భంలో గుల్హాతీ కమిషనువెంట ఇరిగే షను చీఫ్ ఇంజనీరు శ్రీ ఏ. ఆర్. వెంకట్రామన్, నాగార్జున సాగర్ చీఫ్ ఇంజనీరు శ్రీ జి. ఏ. నరసింహారావు ఇంకా ఇతర సీనియర్ ఇంజనీర్లు వున్నారు. వీరు ప్రస్తుతం నిర్మాణంలో వున్న కొత్తగాతలపెట్టిన వివిధప్రాజెక్టులకు సంబంధించిన ముఖ్యాంశాలను కమిషనుసభ్యులకు వివరించారు. శ్రీశైలం ప్రాజెక్టు స్థలాన్ని చూచి కమిషను సభ్యులు చాలా మెచ్చుకున్నారు. "పాతాళ గంగ" "విద్యుత్ ప్రాజెక్టుకు అనువైన స్థలమ"ని సంఘం అధ్యక్షులు శ్రీ గుల్హాతీ అన్నారు.

తమ పర్యటనానుభవాలను గురించి చెప్తూ, ఇతర రాష్ట్రాలలో కంటే ఆంధ్రప్రదేశ్‌లో సేద్యపుభూమి విస్తీర్ణం పెరిగిందని కమిషను సభ్యులు అన్నారు. ఆంధ్రప్రదేశ్ రైతాంగం, నీరు లభించే పక్షంలో ప్రతి అంగుళంమేర సేద్యం చేసి ఆహార సమస్యను పరిష్కరించటానికి సిద్ధంగా వున్నారనేవిషయం కమిషను సభ్యులు వెలబుచ్చిన అభిప్రాయాలదృష్ట్యా ఋజువవుతున్నది.

ఒకవేళ పోచంపాడు (పూర్తి పథకం), శ్రీశైలంవంటి అన్ని ప్రాజెక్టులు, తుంగభద్ర ఎగువకాలువలు, నాగార్జునసాగర్ పూర్తిపథకం వీటన్నిటికంటే పెద్దదైన రూ. 77 కోట్లు ఖర్చు కాగల రామపాదసాగర ప్రాజెక్టు మంజూరై అమలు జరిగినట్లయితే ఒక్క రాష్ట్ర జనపదాల స్వరూపం మారటమే కాకుండా దేశంలో ఆహారకొరత, పారిశ్రామిక మాంద్యం ఏర్పడని విధంగా రాష్ట్రంలో ఆహారోత్పత్తి, విద్యుదుత్పాదనశక్తి పెంపొందుతుంది.

(ఆంగ్లవ్యాసమునకు అనువాదము)



మంచిచెడులముందు ఐశ్వర్యాన్ని అవతలకు నెట్టివేసేవాణ్ని, మించిన కుబేరుడు మరోడు లేదు. అతన్ని మించే యీశ్వరుడూలేడు. —తిలక్

# "దేశంకోసం"

శ్రీ కుంటిమద్ది శేషశర్మ

(జాము ప్రొద్దెక్కింది. అంతంలేని తారాపథంలో నడక సాగించే సహస్రపాదుడు చురుకుదనం చూపించుతున్నాడు. అతనికంటె ముందుగానే లేచి వేకువనే ఊరంతా అరికేసిన డబుడక్కలవాడు హుక్కుదారువలె ఇంటింటికి బిచ్చానికిబయలు దేరాడు. వీథిలో ఒక విలేజిలెవల్‌వర్కర్ అతనికితారసిల్లాడు. వారిద్దరికీ యీవిధంగా సల్లాపం సాగింది.)

డబుడక్కలవాడు:—

అభంజెప్పుతా శుభంజెప్పుతా
భూతంజెపుతా భావిజెప్పుతా
పెద్దకార్యమే తలపెట్టితివి
బలేఊహలే యెన్నోఉన్నవి
ఆటంకాలూ అన్నీఉంటవి
అభంజెప్పుతా శుభంజెప్పుతా
డబుడక్ డబుడక్ డబుడక్ డబుడక్

విలేజివర్కర్:—

ఎవడవన్నా! బుడబుడకల
పెద్దమనిషి వోలుందవు?
ఏయూరున బుట్టినావు?
ఏదేశం దిరిగినావు?
ఎంతమంది మీబలగం?
దొరుకుతుంద కడికబళం?
ఎటునుండీ ఇటువచ్చితి?
వెటకేగెద విటనుండీ?

డబుడక్:—

డబుడక్ డబుడక్ డబుడక్ డబుడక్
అభంజెప్పుతా శుభంజెప్పుతా
తిరిపెానికి తావొకటుందా?
ఎందుబుట్టితినొ యేడబెరిగితినొ
పలిమలనుండీ సేతువుదాకా.
విశాఖనుండీ బొంబయిదాకా.
చూడనిదేశం వేయనివేషం
ఆడనిమాటా పాడనిపాటా
తొక్కనివూరు ఎక్కనిగుట్టా
తాగనినీరు తూగనిసత్రం
ఎందుగానిలేదు ఇందుపొల్లువోదు.
పాడుదేవళం పీర్లచావడీ
సత్రంపంచే యిల్లూవాకిలి.
అడిగినవాదే బందువుబలగం.
పెట్టినతల్లే దేవుడుదైవం.
మగడేపొమ్మని మగువపెట్టదా?
కొడలెపొమ్మని కూతురెట్టదా?
అన్నెంపున్నెం పాటించే యీ
కర్మభూమిలో కడికే కఱువా?
నేడిక్కడ;మఱి—రేపెక్కడనో!
అభంజెప్పుతా శుభంజెప్పుతా
డబుడక్ డబుడక్ డబుడక్ డబుడక్

వి. వ.

ఎంతసుఖజీవితం ఎంతసుఖభోజనం
కనులపండువుగాగ దేశదేశముచూచి
పచ్చపట్టులంగుకిచి వెచ్చపట్టులనొదిగి
దైమిచ్చినదానం దనివినొందేమిది
ఎంతసుఖజీవితం ఎంతసుఖభోజనం:
వానకురువగలేమ పంటపండగలేదు

వఱపువచ్చినదనే వంతయించుకలేదు.
ధరలు పెరిగినవనే ధావంత మేలేదు.
కడిదిరేపటిచింత కలికానికీలేదు.
ప్రకృతిబిడ్డలు మీరు పరమభోగులు మీరు.
ఎంతసుఖజీవితం ఎంతసుఖభోజనం

డబుడక్:—

అభంజెప్పుతా శుభంజెప్పుతా
భూతంజెప్పుతా భావిజెప్పుతా
"నాజీవితమే నీకేప్పడనీ"
అనిచేయదునా ఆశీర్వాదం?
వద్దు వద్దు మా పగవానికినీ
ఈ మా పిచపు నిత్యజీవితము
దినదినగండము దీర్ఘాయుష్యము
ఎంతవాగినా జోలెనిండజలే
ఎన్నిగప్పినా అతుకు బొంతలే
నూటికొక్కడో కోటికొక్కడో
మెచ్చుపలికితే బిచ్చంబెడితే
మిగిలినవన్నీ తగిలినవన్నీ
ఈ సడింపులే యేవగింపులే
కసటుపఱ్ఱలే కసరితోపులే
డబుడక్ డబుడక్ డబుడక్ డబుడక్

వి. వ:—

ఐతేను ఓయయ్య ఆలించివింటావ
నేనుచెప్పేమాట నీవున్నెముఖమూట
నిజమునకునీశక్తి నీవెరుగలేవయ్య
పరులగుండెలలోని భావాలుపసిగట్టి
చూపులేనేవారి లోపాలుగనిపెట్టి
ఎదిరిజీవితమెల్ల నుదిటిపైనేజదివి
విముఖులనుగూడ నున్ముఖులగావించుకొని
కొఱదీరునటంచు గోర్కిపండునటంచు,
మానసముచిగిరింప నాననమువికసింప
నమ్మబలికేశక్తి నీకున్నదోయయ్య
చీపరించినగాని ఛీకొట్టినాగాని
నన్నుగాదన్నదని చిన్నవోవనిమేటి
నీశాంతినీదాంతి నీవెరుగలేవయ్య
ఎండవానలకోర్చి మండుటాకలినైచి
అంధకారంబనక అరికేసియిల్లిల్లు
పాటుబడునీశక్తి సరికింతలేవయ్య.

డబుడక్:—

అభంజెప్పుతా శుభంజెప్పుతా
తాతలతాతల తాతలనుండీ
వచ్చిందయ్యా మాయీవృత్తి
మానము దీసే హీనపువృత్తి.
తలలోరాసిన బమ్మరాతను
తుడిచేసే మగ ధీరుడుగలడా!
డబుడక్ డబుడక్ డబుడక్ డబుడక్

వి. వ:—

కొంతఓపికపట్టి కొనదాకనామాట
ఆలకించితివేని అబ్బుసౌఖ్యమునీకు
కష్టాలుపడుతావు కసరులూతింటావు.
అంతమానిసివీవు ఇంతకుఱచౌతావు.
కుతకుతాపొంగునీ క్రొవ్వేడినెత్తురూ
పురులుదిరిగిన నిండుబిరుసైన కండగల
పరువమ్మురిత్తవో పరపంచలకుబోయి
వెలలేనికాలమ్ము వీటబుచ్చెదవేల?
వేవేలకున్నారు నీవంటిసోమరులు
పరులనెత్తురుపీల్చు పాపిష్టిజీవాలు.
అరుగాలమువెతల పాలగుచుగష్టించి
వరులపండించుకొను పాడిపంటలలోన
తెకతేరపాలుగొను తెగులు నీకేలయ్య?
నీనెత్రునీకండ నీయుక్తి నీశక్తి
నీచాకచక్యమ్ము నీచేతిమెలకువా
ఆంధ్రప్రదేశాని కంకితముచేయుమా
నీజన్మభూమికి నీవెపెత్తనదారు
దీని బాగోగులకు నీవెపూచీదారు
కష్టపడిదున్నేటి కర్షకుడవై తేను,
అడిగినంతనెభూమి నధికారులిస్తారు
ఆనకట్టలుగట్టి నీరుపారిస్తారు.
ఎరువులకువిత్తులకు ఎద్దులకుబావులకు
దీర్ఘకంతులతోడ నీకిప్పులిస్తారు,

పల్వేటుయూరియా సప్లైలుచేస్తారు.
పరులకాదర్శమై పంటపండింపుమా
ఎంగిళ్ళకడులకై ఏకారంబోకుమా.
అనువుగాదంటివా ఐనచో వినవయ్యా:
కొమరారుఉన్నిగల గొఱ్ఱెలిస్తారయ్యా
సులువుగా పెంచుకొని సుఖమందుమోయయ్యా
కోరితేమేల్జాతి కోళ్ళైననిస్తారు.
పెంచుకొని నీకడుపు నించుకొనుమోయయ్యా.
పందులనుపెంచినా ఫలితమ్ముగలదయ్యా.
అదిగాక వేరొకటి ఆలింపుమోయయ్యా.
అక్షరాస్యుడవేని అన్నింటి కంటేను
ఉత్తమంబిది నీకు వృత్తికనువైనదీ.
ప్రాపకాంటిస్టువై పనిచేయుమోయయ్యా
మన నాయకులు నేడు మన సోదరులకూ
పూనిచేసెడిమేళ్ళు బోధింపుమోయయ్యా
పొగరాని పొయ్యిలు పగలేవిదొడ్లు
కమనీయమైయొప్పు కాన్పుశాలలును
బహుళసంతానమ్ము పాపు వెరవుళ్ళు
ఇక నెన్నొ యిక నెన్నొ యెనలేని మేళ్ళు
వాడవాడలందిరిగి వర్ణింపవయ్యా
నీకడుపునిండు మఱి నీపున్నెమనుచు
నీవారలకుఁగూడ నెగడు సౌఖ్యాలు
ఈయగాయవారమ్ము లికనీకుజాలు
ఒళ్ళొంచి చమటోడ్చి ఓర్చికష్టాలు
కడగి చేసితిరంటె కడతేరుతారు.
అనువుగామీరంత ఆరగించుటెగాక
ఆంధ్రప్రదేశాని కవ్వారిగాగ
సకల సౌభాగ్యాలు సమకూర్చుతారు.

డబుడక్ :—

అభంజెప్పుతా శుభంజెప్పుతా
తిరపమెత్తనిక దేబరించనూ.
పడలువంచినే పనిచేస్తానూ.
పల్లె పల్లెకూ వాడవాడకూ
దిన పత్రికవలె తిరిగి తిరిగినే
బోధిస్తాను ప్రభుత్వము ప్రజకూ
అమరించేయీ అనుకూలములూ.
అందించెదనా అన్నదమ్ములకు
చేసిచూపెదను చూపిచెప్పెదను.
దేశంకోసం మోసిచేసెదను.
దండము దండం దండమునీకు
డబుడక్ డబుడక్ డబుడక్ డబుడక్



# ముఖ్యవార్తలు

## రాష్ట్రంలో

22-11-61

రెండు ముఖ్యమైన మధ్యరకం ఇరిగేషన్ పథకాలైన వరద రాజస్వామి, గాజుల దిన్నె ప్రాజెక్టులకు శంకుస్థాపన జరిగింది. వరదరాజస్వామి ప్రాజెక్టుకు పబ్లిక్ వర్క్సు శాఖామంత్రి పునాది రాయి వేయగా గాజులదిన్నె ప్రాజెక్టుకు ముఖ్యమంత్రి శంకుస్థాపన చేశారు. ఈ రెండు ప్రాజెక్టులనూ కర్నూలుజిల్లాలో నిర్మిస్తున్నారు.

24-11-61

1961 వ సం.పు హైద్రాబాదు కౌలుదారీ, వ్యవసాయ భూముల బిల్లును రాష్ట్రపతి ఆమోదించినట్లు న్యూఢిల్లీలో అధికారికంగా ప్రకటించారు.

27-11-61

గ్రామోద్యోగులకు చెల్లించేప్రతిఫలం విషయంలోనూ, వారి ఉద్యోగ పరిస్థితుల విషయంలోనూ తగు సిఫార్సులు చేయటానికీ, వంశపారంపర్యపు హక్కులులేని ప్రాతిపదికపై గ్రామోద్యోగ వ్యవస్థ పునర్నిర్మాణానికై పథకం రూపొందించటానికీ నియమించబడిన సంఘం ప్రభుత్వానికి తన నివేదిక సమర్పించింది. దీనిలో అయిదుగురు సభ్యులున్నారు.

1-12-61

రాష్ట్రశాసనసభ తుది సమావేశంనాడు ఆరంభమైంది.

సంయుక్త సెలక్టుకమిటీ సవరించిన విధంగా ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయం బిల్లును నేడు రాష్ట్రసభలో వ్యవసాయ మంత్రి ప్రవేశపెట్టారు.

2-12-61

తృతీయ ప్రణాళికా కాలంలో ప్రభుత్వం రాష్ట్రంలో మూడు పారిశ్రామికాభివృద్ధి ప్రాంతాలను ఏర్పాటు చేయదలిచినట్లు ప్రణాళికా శాఖామంత్రి శ్రీ పి. రంగారెడ్డి శాసన సభలో వెల్లడించారు.

రాష్ట్రంలో చర్మకార పరిశ్రమాభివృద్ధికై చట్టబద్ధమైన చర్మకార మండలిని స్థాపించటానికి సంబంధించిన బిల్లును రాష్ట్ర ప్రభుత్వం గెజెటులో ప్రకటించింది.

4-12-61

ఆంధ్రప్రదేశ్, మైసూరు, మహారాష్ట్ర రాష్ట్రాలకు క్షామ బాధ లేకుండా చేయటానికి యూనియన్ ప్రభుత్వం బృహత్ప్రణాళిక నొకదానిని సిద్ధంచేసి పంపినట్లు రాష్ట్ర ముఖ్యమంత్రి శాసన సభలో తెలియజేశారు.

6-12-61

ప్రప్రథమ రష్యన్ రోదసీ విజేత మేజర్ యూరీగగారిన్ రాజధానీ నగరానికి విచ్చేశారు.

8-12-61

రాష్ట్ర ప్రభుత్వపు ప్రస్తుత ఆర్థిక పరిస్థితి దృష్ట్యా, ఎన్.జి.ఓ. లకు ఇంకా కొన్ని రాయితీలను మంజూరు చేయటానికికానీ లేదా వేతనాలను ఇంకా సవరించటానికి కానీ వీలుపడదని ఆర్థిక రాష్ట్ర శాసన సభలో ప్రశ్నోత్తరాల సమయంలో వివరించారు.

9-12-61

శాసనసభ తుది సమావేశం సమాప్తమైంది.

10-12-61

పరిపాలనా సంస్కరణల సంఘం చేసిన అనేక సిఫార్సులను రాష్ట్రప్రభుత్వం ఆమోదించింది. దీని ఫలితంగా కొన్ని వేలమంది తాత్కాలిక ప్రభుత్వోద్యోగులు ఆయా ఉద్యోగాలలో ఖాయం చేయబడతారు. జిల్లా కార్యాలయాల సిబ్బందిని ప్రత్యేకించి తెలంగాణా ప్రాంతపు రెవెన్యూ కార్యాలయాల సిబ్బందిని పెరుగుతున్న పరిపాలనావసరాల దృష్ట్యా పెంచటం జరుగుతుంది.

11-12-61

1962 జనవరి 16వ తేదీ లగాయతు ఫిబ్రవరి మాసాంతం వరకు రాష్ట్రంలో జరిపే పర్యటనలకు ప్రయాణభత్యాలను నీకా లేదా దినభత్యాలను కానీ తీసుకోకుండా వుండటానికి రాష్ట్ర మంత్రులు నిశ్చయించుకున్నట్టు ముఖ్యమంత్రి శ్రీ డి. సంజీవయ్య శాసన మండలిలో వెల్లడించారు

రాష్ట్రశాసనమండలి సమావేశం అయిదవరోజు సమావేశానంతరం నిరవధికంగా వాయిదాపడింది.

మాంసం, బంగాళాదుంపలు, అటుకులు, మొరమొరాలు, వేయించిన సెనగపప్పుపై ప్రభుత్వం రూ. 7 లక్షల మేరకు పన్ను విధింపును మినహాయించినట్టు ఆర్థికమంత్రి ప్రకటించారు

16-12-61

"పరిణామం జెందుతున్న జిల్లాధికారి విధులు" అనే విషయంపై ఇండియన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ పబ్లిక్ ఎడ్మినిస్ట్రేషన్ ఆంధ్రప్రదేశ్ ప్రాంతీయ శాఖవారు ఏర్పాటుచేసిన రెండురోజుల గోష్ఠికి నేడు హైదరాబాదులో ప్రారంభోత్సవం జరిగింది.

17-12-61

మురికిపేటల నిర్మూలనపై హైదరాబాదులో జరిగిన గోష్ఠిని యూనియన్ వర్క్స్, హౌజింగ్సప్లైల మంత్రి ప్రారంభించారు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, భారత సేవక సమాజ్వారు దీనిని నిర్వహించారు

20-12-61

ప్రస్తుత నిర్ణయించిన కార్యక్రమం ప్రకారం జంటనగరాలలోనూ ముఖ్యపట్టణాలలోను వచ్చే సాధారణ ఎన్నికలకు ఫిబ్రవరి 25వ తేదీన పోలింగ్ జరుగుతుందని ఎన్నికల ప్రధానాధికారి తెలిపారు. ఇతర నియోజక వర్గాలలో 19, 21 లేదా 23వ తేదీలలో పోలింగ్ జరుగుతుంది.

## భారతదేశంలో

21-11-61

ఎగువ సీలేరు అంతర్రాష్ట్రీయనదికి ఆనకట్ట నిర్మించటానికి స్థలాన్ని నిర్ణయించే అధికారం ప్రణాళికా సంఘం సభ్యుడు శ్రీ సి. ఎం. త్రివేదికి ఇవ్వటానికీ తానూ, ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి సమ్మతించినట్టు ఒరిస్సా ముఖ్యమంత్రి రాష్ట్రశాసనసభలో వెల్లడించారు

23-11-61

జపానుప్రధాని శ్రీ హయతోఇకెద భారతదేశ పర్యటన ముగిసిన పిమ్మట న్యూఢిల్లీలో విడుదలచేసిన సంయుక్త ప్రకటనలో భారత, జపాను దేశాల ప్రధాన మంత్రులు అంతర్జాతీయ భద్రత ప్రపంచ శాంతిని పరిరక్షించటమే తమ ఉభయుల లక్ష్యమైనట్టు, ఈ లక్ష్య సాధనకై తాము కృషిచేయ దలచినట్టు వెల్లడించారు

25-11-61

లోకసభలో టెక్నాలజీ సంస్థబిల్లు ఆమోదం పొందింది దీనిననుసరించి మద్రాసు, బొంబాయి, కాన్పూర్లలోని టెక్నాలజీ సంస్థలను జాతీయ ప్రాముఖ్యతగల సంస్థలుగా ప్రకటించటం జరుగుతుంది

26-11-61

భారత విమానదళం వారు ప్రభుత్వరంగంలో నిర్మించిన ప్రథమ రవాణా విమాన ప్రయాణానికి ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ ప్రారంభోత్సవం చేశారు.

28-11-61

ఇండియా-చైనా సరిహద్దు వివాదంపై 5వ శ్వేత పత్రాన్ని లోకసభకు ప్రధానమంత్రి సమర్పించారు. చైనా మరికొన్ని భారత భూభాగాలపై దురాక్రమణ జరిపినట్టు దీనిలో వెల్లడించబడింది.

29-11-61

ప్రపంచ ప్రథమవ్యోమగామి మేజర్ యూరీగగారిన్కు న్యూఢిల్లీలో ఘనస్వాగతమిచ్చారు.

30-11-61

ఉత్తర భారతంలోని ప్రసిద్ధ యాత్రాస్థలమైన గార్ ముక్తేశ్వర్వద్ద గంగానదిపై నిర్మించిన రోడ్డు వంతెనకు ప్రధాని శ్రీ నెహ్రూ ప్రారంభోత్సవం చేశారు

3-12-61

ఉత్తర్ప్రదేశ్లో నూతన పంచాయతీరాజ్య చట్టం అమల్లోకి వచ్చింది.

7-12-61

పారిశ్రామిక సంస్థలలో పనిచేసే కార్మికులకు బోనసు చెల్లించే విషయాన్ని పరిశీలించి తగు సిఫార్సులను చేసే నిమిత్తం భారతప్రభుత్వం ఒక కమిషన్ను నియమిస్తూ ప్రకటన చేసింది.

10-12-61

ఉత్తర గోవాలో రెడి ప్రాంతంలో పోర్చుగీసు సైనికులు సరిహద్దులు దాటి భారత భూభాగంలోకి ప్రవేశించారు.

12-12-61

లఘుపరిశ్రమల సంఘాల సమాఖ్య వార్షిక సాధారణ సమావేశాన్ని ప్రధానమంత్రి ప్రారంభించారు.

14-12-61

భారత పురావస్తు పరిశోధనలశాఖ శత వార్షికోత్సవాలకూ, ఆసియా పురావస్తువులపై జరిగిన అంతర్జాతీయ మహాసభకూ ప్రధానమంత్రి న్యూఢిల్లీలో ప్రారంభోత్సవం చేశారు.

15-12-61

యు ఎస్ ఎస్.ఆర్. సుప్రీం సోవియట్ ప్రెసిడియం అధ్యక్షులు శ్రీ లియొనిడ్ బ్రెజ్‌నేవ్ భారతదేశ పర్యటనకై న్యూఢిల్లీ చేరుకున్నారు. వీరు ఇండియాలో 14 రోజులు పర్యటిస్తారు.

18-12-61

భారత రక్షణ దళాలు గోవాలోనికి ప్రవేశించాయి.

19-12-61

దక్షిణమండల సేనాని లెఫ్టినెంట్ జనరల్ జె. ఎన్. చౌదరి పోర్చుగీసు సైన్యాల లొంగుబాటును లాంఛనప్రాయంగా అంగీకరించారు

## విదేశాలలో

5-12-61

కటాంగాలో ఏర్పడిన పరిస్థితిని అదుపులో పెట్టటానికి భారత బ్రిగేడియర్ కె. ఎ ఎస్ రాజాను తాత్కాలిక సెక్రటరీ జనరల్ యు థాంట్‌ను అధికారిగా నియమించారు లోగ దళబాధ్యతను సివిల్ ప్రతినిధులు నిర్వర్తించేవారు

15-12-61

యుద్ధకాలంలో లక్షలాది యూదులను అమానుషంగా హత్యచేయించిన నేరానికిగాను. అడాల్ఫ్ఐక్మన్‌కు జెరూసలెం న్యాయస్థానం ఉరిశిక్ష విధించింది



అన్నారోగ్యాలతో, హాయిపొందుతుంది_దేశ

మందమొందుతుందిరా।

చెడుగులేని నడవడితో, చెన్నుమీరుతుంది_బ్ర

వన్నెకెక్కుతుందిరా।

ఆదర మర్యాదలతో, అభిముఖమౌతుంది_మైత్రి

అభివృద్ధవుతుందిరా।

శాంతి స్వాతంత్ర్యాలతో, మేరమీరుతుంది_జాతి

పేరు మోగుతుందిరా।

— "ప్రజానీతి"

# పౌషలక్ష్మి

శ్రీ కొత్త సత్యనారాయణ చౌదరి

పండిన మిరప చేలెండలో మిలుమిట్లు
      గొలుపుచుఁబండువు గూర్చుచుండ
కందిచేలుత్సాహగౌరవంబున వంగి
      సిరిసంపదలు గుర్తుచేయుచుండ
బంతిపూఁదోఁటలు దొంతర దొంతరై
      వింతకాంతులను గావించుచుండ
లంకగుమ్మడిపండు లింకమాతో మీకు
      నక్కలు పట్టనం చెక్కిరాఁగ
మకరసంక్రాంతి లక్ష్మియిమ్మడిక్కి తెల్గ
      గడ్డలో దొడ్డపంటల గనులుఁదాచి
దోఁచుకొను వాని బుద్ధికిఁదోఁచినట్లె
      సర్వమర్పించుచుండుఁ బ్రశాంతముగను

రంగవల్లికలతో పొంగారుముంగిళ్లఁ
      గొంగ్రొత్తకాంతుల కోరగింపు
శవణసుఖమ్మయి చవులూరుసాతాని
      జియ్యరుపాటల తియ్యఁదనము
గంగిరెద్దుతాత రంగ రంగా యను
      సన్నాయి నొక్కుల జాణతనము
గొబ్బిళ్లమోజులో గొనకొనితారాడు
      అక్కసెల్లెండ్రసయ్యాట నీటు
తెలుఁగు పల్లెలలో గనితీరవలయుఁ
      దెలుఁగు వీధులలో వినితీరవలయుఁ
దెలుఁగు పల్కులలో ననితీరవలయు
      పౌషలక్ష్మిః నమోస్తుః సౌభాగ్యమస్తుః



# తెలుగు ఛందోరీతుల జిలుగు వెలుగులు

## గ్రంథసమీక్ష

ఈ నడుమ ఆంధ్రభాషలో వెలువడిన ఉత్తమ గ్రంథములలోనిది "తెలుగులో ఛందోరీతులు"ను నీ గ్రంథమొకటి. తెలుగులో ఛందశ్శాస్త్రమును గురించి సవిమర్శమైన సమగ్ర గ్రంథ మొకటి లేని లోటు చిరకాలమునకీ గ్రంథమువలన కొంతవఱకు తీఱినదని చెప్పవచ్చును. దీనికి ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమివారు రెండు వేల రూప్యములు బహుమతిగా నొసంగిరి. కాని ఈ గ్రంథమునకు విపులమగు పరిచయమును వ్రాసిన శ్రీ వల్లమూడి గోపాలకృష్ణయ్యగారు చెప్పినట్లు శ్రీసీతాపతిగారివంటి వారిచే స్వల్పకాల వ్యవధిలో ఇట్టి బహుమతి గ్రంథములు వ్రాయించుటగాక సమగ్ర ప్రణాళికపై బృహద్గ్రంథములను సావకాశముగా వ్రాయించుట సమునితతరము. శ్రీ సీతాపతి గారీగ్రంథమును 23 దినములలో రచించి ముగింపుతేదీ మించకుండ అకాడమీ వారికి సమర్పించిరి. అయినను వారు చిరకాలమునుండి ఈ విషయముపై విశేష కృషి చేసియున్నవారు కావున పాఠకులకు తొందరగా వ్రాసిన గ్రంథము వలె తోచదు.

"తెలుగులో ఛందోరీతులు" రచయిత: డాక్టర్ గిడుగు వేంకట సీతాపతిగారు, ప్రకాశకులు: విశాలా పబ్లికేషన్స్, ఖైరతాబాద్, హైదరాబాదు-4

క్రౌను సైజు-XXXVII+256 పుటలు; వెల రు.6-00.

ఇందు ఆఱు ప్రకరణములు కలవు. మొదటి ప్రకరణములో మార్గచ్ఛందమును గూర్చి వివరింపబడినది. దీనిలో షట్ప్రత్యయములు; 26 ఛందములలో బుట్టిన ప్రసిద్ధ వృత్తముల పట్టిక; సమ-అర్ధసమ- విషమవృత్తములవివేకము, అక్షరమాత్రాగణ భేదములు సవిమర్శముగా తెలుపబడినవి. కేవల మాత్రా గణములతో నడచు జాతులకే కాక అక్షరగణ నిబద్ధములైన వృత్తములకు గూడ ఒక అనుగత మైన లయతాళము గలదని శ్రీ సీతాపతిగారు చేసిన నిరూపణ ప్రతిభావంతము. ఇది సంగీత సాహిత్యములలో సమానమగు వ్యుత్పత్తి గలవారికి తప్ప సాధ్యముకాదు. సంగీత సాహిత్యములకు గల ఈ నిత్య సంబంధమును గుర్తింపకపోవుటచేతనే మనము ప్రాచీనులు వాడిన కొలది వృత్తములతోనే కాలక్షేపము చేయుచున్నామనియు, ఇది తెలిసినచో లయానుసారముగా నెన్నో క్రొత్తవృత్తములను-శార్దూల విక్రీడితమునుండి మత్తేభ విక్రీడితమువలె-సృజింపగొని యుందుమని వీరు సోదాహరణముగా జూపిన ఉపపత్తులు హృదయంగమములైయున్నవి. రెండవ ప్రకరణమున పద్యరచన పుట్టుపూర్వోత్తరములు-పరిణామము వివరింపబడినవి. వైదిక వాఙ్మయమునకు ఆదిగ్రంథమగు ఋగ్వేదము, లౌకిక వాఙ్మయమునకు ఆదిగ్రంథమగు వాల్మీకి రామాయణము గూడ గేయరచనలే యనియు, కనుక గేయరచనయే మొదటపుట్టి, పిమ్మట నది పద్యరచనగా మారినదనియు నిందు సోపపత్తికముగా నిరూపింపబడినవి. ఈ గేయరచనల వివేచనలో ప్రాచీనుల రచనలతో బాటు ఆధునిక కవుల రచనలు గూడ నుదహరించుట విశేషము. మూడవ ప్రకరణమున మాత్రాగణనిబద్ధములైన ఛందోరీతులు వివరింపబడినవి. ఇందు ఆర్యలను, కందపద్యమునుగూర్చి వీరు చేసిన విశ్లేషణాత్మక విమర్శన ప్రత్యేకముగా ఎన్నదగినది. నాల్గవ ప్రకరణమున తెలుగులో పద్యరచనా ప్రారంభ వికాసములను గూర్చి తెలుపబడినది. తెలుగు పద్యరచన దేశి కవితతో ప్రారంభమై మార్గ కవితలోనికి పరిణమించినదను సంగతి నిర్వివాదము. ఆ దేశి కవితలోని సీసములు, అక్కరలు, తరువోజులు మొదలైన పద్యభేదములిందు సవిమర్శముగా విశదీకరింపబడినవి.

అయిదవ ప్రకరణమున తెలుగు కవితకు సహజాలంకారములైన వడిప్రాసలు చర్చించబడినవి. వడిప్రాసలు తెలుగు కవితకు శృంఖలములని భావించు

వారికి ఈ ప్రకరణము కనువిప్పు కాగలదు. అవి కేవలము బాహ్యాలంకారణములు కావనియు. ముఖ్యముగా గేయకవిత కవి జీవములనియు శ్రీ సీతాపతిగారు నిరూపించిరి. ఆఱవ ప్రకరణమున ప్రత్యేకముగా దేశిచ్ఛందములోని విశేషములు తాళ భేదములతో గూడ వివరింపబడినవి. తెలుగు కవితలో 'హ' గణమువంటి అనులోమ గతి గణములకే గాని "వ" గణమువంటి విలోమ గతి గణములకు ప్రచారము లేకపోవుటకు సూర్యేంద్రగణములకే తప్ప చంద్రగణములకెక్కువ ప్రచారము లేకపోవుటకు శ్రావ్యతయే ప్రధాన కారణముగా నిరూపించిరి

తెలుగులో వ్యాకరణ శాస్త్రమువలెనే ఛందశ్శాస్త్రమును చాల వివాదాంశములతో గూడినది. కావున పండితులలో అభిప్రాయ భేదములుండుట సహజము. ఉదాహరణమునకు అఖండ యతి విషయములో శ్రీ సీతాపతిగారితో ఎల్లరు ఏకీభవింపజాలరు. కవిజనాశ్రయకర్తవలె అప్పకవికూడ అఖండయతిని అంగీకరించి యున్నచో ఉభయవళులతో యతుల సంఖ్యను పెంచ నక్కఱలేక పోయెడిదని వీరి అభిప్రాయము. కవిజనాశ్రయ కర్త యిచ్చిన "భానుసహస్రభాసి వృషభాధిపుఁడన్నటు లర్థయుక్తమై" అనులక్ష్యమును బట్టి చూచినచో ఏకపదముగా భాసించు సమాసములవంటి వానియందు మాత్రమే అతనికి అఖండయతి అభిప్రేతమని చెప్పుటకును అవకాశముగలదు. ఆంధ్ర వ్యాకరణములలో చింతామణివలె. ఆంధ్రఛ్ఛందో గ్రంథములలో ఆదిగ్రంథమైన కవిజనాశ్రయముకూడ అసమగ్రముగను, అస్పష్టముగను ఉండుట సహజమేగదా; దానినే అనంతుడును, అప్పకవియు వివరించిరి.

(2) అట్లె అర్ధసమ-విషమ వృత్తముల వివరణములోను ప్రాచీనులకు, శ్రీ సీతాపతిగారికి కొంచెము అభిప్రాయ భేదము కలదు. పద్యముయొక్క నాలుగు పాదములును సమముగానున్న సమవృత్తమనియు, పద్యముయొక్క పూర్వార్ధముతో-ఉత్తరార్ధము (అనగా 1, 2 పాదములతో క్రమముగా 3, 4 పాదములు) సమముగానున్న అర్ధసమవృత్తమనియు, పైవానికంటె భిన్నమైన వన్నియు విషమవృత్తములనియు ప్రాచీనుల నిర్వచనము. శ్రీ సీతాపతిగారు పద్యములోని మొదటి రెండు పాదములు ఒక వృత్తమునకును. తక్కిన రెండు పాదములు (అనగా 3, 4 పాదములు) మఱియొక వృత్తమునకు చెందినవానిని; ఒకపాదమొక వృత్తమునకు, తక్కిన మూడు పాదములింకొక వృత్తమునకు చెందినవానిని అర్ధసమ వృత్తములలో లెక్కించిరి. నాలుగు పాదములు నాలుగు వృత్తములకు చెందినవానిని మాత్రమే విషమవృత్తముగా పేర్కొనిరి (చూ. పుట 2!) ఇది చింత్యము.

(3) గురు లఘువివేకములో "అ ఆ ఐ ఔ" అను కవిజనాశ్రయ పద్యములోని 'అ' కు గురుత్వము నెవ్వరును జెప్ప లేదనియు, చెప్పవలసియున్నదనియు శ్రీ సీతాపతిగారు సూచించిరి. (పుటలు 24-25) ఈ గురూచ్చారణ నియతము కాదుగనుక లాక్షణికులు చెప్పియుండకపోవచ్చును: లేదా శ్రీ గోపాలకృష్ణయ్యగారు చెప్పినట్లు ఇచ్చటి 'అ' కారము దీర్ఘోచ్చారణము కలదై యుండవచ్చును (చూ. పుట XV). రెండవ పక్షమే సమంజసమని చెప్పనగును. అష్టాధ్యాయిలో అంతిమసూత్రము "అ అ". ఇందు మొదటి అకారమును చాలమంది గురువుగనే యుచ్చరింతురు, అయినను ఇది గురువని చెప్పబడలేదు.

(4) 'వడి' అను పదముయొక్క వ్యుత్పత్తిని గూర్చి ఇది 'వళి'(=మార్గము)అను తమిళ పదమునుండి వచ్చియుండుననియు. ప్రతి పాదమునందును యతి స్థానమునకు మార్గము చూపుచున్నందున యతికి పర్యాయ పదముగా వాడబడుచున్నదనియు శ్రీ సీతాపతిగారూహించిరి. ఈ ఊహ సరియైనదే. కాని 'వడి' అను పదమునకు "ఉత్తరమునుండి వచ్చినది" అను నర్థము యుక్తతరము. తమిళములో "తెన్" అనగా దక్షిణదిక్కు "వడ" అనగా ఉత్తర దిక్కు అని అర్థము ప్రాచీన కాలమున దక్షిణమునకు పోవు మార్గమునకు "తెన్ను" అనియు, ఉత్తరమునకు వచ్చు మార్గమునకు "వడి" (వళి) యనియు పేళ్లుండి, కాలక్రమమున నీ రెండు పదములను రెండు భాషలలోను మార్గ సామాన్య వాచకములుగా (తైలశబ్దమువలె) స్థిరపడి యుండును. ఈ 'వడి' శబ్దమే ఉత్తర దిక్కునుండి వచ్చిన తెలుగు యతికి గూడ సంజ్ఞగా నేర్పడి యుండును (కాశ్మీరమునుండి వచ్చిన కుంకుమ పువ్వునకు కాశ్మీరమను పేరువలె).

ఈ పైని దెలుపబడినవన్నియు అభిప్రాయ భేదములే గాని వివాదాంశములు కావు. సహృదయుల జిజ్ఞాసకై వ్రాయబడినవి. ఈ విధముగా ఛందశ్శాస్త్ర జిజ్ఞాసువులకే కాక అభిజ్ఞులకుగూడ ఉపయుక్తమగు రీతిని ఈ గ్రంథమును రచించి ఆంధ్ర భాషాయోషనలంకరించిన శ్రీ సీతాపతిగారును, దీనికి హేతుభూతులైన ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడమి వారును అభినందనీయులు. రచయితయగు శ్రీ సీతాపతిగారును, పరిచయకర్తయగు శ్రీ గోపాలకృష్ణయ్యగారును వ్యావహారిక భాషావాదులయ్యును. ఇందు లాక్షణిక భాషనే వాడుట వారి సహృదయతనేకాక గ్రంథ గౌరవమునుగూడ పోషించుచున్నది. * *

శ్రీ కేశిరాజు వెంకటనృసింహ అప్పారావు

# చైనా త్రి రు త్రె న్ను ల కు ప్రతిబింబం

పందొమ్మిది అధ్యాయములలో సులభశైలిలో పండిత పామరులకెల్లరకూ సవిస్తరముగా చైనాదేశీయుల అనాదినుండి నేటివరకు గల చరిత్రను గ్రాహ్యమగునటుల కడురమ్యముగా చిత్రింపబడిన గ్రంథము తెలుగులో ఇంతవరకు వెలువడ లేదు.

'చైనావిప్లవము' రచయిత:శ్రీ అయ్యదేవర కాశేశ్వరరావు, వెల: రూ 6 50 పేజీలు: 628 ప్రకాశకులు : శాస్త్రవిజ్ఞానము, చరిత్ర, తెలుగు, ఉర్దూ అకాడమీ, హైద్రాబాదు.

ఇది రెండుభాగములు, మొదటిభాగము ప్రాచీనకాలమునుండి 1930 వరకు జరిగిన జాతీయవిప్లవమును, రెండవభాగము 1927 నుండి 1960 వరకు జరిగినకమ్యూనిష్టు విప్లవమును తెల్పుచున్నది. భారత దేశమునకు అనేక సంవత్సరములుగా స్నేహ సంబంధముల గల్గిన చైనాదేశము, అట్టి స్నేహమునకు, ఉభయ దేశములకు గల నాగరికత, మత, పరిపాలనాపద్ధతి మొదలుగాగల సంబంధములు కారణములని ప్రారంభ అధ్యాయములు ఋజువుపరచుచున్నవి కన్ఫ్యూషియన్ మహర్షి రాజ్య పాలనావిధానము, మెన్షియసు మహర్షి గ్రామ స్వపరిపాలనా విధానములు చైనారాజ్యము నిరంకుశరాజరికమైననూ ఆచరణ యందు ప్రజారాజ్యమని, ప్రజాభిప్రాయమునకుగల ఉత్తమస్థానమును తెలుపుచున్నవి. క్రీస్తుపూర్వము 1765 మొదలు పరిపాలన మొనర్చిన వివిధ వంశీయులైన రాజుల, రాణుల చరిత్రలు, ఆదేశ ప్రజల అనాది భావముల చాటుచున్నది. జ్ఞానసూర్యుడు ప్రాగ్దేశము లందు ప్రప్రథమున నుదయించెనని 1756 లో వ్రాసిన పాశ్చాత్యుల వ్రాతలవలన ప్రాగ్దేశముల నాగరికత వెల్లడిచేయబడినది. అట్టి ప్రాగ్దేశములు ప్రాచ్యదేశముల బానిసత్వమునకు గురియగుట ఎట్లు సంభవించినది సహేతుకముగా నిరూపింపబడినది. పాశ్చాత్యుల సామ్రాజ్య తత్వఫలితములు చైనాదేశమును వివిధ ఖండములుగా చీల్చు హేతువులు పొందుపరుపబడినవి.

సన్‌మేటుసేన్ చైనాచరిత్రయందు ఎట్లు అవతారమూర్తియని పేరు గణించినది, అతని జీవితవృత్తాంతము, దేశసేవ మొదలగు ఎల్ల విషయములు ప్రధానపాత్ర వహించినవి. అతని భార్యగుణ గణములు పవిత్ర హిందూ స్త్రీలను పోలియున్నవి. ఆదర్శ పత్నిగా ఆమె చేసినసేవ చక్కగా వర్ణింపబడినది. విద్యార్థుల ప్రాధాన్యత ఈ దేశచరిత్రయందు ముఖ్యహంశము. యువజనోద్యమము రైతులయుద్యమము, స్వదేశయుద్యమము. స్త్రీల యుద్య

మములు ఎట్లు దేశచరిత్రయందు ప్రాముఖ్యత వహించినది వారు చేసిన దేశసేవ. త్యాగములు ఆదర్శనీయములు.

చ్యాంగుకేషేక్ రాజకీయములందు చేరి ఉన్నతపదవుల నొంది దేశక్షేమమునకు చేసినకృషి. అతనిబంధువుల అవినీతి. తత్ఫలితముగా అతడు ప్రజాకంటమగుట. దేశము కష్టములపాలై శత్రురాజుల వశమగుట. మిత్రులుగా సంచరించు ఇతరదేశీయులు ప్రబల శత్రువులై వారు చైనా దేశమును దురాక్రమించుట మొదలుగాగల వివిధ విషయములు సమగ్రముగా గాననగును

ఏకాదశాధ్యాయమునుండి ప్రారంభమగు రెండవభాగము చివరివరకు కమ్యూనిష్టుల ప్రబలతను వర్ణించుచున్నది. చైనావారు రష్యావారితో కలసి కమ్యూనిజమునవలంభించిన ఫలితములు. చ్యాంగుకేషక్ ఫార్మోజాకు పారిపోవుట మొదలుగాగల హంశములు వివరింపబడినవి.

మావోసిటాంగు అధ్యక్షపదవినొందుట. చౌ ఎన్ లై ప్రధాన మంత్రియగుట వారి పరిపాలనా విధానమందు క్రమక్రమముగా జరిగిన వింతమార్పులు. ప్రజలహక్కుల నణచుట చదువనాశ్చర్యము గల్గించుచున్నవి ప్రజాప్రభుత్వము సోషలిజముగను అటుపిమ్మట కమ్యూనిజముగను మార్చబడుట. వర్గరహిత సమాజస్థాపన జరిపి స్వర్ణయుగముగ మార్చుదురను ఆశలు నిరాశలగుట. రైతులు కూలీలగమారుట విద్యావంతులు భావస్వాతంత్ర్యమును. ప్రకటనా స్వాతంత్ర్యమును. వాక్స్వాతంత్రమును. రచనా స్వాతంత్ర్యమును గోల్పోవుట మనస్సు సర్వస్వంత్రమును గోల్పోవుట కమ్యూనిష్టు పరిపాలనా ఫలితములు. ప్రజాకోర్టులు లక్షలమందిని హత్యలు గావించుట. సత్యమును అహింసను. ప్రేమతత్వమును. క్షమను బోధించిన బుద్ధుని మతమును చైనా కమ్యూనిష్టులు తుడిచివైచుట. నిరంతర వర్గపోరాటము. ద్వేషము. క్రోధము. క్రూరహింస సాధనములుగల కమ్యూనిజము స్థిరపడుట చైనాదేశ దుర్భర దుస్థితులు చక్కగా వివరింపబడినవి అచటి పంచవర్ష ప్రణాళికలు ఉత్పత్తి సహకార సంఘములస్థాపన. వ్యవసాయిక రంగముమీద పారిశ్రామికాభివృద్ధి ఆధారపడుట. సమిష్టి వ్యవసాయ క్షేత్రముల స్థాపన. రైతుల జీవన ప్రమాణము హీనమగుట. లంచగొండుల నణచుట కమ్యూనిష్టు పరిపాలనా హంశములు విపులముగా విశదీకరింపబడినవి.

కమ్యూనిష్టుల వైదేశికరాజనీతి. కమ్యూనుల స్థాపనము. అందలి నిర్బంధములు. రష్యా చైనాలకు గల భేదములు చదువ ఇంపుగానున్నవి. టిబెట్టు దేశ దురాక్రమణ. ఆదేశచరిత్ర సంపూర్ణముగా వివరింపబడినది. ఇండియా భూభాగముపై చైనాదురాక్రమణ సంపూర్ణముగా వర్ణింపబడినది.

ఈ గ్రంధమును చదివిన చైనాచరిత్ర సంపూర్ణముగా నాటి నుండి నేటివరకు విశదమగును. అగ్రశ్రేణికి చెందిన న్యాయవాద వృత్తి వదలి. దేశసేవచేసి. రాజకీయ రంగమందు స్వీకరుపదవి నలంకరించియున్న ఈ రచయిత తమస్వల్ప విశ్రాంతి కాలమందు అనేక గ్రంథముల సారమును గ్రహించి తెలుగుభాషలో ఈ అమూల్య గ్రంధమును రచించి తెలుగుజాతికి కమ్యూనిజమునందలి మంచి చెడులను తెల్పి ఆంధ్రులకు గొప్పసేవ గావించిరనుట అతిశయముగాదు స్త్రీ పురుషు లెల్లరూ ఈ గ్రంధమును చదివిన కమ్యూనిజము యొక్క నిజరూపమును గ్రహింపగలరు. ఇట్టి అమూల్య గ్రంథమును వెలువరించిన ప్రకాశకులు అభినంద నీయులు.

శ్రీ డి. వి. యస్.



గ్రంథ సమీక్ష

# ఆత్మశాంతికి "శాంతి"

మొగలు చక్రవర్తులందరినీ మరచిపోయినా షాజహానును భారతదేశం మరచి పోలేదు. భార్యాస్మృతి చిహ్నంగా ఆయన కట్టించిన కళాఖండం, తాజమహల్ వంటిదే 'శాంతి' సాహిత్య సంకలనం కూడా.

"శాంతి" (సాహిత్య సంకలనం) సంధాత: భార్గవ విద్యాదేవ కులపతి నిర్మాత: శ్రీ ఏకా ఆంజనేయులు 810 పేజీలు వెల: 25 రూపాయలు ప్రతులకు: ప్రధానోపాధ్యాయురాలు, బండ్లమూడి హనుమాయమ్మ హిందూ బాలికా బహూళార్థ సాధక పాఠశాల 2-17 బ్రాడీపేట, గుంటూరు-2

ఇంతపెద్ద సంకలనం తెనుగులో న భూ తో నభవిష్యతి. ప్రభుత్వమో, సాహిత్య అ కా ద మీ వంటి సంస్థలో పూనుకుంటే గాని సాధ్యంకాని పనిని శ్రీ ఏకా ఆంజనేయులు గారు ఒక్కరే చేసి చూపించారు, సాలార్‌జంగ్ అనే ఒక కళాప్రియుడు అంతపెద్ద మ్యూజియం నిర్మించినట్లు. ఆంజనేయులుగారు భార్యపేర ఒకసత్రమో, హాలో, ధర్మాసుపత్రో నిర్మించి వుంటే ఎవరూ కాదనలేరు. (కీ. శే. ఏకా దండయ్య పంతులు గారిపేరుతో అవి వుండనే వున్నాయి) అవీసత్కార్యాలే. కాని వారి సంకల్పం సాహిత్యం వైపు మరలడం వల్ల తెనుగు భాషకు యీ అపూర్వ గ్రంథం అబ్బింది. మరొకవిశేషం, వారు యింతపెద్ద గ్రంథంలోనూ తమ మీదగాని, తమ భార్యమీదగాని పద్యాలు రాయించుకోక పోవడం, ఫొటోలైనా ప్రకటించుకోక పోవడం. ఇటువంటివి వారు ససేమిరా వద్దన్నారని సంధాత సంపాదకీయంలో సూచించారు. ఇంతనిగ్రహం, నిరాడంబరత అలవరచుకోవడం సామాన్య విషయంకాదు. అందుకే అసలు గ్రంథానికంటే ముందు వారిప్రస్తావన తేవలసివచ్చింది, 'కృతజ్ఞత' లో వారు యిలాఅన్నారు- "ఈ సంకలనంవల్ల వచ్చే విక్రయ ధనాన్ని బండ్లమూడి హనుమాయమ్మ గారి హిందూబాలికా బహూళార్థ సాధక పాఠశాలకు సమర్పిస్తున్నాను... ఈ సంకలన సర్వస్వామ్యాలను కూడా శ్రీ విద్యాభివృద్ధికి సేవచేస్తున్న ఆ సంస్థకు నివేదిస్తున్నాను" ఇక దీనినిగురించిచెప్పవలసిందేముంది? ఆయన హృదయం అర్థమవుతూనే వుంది.

ఇక గ్రంథంగురించి. ఈ "సహధర్మచారిణి ఆత్మశాంతి కోసం సమర్పించే పుష్పాంజలి"లో 200 మంది రచయితల పద్య, గద్య, గేయాత్మకములైన రచనలసేకరణ జరిగింది. వీరిలో, ఆంధ్రాస్థాన కవీశ్వరులు పూజ్య శ్రీ కాశీకృష్ణాచార్య వంటి వృద్ధ పండితులు మొదలు, శ్రీ జనస్వామి సీతారామారావు (వయస్సు 18 సం॥) వంటి "అభివృద్ధికి రాదగిన యువరచయిత" వరకు అన్ని తరాల వారూవున్నారు. మొత్తం 277 శీర్షికలున్నాయి. వీటిలో 56 వచనరచనలు. మిగిలినవి పద్యాలూ, గేయాలూ, శ్రీయుతులు విశ్వనాథ, కృష్ణశాస్త్రి, రాయప్రోలు, స్వామిశివ శంకరులు, పింగళి, కాటూరి, జాషువా, కరుణశ్రీ, వేదుల, నాయని,తుమ్మల, వేదాంతకవి, దాశరథి, నారాయణరెడ్డి, దివాకర్ల, పుట్టపర్తి, విద్వాన్‌విశ్వం, నార్ల, పల్లాదుర్గయ్య, గోపాలచక్రవర్తి వంటి సుప్రసిద్ధ కవుల పద్యాలు, గేయాలతో యీ సంకలనం ఒక మంచి రిఫరెన్సు పుస్తకంగా పనికొస్తుంది. తెనుగులో పేరు మోసిన కవులందరూ యిందులో దొరుకుతారు. లేనివారు బహు కొద్దిమంది; శ్రీయుతులు గడియారం వెంకటశేషశాస్త్రి, బోయి భీమన్న ప్రభృతులు.

లేనివారంటే గుర్తువచ్చింది. శ్రీశ్రీ యుగానికి చెందిన ప్రసిద్ధులైన యువకవుల్లో నూటికి తొంభైమంది యిందులోలేరు. ఆరుద్రాదు లిందులో ఎందుకులేరో దురూహ్యంగా వుంది. వారివి ఎవరూకోరలేదో, కోరినా పంపలేదో తెలియదు. మొత్తంమీద యీ సంకలనంలో యిది పేర్కొనదగిన పెద్దలోపం. ఈ సంకలనంలోపడి పది హేనుమంది కవులు సంప్రదాయచ్ఛందస్సు కాని Free Verse పద్ధతి గేయాలు రాశారు, వాటిలో అమరేంద్రరాసిన

'అక్కా చెల్లెళ్ళు' అనే గేయం బాగుంది. "బతుకు గుండెలమీద పీటవాలుగా పాకే మరణపు పీడమరుపు" అని యిందులో నిర్వ చించాడు కవి

మరికొన్ని యితర విశేషాలు, ఆస్థానకవిగారు "పూతమెరుంగులన్" అన్నధోరణిలో 24 పంక్తుల ఉత్పల మాలిక రాశారు ఇది సంకలనంలో రెండో శీర్షిక. 12 పంక్తులు అచ్చ తెనుగు కవిత్వానికీ, 12 పంక్తులు సంస్కృత-తెనుగుకవిత్వానికీ మచ్చుచూపించారు. చూడండి.

"పూలుపులుగుల క్రాలే ముగుదమొల్క-చనుంగవవోలెఁ గులుక-బె
ళ్కులు గని మేలికైతము(దెలుంగున(బల్కెడుకల్కి..
విలసదమర్త్య వాఙ్మయ కవిత్వమునాన్ భుజగేంద్ర భూషణో
జ్వలమణిరజ్జటా పటల సంవిలురద్ది విషత్తరంగిణీ
చలదురువీచికానికర శబ్దఘణంఘణ దంధశార్పటీ...

అలాగే నవ్యకవీంద్రులను సంబోధించి షేక్‌దావూద్ రాసిన 66 పంక్తుల చంపక మాలిక కూడా వుంది. శ్రీ పుట్టపర్తి నారాయణచార్యులగారి ద్విపద 'మహాకావ్య'మైన పండరి భాగవతమునుండి కొంతభాగం యీ సంకలనంలో చేర్చబడింది. దువ్వూరి రాసిన ఉమర్‌ఖాయాం పద్యాలు (మధుపాలిక) మధురంగావున్నాయి. ఆవిషయమహత్త్వమేమో, ఎంతమందిరాసినా యింకా మాధుర్యంజాలువారుతూనే వుంటుంది. శ్రీ పంతుల లక్ష్మినారాయణ శాస్త్రిగారు భగవద్గీతను 20 పద్యాల్లో ముగించారు, ఒక్కొక్క యోగానికి ఒక్కపద్యం వంతున. సాంఖ్య, మోక్ష సన్యాసయోగాలకు మాత్రం రెండు రెండు శ్రీ నాయని సుబ్బారావుగారు 'వేదనా వాసుదేవం'లో "నను నొక్క మొక్కగా నీ ఘన పర్వత శిఖరభూమి కల్పింపగదే" అని ఏడుకొండలవాణ్ణి వేడుకున్నారు, కొండమీద మొక్కగా పుట్టాలనే కోర్కె కొత్తగా అందంగావుంది. 'ఆమె' అనే ఖండికలో శ్రీ అన్నాప్రగడ శ్రీ రామమూర్తిగారు "ఎవడురావాడు చెరిచినాడిట్లు నాదు నవరసానంద లోక సంచారసుఖము" అనే ఎత్తుగడ ఎవ్వడా క్రూర కర్మరుడెవడు నీలజలద నిర్ముక్త" అనే మాతృగీతాల ఎత్తుగడను గుర్తుకు తెస్తోంది.

పోతే వ్యాసరచయితల్లో గిడుగు, జమ్ములమడక, దువ్వూరి వెంకటరమణశాస్త్రి, వేదాల తిరువెంగళాచార్యులు, దీపాలపిచ్చయ్య శాస్త్రి, సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి, వంటి ఉద్దండ పండితులూ, జి వి కృష్ణరావు, అమరేంద్ర, బి రామరాజు, వసంతరావు వెంకటరావు వంటి ఆధునికులూవున్నారు. వ్యాసాల్లో సగానికి సగం, విషయ ప్రాధాన్యం బట్టి కాబోలు సామాన్యపాఠకుడికి అందుబాటులోలేవు. విషయమెంత గొప్పదైనా, అదివేదాంతమైనా తర్కశాస్త్రమైనా అందరూ అందుకోగలిగేటట్లు చెప్పడం మన పండితుల్లో చాలామందికి చేతకాదు. అది పాశ్చాత్య వ్యాసరచయితలకే చెల్లు అందుకే మన శాస్త్రాల పట్ల ప్రజలకు ఇంకా అంత చిన్నచూపు.

శ్రీ దువ్వూరి వెంకటరమణశాస్త్రి గారి' ఉక్తిలాలిత్యం' అనే వ్యాసం బ్రహ్మాండంగా వుంది. చిన్నయ్యసూరి బాలవ్యాకరణంలో రాసిన ప్రతిమాటకూ వెనుకదాగిన అర్థమేదో, ఆయన ఆంతర్యమేదో చక్కగా వివరించారు చిన్నయసూరి భావమేమో గాని శాస్త్రిగారి ప్రతిభకు మెచ్చుకోవలసిందే. నిజానికి యీవ్యాసం ఎవరికీ పనికిరాని వ్యాకరణం గురించి అయితే నేం-మంచి రంజుగా రాశారు. అలాగే త్యాగబ్రహ్మ, స్వప్న శ్రీనాథం, 'కృష్ణపక్షం'లో ప్రకృతి, జగన్నాథ పండితరాజు, శ్రీరామసాహితీ రామాయణము-మహాకావ్యము, నాచన సోముని నవీనగుణము, తాంబూల సేవనప్రశంస, బసవరాజు అప్పారావు గేయకవితా పరిశీలన, అమరజీవి బాపిరాజు అనే శీర్షికలుగల వ్యాసాలు కాస్త సాహిత్య పరిచయంకల సామాన్య పాఠకుడికికూడా అందుబాటులో వున్నాయి. భారత గర్భ రామాయణ కర్త శ్రీ రావిపాటి లక్ష్మీనారాయణగారు "గర్భకవిత్వం" అనేవ్యాసంలో ఆ కవిత్వం లోని కొన్ని మెళుకువలు చూపించారు. పండితకవులు కవిత్వంలో ఎన్ని 'ఫీట్స్' చేయడానికి వీలుందో యీవ్యాసం నిరూపిస్తుంది.

శ్రీయుతులు బెజవాడ గోపాలరెడ్డి (రవీంద్రుని సౌందర్యాదర్శము), కల్లూరి చంద్రమౌళి (రామాయణము-సుందరకాండము) తెన్నేటి విశ్వనాథం (వేదకాలమందును వ్రాతగలదు) గార్లుకూడా యీసంకలనంలో మంచి వ్యాసాలురాశారు ఆస్థాన కవీశ్వరులతో సహా ఆరుగురుకవులు సంస్కృత శ్లోకాలుకూడా రాశారు, చివరి 50 పేజీలలో రచయితల పరిచయం, కవిరచనా పరిచయానుక్రమణికా వున్నాయి.

ఏ సాహిత్య సంకలానికైనా ఏదో ఒకనిర్దిష్టమైన దృక్పథం వుంటేనే అది నిలుస్తుంది: 'వైతాళికులు' నవ్యసాహిత్యానికి, 'కల్పన' అభ్యుదయ సాహిత్యానికీ ప్రతినిధులైనట్లు. ఈ 'శాంతి' సంకలనానికి అదేమీ ఉన్నట్లు కనిపించదు. అనేకుల రచనలను క్రోడీకరించడం జరిగింది. అయినా ఇంతబాహుళ్యం మీద ఒకదృక్పథంతో సంకలనంచేయడంకూడా సాధ్యంకాదేమో. చక్కనిగుడ్డ బైండు వెనుకఅట్టమీద నీలాకాశంలో ఎగురుతూ అందాలుచిందే శాంతి కపోతం, ప్రతివారూ తప్పక చదువవలసిన సంకలనం. ప్రతిగ్రంథాలయం, ప్రతిసంస్థ కొనవలసిందే ••

—కులపతి

గ్రంథ సమీక్ష:

# వెలుగు వంటి "వెలుగు"

పృథ్వీతలంపై ప్రాణికోటి ప్రభవించటానికి, ప్రభవించి ప్రవర్ధమానం కావటానికి 'వెలుగు' (Light) చాలా అవసరం. మానవుని జిజ్ఞాస ఫలితంగా ప్రకృతిశక్తుల ప్రాభవాన్నిగురించి విపులంగా అడుగడుగునా దృష్టాంతములతో పాఠకుల మనస్సు ఉత్తేజపరచుతున్నట్లువిశదీకరించబడినవెలుగువంటిపుస్తకం వెలుగు

రచయిత: శ్రీ వేమరాజుభానుమూర్తివెల: రూ 3.50 పుటలు: 200 పూర్తిబౌండు శాస్త్రవిజ్ఞానం,చరిత్ర, తెలుగు, ఉర్దూ అకాడమీ హైద్రాబాదు

పుస్తకము చదువుతున్నంత సేపూ కొంత భాగం మనకు ఇంద్రజాల మహేంద్రజాలంతో కూడిన గంధర్వలోకపు గాథలాగ అనిపిస్తుంది అడుగడుగునా చిత్ర విచిత్రాలతో విస్మయజనకంగా ఉండే సాహస యాత్రలాగా కనబడుతుంది. వెళ్ళగా వెళ్ళగా 'వెలుగు'పరమాణుగర్భకుహరంలో దాగివుండే వింతలూ, విశేషాలు అన్నింటినీ చూపెడుతుంది కాని ఇంద్రజాలంకిని, వెలుగుకును గల ఒక తేడా కనబడుతుంది. గంధర్వలోకపు గాథలలో కనబడే సంఘటనలన్నీ కేవలం కాల్పనికమైన అబద్ధాలయితే ఇందులో మనకు కనబడేవన్నీ వాస్తవిక నిబద్ధాలు.

సామాన్య మానవులకు-అర్థమయే పారిభాషిక పదములతో ఆంగ్లభాషా పరిచయములేని తెలుగువారికి శాస్త్ర విజ్ఞానమునందు 'ఫిజిక్సు' అనబడు భౌతిక విజ్ఞానమునకు సంబంధించిన "వెలుగు" అను భాగమును పూర్తిగా గ్రాహ్యమగునట్లు సులభశైలిలో వ్రాయబడినది. శాస్త్రవిజ్ఞానమునందు కనిపెట్టబడిన పరమాణు నిర్మాణము సాపేక్ష్య సిద్ధాంతము. వర్ణపటదర్శిని తరంగవాద సిద్ధాంతము మొదలుగా గల అధునాతన శాస్త్ర విజ్ఞాన విశేషములన్నియు ఈ 200 పుటల పొత్తమునందు పొందుపరచి ప్రతివారికిని అర్థమవునట్లు అందించగలిగిన శ్రీ భానుమూర్తిగారు ప్రశంసనీయులు. "నెగళ్ళద్వారా సందేశం పంపడం", "అద్దాన్ని బట్టే అందమంతా", "వినబడుతుందా? కనబడుతుందా?", "మెరుపు ముందా, ఉరుము ముందా?", "ఆదిత్య కిరణాలలో అగ్ని జ్వాలలు"? "అరివీరులు ఆటకట్టడానికి ఆర్కిమెడీస్ అద్భుతోపాయం", "కెమెరా", "అంతరిక్షంలో అన్వేషణ", "అన్ని రంగులూ వెలుగులే", "పలుకనేర్చిన ప్రకాశం", "విశ్వమంతా వెలుగు రూపమే", "వెలుగు జీవగే జీవనకోటికి జీవనం"అన్న చిత్రపట నిదర్శనములెంతో బాగున్నవి. పుస్తకంపేరు "వెలుగు వైశిష్ట్యం" అంటే ఇంకా బాగుండేదేమో!

సమగ్రమైన చక్కని విషయ విజ్ఞాన సంభరితమైన యీ గ్రంథం భారతీయ పారిశ్రామిక శాస్త్ర విజ్ఞాన సమితి ప్రధానాధికారి శ్రీ యమ్.యస్.ధాకర్ గారిచే ప్రశంసించబడి, ఆంధ్రశాసన సభాధ్యక్షులు పద్మభూషణ బిరుదాంకితులైన డాక్టర్ అయ్యదేవర కాళేశ్వరరావు గారికి అంకితమివ్వబడినది.

ప్రతి తెలుగువారి ఇంట, ప్రతి గ్రంథాలయమునందు ఉండతగిన ఉత్తమ గ్రంథం.

**

# రచయితలు

1. శ్రీ దాశరథి, ఆలిండియారేడియో, హైద్రాబాదు_4
2. శ్రీ కొడవటిగంటి కుటుంబరావు, చందమామ పబ్లికేషన్సు, మద్రాసు_26.
3. శ్రీ రామప్రోలు సుబ్బరామయ్య, కార్యదర్శి, పంచాయతీ బోర్డు కీడింగురుమ్, వేములకోటపోస్టు, మార్కాపూర్ తాలూకా, కర్నూలు జిల్లా.
4. శ్రీ దివాకరుని వెంకట సుబ్బారావు, ట్రిమల్ఘిరి, సికింద్రాబాదు.
5. శ్రీ మధురాంతకం రాజారాం, మొగరాల, చిత్తూరు జిల్లా.
6. శ్రీ కె. తారారావు, యం. యల్. ఏ. క్వార్టర్సు, హైద్రాబాదు.
7. శ్రీ వి. శశాంక, గాంధీనగర్, కాకినాడ, తూర్పు గోదావరి జిల్లా.
8. శ్రీ వై. సుబ్బారావు, వజీరు సుల్తాన్ సిగరెట్టుఫ్యాక్టరీ, హైద్రాబాదు_20
9. శ్రీ జి. కల్యాణసింగ్, స్త్రీజనాభ్యుదయశాఖ, హైద్రాబాదు_4
10. శ్రీ యస్. టి. పి. రామకృష్ణమాచార్యులు, కాకినాడ, తూర్పు గోదావరి జిల్లా.
11. శ్రీ ఇసుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి, హిమాయత్‌నగర్, హైద్రాబాదు
12. శ్రీ జి. వి. రామమూర్తి, దక్షిణ భారత హిందీ ప్రచారసభ హైద్రాబాదు_4
13. శ్రీ బులుసు_జీ_ప్రకాశ్, విజయనగరం.
14. శ్రీ శనగన నరసింహస్వామి, ఆంధ్రోపన్యాసకులు, ఆంధ్ర లయోలా కళాశాల, గుణదల, విజయవాడ.
15. శ్రీ డి. రామలింగం, సహాయసంపాదకులు, ఐ. సి. ఎ. ఆర్ కృషిభవన్, న్యూఢిల్లీ_1
16. శ్రీ టి. మధుసూదనరావు పి అచ్. 'ప్రభుత్వ' కళాశాల, కాకినాడ తూర్పు గోదావరి జిల్లా.
17. శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, స్పెషల్ ఆఫీసర్, సంస్కృత విద్య, హైద్రాబాదు
18. శ్రీ కొల్లా శ్రీకృష్ణారావు, సీనియర్ తెలుగు పండితులు, పాలపాడు, వయా పెదనందిపాడు, గుంటూరు జిల్లా.
19. చక్రవర్తి, హైద్రాబాదు.
20. శ్రీ కుంటిమద్ది శేషశర్మ, తెలుగు పండితులు, ధర్మవరం, అనంతపురం జిల్లా.
21. శ్రీ టి. వి. కృష్ణ, ఆంధ్రపత్రిక విలేఖరి, హైద్రాబాదు.
22. శ్రీ కొత్త సత్యనారాయణ చౌదరి, తెలుగుపండితులు, ఏ. వి. యన్. కళాశాల, విద్యుత్పురి, గుంటూరు జిల్లా.
23. వాఙ్మయమహోధ్యక్ష వడ్లమూడి గోపాలకృష్ణయ్య (ప్రజానీతి కృష్ణశతకశతి) ఎడిటర్, ఆంధ్రప్రదేశ్ (తెలుగు) హైద్రాబాదు

---

## ఆంధ్రప్రదేశ్

### శుభకృత్ ఉగాది ప్రత్యేకసంచిక

ఆంధ్రప్రదేశ్ "తెలుగు" ఏప్రిల్ 1962 సంచిక శుభకృత్ ఉగాది ప్రత్యేకసంచికగా వెలువడుతుంది. ఈ సంచికలో ప్రకటనార్థము ప్రత్యేకంగా సాహిత్య, చారిత్రక వ్యాసాలు, పద్యాలు, నాటికలు హాస్యరచనలు, 'ఉగాది ప్రత్యేకసంచికలో ప్రకటనార్థ' మని మా కార్యాలయమునకు 4_3_1962 లోపుగా అందేటట్లు పంపించవలెను. ఈ రచనలు ఆంధ్రసంస్కృతికి సంబంధించి ఉత్తమస్థాయిలో ఉండవలెను.

ఏజెంటు తమకు అదనంగా కావలసిన ప్రతులనుగూర్చి 1962 మార్చి 4వ తేదీ లోపుగా తెలియజేయాలి.

_డైరెక్టరు, సమాచార పౌరసంబంధములశాఖ



# మీటర్ల లోనికి మార్పు

పొడవు, వెడల్పుల కొలతకి మీటరు ఒక ప్రమాణముగా అక్టోబరు 1 వ తేదీనుంచి అమలులోనికి వచ్చింది. ఒక ఏడాదిలో గజము, అడుగు, అంగుళం ప్రమాణాలు చట్ట సమ్మతము కానివి అవుతాయి.

బట్టల తానులమీద అప్పుడే మీటర్ల గుర్తులు వేయబడినాయి. వీటి ధరలలో కూడా 'మీటరు ఇంత' అని వేయబడింది.

ఒక మీటరు అంటే ఒక గజము పైన
3⅜ అంగుళాలు

**మెట్రిక్ కొలతల ప్రకారం కొనండి**

భారత ప్రభుత్వముచే జారీ చేయబడినది

# దేశంతోపాటు మీరుకూడా అభ్యుదయం పొందండి !

మీరు మిగుల్చుకున్న డబ్బును

భారత ప్రభుత్వ చిన్న మొత్తాల పొదుపు పథకమునకు పెట్టుబడి పెట్టండి !

భా ర త దే శ ం యొ క్క

సమాజాభివృద్ధి కార్యక్రమమునకు, గొప్ప నదీలోయ ప్రాజెక్టులకు,

రైలుమార్గములు, రోడ్ల అభివృద్ధికి తోడ్పడండి !

మీ డబ్బును ఈ క్రింది ఆకర్షణీయమైన గ్యారంటీడ్ సెక్యూరిటీలలో దేనిలోనైనా పెటుబడి పెట్టండి !

**12 సంవత్సరముల జాతీయ ప్రణాళికా పొదుపు పత్రాలు**

పరిణతి పొందిన పిమ్మట నూటికి సంవత్సరానికి 5.41 వంతుల చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది. ఇవి రూ. 5 లవి మొదలు రూ. 25,000 లవి వరకూ లభిస్తాయి. వ్యక్తిగతంగా ఒక్కొక్కరు రూ. 25,000 ల వరకూ కొనవచ్చు. రూ. 25.000 ల విలువ పత్రాలు ప్రావిడెంటు ఫండ్ పెట్టుబడులకు మాత్రమే.

**10 సంవత్సరముల ట్రెజరీ సేవింగ్సు డిపాజిట్ సర్టిఫికెట్లు**

ఏటా నూటికి 4 వంతులు వడ్డీ చెల్లించబడుతుంది. ఒక్కొక్కరు రూ. 50 లవి మొదలు రూ. 25,000 ల వరకూ కొనవచ్చు.

**15 సంవత్సరాల యాన్యుయిటీ సర్టిఫికెట్లు**

జారీ చేయబడు ధరలు : రూ. 1,330, రూ. 3 325, రూ. 6,650, రూ. 13,300, రూ. 26,600. ఈ సొమ్ము నూటికి యేడాదికి 4.25 కు కొంచెమెక్కువగా వచ్చే చక్రవడ్డీతోసహా నెలసరి వాయిదాలలో 15 సంవత్సరాలలో తిరిగి చెల్లించబడుతుంది. ఒక్కొక్కరు రూ. 26,600 ల వరకూ కొనవచ్చు.

**పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకు అకౌంట్లు**

25 నుంచి 10.000 ల వరకు గల నిల్వలపై నూటికి 2½ చొప్పున, రూ. 10,000 లకు మించిన నిల్వలపై నూటికి 2 చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది.

**క్యూములేటివ్ టైమ్ డిపాజిట్ పథకం**

నెలనెలా రూ. 5, 10, 20, 50, 100 లేక 200 వంతున 5 లేక 10 సంవత్సరాలపాటు డిపాజిటు చేస్తే, వడ్డితోసహా మొత్తం అంతా ఒక్కసారే చేతికి వస్తుంది.

**ఐదేండ్ల వడ్డీలేని బహుమతి బాండ్లు**

1965 ఏప్రిల్ 1న ఎంత విలువ బాండ్లుకొన్నారో అంతమాత్రమే తిరిగి ఇవ్వబడుతుంది.

బాండ్లు రూ. 100, రూ. 5 ల విలువగలవి వరుసగా జారీచేయబడుతాయి. లాట్లు మూడు నెలల కొకసారి అంటే ప్రతి సంవత్సరం జూన్ 1 న, సెప్టెంబరు 1 న, డిసెంబరు 1 న, మార్చి 1 న డ్రా వేయబడుతాయి. డ్రానిబట్టి ప్రతిసారి రూ. 100 లు విలువజేసే 1 లక్ష బాండ్లకు 40 బహుమతులు. రూ. 5 లు విలువజేసే 10 లక్షల బాండ్లకు 278 బహుమతులు ఇవ్వబడుతాయి.

**ఆదాయంపన్ను లేకుండా మీకు మంచి ఆదాయం లభిస్తుంది! భావిభారత సౌభాగ్యానికై పెట్టుబడిపెట్టండి!**

ఈ పెటుబడులకు సంబంధించిన నిబంధనలను గూర్చి యితర వివరాలు మీకు చేరువగా వున్న పోస్టాఫీసు వద్దగాని రీజియనల్ నేషనల్ సేవింగ్స్ ఆఫీసర్, 10-2-2, ఎ.సి. గార్డ్సురోడ్డు, హైదరాబాదు, లేక, మీ జిల్లా కలెక్టరు ఆఫీసులోని, జిల్లా ఆర్గనైజరు వద్దగాని తెలుసుకోవచ్చు.

# ప్రాధాన్యము
# ప్రాధాన్యము
# ప్రాధాన్యము

ఒకరు చాల జబ్బుగా ప్రమాదస్థితిలో వున్నారు ...
తక్షణం కబురు వెళ్ళాలి
*దానిని "ప్రయారిటీ" టెలిగ్రాము ద్వారా పంపండి*

జబ్బులు, ప్రమాదాలు, మరణాలు మొదలైన వార్తలను పంపడానికి 'ప్రయారిటీ' టెలిగ్రాము సౌకర్యం వున్నది.

ఎక్స్‌ప్రెస్, అర్జంట్ సందేశాలకంటే దీనికి అత్యధిక ప్రాధాన్య మివ్వబడుతుంది; మామూలు ఎక్స్‌ప్రెస్ టెలిగ్రాముకు అయ్యే ఖర్చు మాత్రమే అవుతుంది.

*ఇట్టి టెలిగ్రామును పంపుతున్నప్పుడు "ప్రయారిటీ" అని వ్రాయండి*

ఈ సౌకర్యంకోసం
మాతో సహకరించండి
తంతి – తపాలా శాఖ

DA 60/623

# ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

## సమాచార, పౌరసంబంధముల శాఖ, హైదరాబాదు

### ప ట్టి క

**ఇ ం గ్లీ ష**

| | | రూ. న. పై. |
|---|---|---|
| 1. అరకులోయ | .. | 0 — 60 |
| 2. ఆంధ్రప్రదేశ్—విశేషాలు | .. | 0 — 25 |
| 3. ఆంధ్రప్రదేశ్—జిల్లాలు | .. | 0 — 25 |

**తె లు గు**

| | | |
|---|---|---|
| 1. శ్రీ అల్లూరి సీతారామరాజు జీవితచరిత్ర | | 2 — 75 |
| 1. 'ప్రగతి గీతాలు' | .. | 0 — 25 |

**ఉ రు దు**

| | | |
|---|---|---|
| 1. ఆహారోత్పత్తి | .. | 0 — 12 |
| 2. గిరిజన సంక్షేమం | .. | 0 — 12 |
| 3. మత్స్యసంపద | .. | 0 — 12 |

పో స్టే జి అ ద న ం

ప్రతులను సమాచార పౌరసంబంధముల శాఖ

సమాచార కేంద్రంనుంచి పొందవచ్చు.